# చతుర

డిసెంబర్ : 1982

సంపుటి : 5 సంచిక : 11

## ఈ నెల సమగ్ర నవల

పాములు పగపడతాయని కొందరి నమ్మకం. పాము సంగతేమోగాని మనిషి మాత్రం పగపడితే పాముకన్నా ప్రమాదకరంగా మారతాడని చాలామందికి అనుభవం .... అలాంటి సమాజంలో పాము నేఇలవేల్పుగా కొలిచేకుటుంబాల్లో వరసపెట్టి కాటేసినట్లుగా పాములవల్లనే మరణాలు మొదలయితే....? అంతటి భక్తులు కూడా....

# పాము...పాము

అంటూ పదేపదే ఎందుకు బెంబేలెత్తిపోయారు. ఇలవేల్పు కళ్ళెదుటే కనిపించినపుడు వారి నమ్మకాలు ఏమవుతాయి? వారి ఆలోచనలు ఎలా వుంటాయి? హేతుబుద్ధి పని చేస్తుందా!

## బుర్రా సుబ్రహ్మణ్యం

పాములు, వాటిని పెంచే వ్యాపారులు, పూజించే భక్తులు వారి వారి మనస్తత్వాలు సమీక్షిస్తూ రాసిన సరికొత్త రచన 'పాము....పాము' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం : దిలీప్ బెనర్జీ

రెండవ కవరు } రాధారెడ్డి, రాజారెడ్డి
మూడవ కవరు }

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.


చతుర

*ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.*

చతుర

# గడ్డం చరిత్ర

ఒకప్పుడు తెగబారెడు గడ్డం పెంచుకొని సువాసన నూనెలు రాసుకొని పోజులు కొట్టడం ఫాషన్‌గా వుండేది. ఫాషన్లు ఎప్పుడూ నిలకడగా వుండవు గనుక కొన్నాళ్ళకి గడ్డం పెంచడం పాత ఫాషనయిపోయి షేవింగ్ యుగం ప్రారంభమయింది. ఈమధ్య కొందరు పాశ్చాత్య పరిశోధకులు ప్రపంచ చరిత్రలో గడ్డం గీసుకోవడం తెలిసినవారిలో ప్రథములు రోమన్స్ అని తేల్చారు.

రోమన్లను కేవలం గడ్డం గీసుకోవడంతోనే ఆగలేదు. మగపిల్లవాడు పెరిగి మొదటిసారిగా గడ్డం గీసుకొనే సందర్భంలో ఘనంగా ఉత్సవం జరిపేవారు. గడ్డం గీసుకోడానికి రేజరును ఉపయోగించిన క్షణంనుంచి ఆ పిల్లవాడికి పెద్దరికంవచ్చినట్లు భావించేవారురోమన్స్. క్రీస్తు పూర్వం 296 సంవత్సరంనాటికే సెపియో ఆఫ్రికన్లకు ప్రతిరోజూ గడ్డం గీసుకొనే అలవాటు ఉండేది.

అప్పట్లో చాలా దేశాల్లో మగవారికిమల్లె గడ్డాలు, మీసాలు వున్న స్త్రీలను సజీవదహనం చేసేవారు. గడ్డం, మీసాలున్న స్త్రీలను వారు మంత్రకత్తెలుగా భావించి అలా చంపేవారు. ప్రారంభంలో రష్యా రాజులు గడ్డాలంటే మోజుపడినా పీటర్ పోర్సన్ అనే ఓ రాజు ఈ అలవాటుకి ఫుల్‌స్టాప్ పెట్టి నున్నగా గడ్డం గీసుకొని కొత్త ఫాషన్‌కి శ్రీకారం చుట్టాడు. ఇతనికి గడ్డం పెంచే మనుషులంటే సరిపడేది కాదు. అందుకని గడ్డం ఉంచుకోదల్చు



కున్నవారు పన్ను కట్టితీరాలని ఆజ్ఞ జారీ చేశాడుకూడా.

ప్రపంచవ్యాప్తంగా అనేక శిలాశాసనాలను పరిశీలించిన పురావస్తు శాస్త్రజ్ఞులు గడ్డం గీసుకొనే అలవాటు క్రీస్తుశకం 17వ శతాబ్దం నుండి అదీ కేవలం యూరపులో వుండేదన్న నిర్ణయానికి వచ్చారు. ఫ్రాన్సుని పాలించిన 13వ

# ప్రపంచం



లూయిస్, 14వ లూయిస్‌లకు గడ్డం వుండేదికాదు. అందుకని ప్రజలు రాజు గారి ఆదరం సంపాదించాలంటే నున్నగా గడ్డంగీసుకొని పోవల్సి వచ్చేది. అప్పుడు కూడా ఫ్రాన్స్ ఫాషన్‌లలో అన్నిదేశాల కన్నా ముందుండేది. తర్వాత యూరప్ లోని ఇతర దేశాలుకూడా ఫ్రాన్స్ ప్రారంభించిన గడ్డం గీసుకోడాన్ని అమలు పర్చాయి. ఇప్పటివరకూ ఆ ఫాషనే అమల్లోవుంది. మధ్యమధ్య పిల్లిగడ్డాలూ వగైరా దర్శనమిస్తుంటాయనుకోండీ, అయినా ఫాషన్ చివరికి గడ్డం గీసుకోడం దగ్గరకే వచ్చి ఆగుతుంటుంది.

## మానిటర్

కాలుమీద కాలేసుకొని, ఫైళ్ళన్నీ పక్కన పెట్టి ఒళ్ళుమర్చి నవలలూ, పత్రికలూ, కథాకమామీషూ చదువుకొంటూ బాస్ రాగానే గప్‌చిప్ సాంబార్ బుడ్డి అయిపోయే పనిదొంగలకి పారాహుషార్. ఎందుకంటే ఎవరెంత పనిచేస్తున్నారో ఇట్టే చెప్పేయగల 'ఎలక్ట్రానిక్ వాచ్ డాగ్', మార్కెట్‌లోకి వచ్చింది.

ప్రస్తుతం బ్రిటన్‌లోని ఫాక్టరీలు, సంస్థలు, ఆఫీసుల్లో ఈ పరికరాన్ని అప్పుడే ఉపయోగిస్తున్నారు కూడా. ఆశ్చర్యం ఏమంటే అక్కడ యాజమాన్యం, ట్రేడ్ యూనియన్లు కూడా ఈ పద్ధతిని ఆహ్వానిస్తున్నాయి. ఈ ఎలక్ట్రానిక్ కాపలాదారు పేరు పి.ఎ.ఎమ్. అంటే పెర్‌ఫార్మెన్స్ ఎచ్చివ్‌మెంట్ మానిటర్. క్లుప్తంగా దీన్ని మానిటర్ అని పిలవచ్చు. ఎందుకంటే క్లాసు రూమ్‌లో మానిటర్ మిగిలిన విద్యార్థుల పనితీరు, ప్రవర్తనను గమనించినట్లే ఈ పరికరం ఉద్యోగుల పనితీరును కొలుస్తుంటుంది.

ఒక వ్యక్తి ఉద్యోగంలో చేరేముందు నిర్ణయించబడిన కాలపరిమితిలో ఎంత పని చేయగలడన్న విషయంలో యాజమాన్యంతో ఒక ఒప్పందం కుదుర్చు

కుంటాడు. పి. ఎ. ఎమ్. ఆ వ్యక్తి యొక్క పనితీరును నమోదు చేస్తూ మొదట కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం అంతకన్నా ఎక్కువ పనిచేస్తున్నాడా, తక్కువ పని చేస్తున్నాడా అన్న విషయాలను సరిపోల్చుతుంటుంది ఎప్పటికప్పుడు. సూపర్‌వైజర్ల పనల్లా ఆ వారు. అంతేకాదు ఉద్యోగుల పనిని పర్యవేక్షించడమే గాక బోనస్ రూపంలో చిన్న చిన్న పనులద్వారా ఎవరెంత సంపాదిస్తున్నారు అన్న వివరాలను కూడా ఈ పరికరం అందిస్తుందట.

ఆహా... దీనివలన పని దొంగలను ఏరివేసి ఉత్పత్తి,లాభాలూ పెంచుకోవచ్చు




పరికరం రూపొందించేరికార్డులను తిరగేసి ఉద్యోగుల పనికి విలువకట్టి దానికి తగినట్లు వ్యవహరించడమే.

ఈ పరికరాన్ని ఉపయోగించడం వలన ఉత్పత్తి 25 శాతం పెరగడమే గాక ఒక వ్యక్తికి శిక్షణ ఇవ్వడానికి పట్టే కాలాన్ని 30 శాతం తగ్గించవచ్చునంటున్నారు ఈ పరికరాన్ని ఉత్పత్తి చేసే

నని యాజమాన్యాలు ఉత్సాహపడుతుంటే, మా సత్తా ఏమిటో చూపించి మా సామర్థ్యానికి తగినడబ్బులు గోళ్ళూడగొట్టి మరీ లాక్కోవచ్చునని వర్కర్స్ యూనియన్లు సంబరపడుతున్నాయి. ఇలాంటి పరికరం వుంటేగాని ఇటు పని దొంగలకీ, అటు ఎంతపని చేసినా ఊరికే కూర్చోపెట్టి జీతాలిస్తున్నట్లు బాధపడిపోయే యాజమాన్యాలకీ రోగం కుదరదు.

# వింత పట్టణం

భూగర్భంలో నిధులు, నిక్షేపాలే కాదు, సలక్షణమైన మనుషలు గల పట్టణాలు కూడా వుంటాయనేది ఆశ్చర్యం కలిగించే విషయమైనా నమ్మవలసిన నిజమే. గరియానా అని పిలువబడే ఓ వింత పట్టణం ఆఫ్రికాలో వుంది. ఇది భూమి ఉపరితలానికి 50 అడుగుల లోతున భూగర్భంలో వుంది. భూమి ఉపరితలం నుంచి ఈ పట్టణానికి కొండ లోంచి సొరంగం తవ్వి రాకపోకలకు మార్గం ఏర్పరిచారు. ఈ సొరంగ మార్గం ఒక్కటే ఆ పట్టణానికి మనల్ని చేర్చే రహదారి. దీనిలో ప్రయాణం అంత సులభంకాదు. ఇంచుమించు నిట్టనిలువుగా వున్నట్లనిపించే ఈ ఏటవాలు సొరంగం లోపల చిమ్మ చీకటిగా, తడిగా, బురదతో నిండివుండి కొత్త వాళ్లు పొరపాటున ప్రవేశిస్తే జర్రున కాలుజారి ఒళ్లు హూనమవుతుంది. ఈ సొరంగం ఆ పట్టణంలోని ప్రధాన రోడ్ల కూడలి వద్ద అంతమవుతుంది. పట్టణంలో కచ్చా రోడ్లు మాత్రమే వున్నాయి. 'అక్కడి విశాలమైన రోడ్డుతో పోలిస్తే మన పల్లెల్లో సందులు మరింత విశాలమైనవనే అనుకోవాలి. అక్కడ అన్నింట్లోకీ వెడల్పయిన రోడ్డు మీద పక్కపక్కనే ముగ్గురికన్నా ఎక్కువమంది నడువలేరు.



ఆ పట్టణంలోని ఇళ్ళన్నీ మట్టితో నిర్మించినవే. ద్వారం ఒకటే వుంటుంది. కిటికీలు, వెంట్‌లేటర్లు వుండవు. భూగర్భంలోని పట్టణం కదా గాలి ఎలా వస్తుంది? వీళ్ళకు ప్రాణయామ విద్యగానీ వచ్చేమో అన్న సందేహం కలుగుతోంది కదూ- పట్టణంలోకి స్వచ్ఛమైన గాలి వచ్చే ఏర్పాట్లున్నాయి.

స్త్రీలు కూడా పొలాల్లో పని చేస్తారు. ఆవులు, గొర్రెలు, ఒంటెలను పెంచుతారు. వీరు హెర్యూబ్య, అలబికేలు కలగలిసిన ఒక సంకర భాష మాట్లాడతారు.



ప్రియ తోడుగా ఉంటే చాలు...
మరింత సంతృప్తి!
GONGURA
PICKLE
IN OIL
priya
బ్రేక్‌ఫాస్ట్ తీసుకొనేవేళ పక్కన 'ప్రియ' ఉంటే ప్రతి ఉదయం రుచులమయం. అదే 'ప్రియ' ఆకర్షణలోని రహస్యం. నోరూరించే పలురకాల పచ్చళ్ళలో మీకు కావలసింది ఎన్నుకోండి.
వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.
* మామిడికాయ * నిమ్మకాయ * టొమాటో
* అల్లం * గోంగూర * ఉసిరికాయ * చింతకాయ
* పండు మిరపకాయ * వంకాయ
తీపిరకాలు : * మామిడికాయ * అల్లం
ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్
Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED

వాళ్ళకి స్వంత చట్టాలున్నాయి. 12 ఏళ్ళకోసారి చట్టాలను రూపొందించే పెద్దలను ఎన్నుకొంటారు. దొంగతనాలు గాని, తగవులుగాని అక్కడ మచ్చుకైనా లేవట. ఈ వింత ప్రపంచం గత రెండు వేల సంవత్సరాలుగా వుందట. పాపం బావిలో కప్పల్లాంటి జీవితం ఎలా గడప గలుగుతున్నారోనని మనం సానుభూతి చూపినా వారికదే స్వర్గధామం మరి.

# మరుగుజ్జులు

తనువుకెన్ని గాయాలైనా మాసిపోతాయి గాని మనసు కొక్కగాయమైనా మాసిపోదు అనే నిజాన్ని మనస్తత్వ శాస్త్రవేత్తలు, వైద్యులు కూడా అంగీకరిస్తున్నారు. ప్రతి చిన్న విషయానికీ,చీటికీ మాటికీ పిల్లల్ని తిడుతుంటే వారి మానసిక పెరుగుదల కుంటుపడుతుందన్న విషయం అందరికీ తెలిసిందే. ఇప్పుడు మరో కొత్త విషయం వెలుగులోకి వచ్చింది. తిట్లు, శాపనార్థాలతో పెరిగే పిల్లలు మరుగుజ్జులుగా తయారయే ప్రమాదం వుందని పరిశోధనల్లో తేలింది. పెద్దల నిర్లక్ష్యం, పిల్లల్ని అవమానించడం వంటి విషయాలు శారీరక పెరుగుదలను మందగింపజేసి మరుగుజ్జుతనానికి దారితీస్తాయి. ఈ వ్యాధిని "మానసిక మరుగుజ్జుతనం" అని వ్యవహరిస్తున్నారు. మానవుల్లో ఆలోచన, అనుభూతులకు సంబంధించిన మెదడులోని భాగం దగ్గర్లో గల హైపోథలమస్ నరాలచివర్లకు కలపబడి వుంటాయి. హైపోథలమస్ శరీర పెరుగుదలకు కావలసిన హార్మోన్లను ఉత్పత్తి చేసే పిట్యూటరీ గ్రంథిని ఉత్తేజపరుస్తుంది.



మెదడులో ఒక కేంద్రంలో పడే ఒత్తిడి ఇతర కేంద్రాల పనిమీద ప్రభావం చూపిస్తుంది. పెద్దలనిర్లక్ష్యం,తిట్లు, అవమానాల వలన మానసికంగా బాధపడే పిల్లలలో పిట్యూటరీ గ్రంథి దాదాపు పనిచేయడం మానేస్తుంది.ఫలితంగావారిశారీరక పెరుగుదలకు ఆటంకం ఏర్పడి మరుగుజ్జులుగానే వుండిపోతారని వైద్యపరీక్షల్లో తేలింది.


నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
దంత క్షయాన్ని ఎదుర్కోండి.
Colgate
DENTAL CREAM
Colgate
కోల్గేట్ తాలూకు నమ్మకమైన
ఫార్ములా మీ నోటి శ్వాస
శుభ్రంగా, తాజాగా వుండేలా
చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా,
దృఢంగా వుండేలా చేస్తుంది.
ఎలాగో చూడండి:
మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.
కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.
ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.
గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.
దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!
GK&E.B82.86 TL

నాగవిహార్ వరండా మెట్ల మీద నాగు పాము పడగవిప్పి ఆడుతోంది.

ఆ పాము ఎప్పటినించి అక్కడ తిష్ట వేసిందో ఎవరికీ తెలీదు.

కనుచీకటి పడటంతో వీధిలో లైటు వేద్దామని గుమ్మంవరకు వచ్చిన నాగలక్ష్మి కంట పడిందది.

లైటు వేసిన తరువాత యధాలాపంగా గేటువైపు చూసి, ఆ తర్వాత మెట్ల మీద దృష్టిని ప్రసరించింది నాగలక్ష్మి.

పై మెట్టుకు దాదాపు అడుగు ఎత్తున ఉన్న పడగని ముందుగా చూసిందామె.

ఒక్కక్షణం నాగలక్ష్మికి గుండె ఆగి నంత పనైంది.

ఆమెకు కనిపించినంతవరకు జానెడు పొడవున, వేలెడంత వెడల్పున అడ్డంగా పది - పదిహేను తెల్లని చారలు కని పించాయి. తర్వాత పైనుంచి అటు ఇటు రెండు మూడు వరుసలలో బూడిద రంగులో పొడలు పొడలుగా ఉన్న పొలుసులు అగుపడ్డాయి. అటు ఇటు పొడల మధ్య కూడా తెల్లని చార లున్నాయి.

తెల్ల చారల మధ్యన సన్నగా నలుపు చారికలు!

పడగ భాగంలో ఈ పక్కనా, ఆ పక్కనా తెల్లని అర్ధచంద్రాకారాలు. మధ్యలో అల్లుకుపోయినట్లు నలుపు పొలుసులు.

మంత్రముగ్ధ అయినట్లు ఆ పాము వైపే చూడసాగింది నాగలక్ష్మి.

అప్రయత్నంగా పాముకు నమస్కారం చేసింది.

సుబ్రహ్మణ్యేశ్వరుడు తమ కుటుం బానికి ఇలవేల్పు. తమ కుటుంబాన్ని పాము ఏమీ చేయదని ఆమె నమ్మకం. పాతికేళ్లుగా ఆమెలో ఆ నమ్మకంజీర్ణించుకు పోయింది.

తనకు అయిదేళ్ళ వయసులో నాయ నమ్మ చెప్పిన మాటలు నాగలక్ష్మికి అనుకోకుండా జ్ఞాపకం వచ్చాయి-"పాము మనకు ఇలవేల్పు తల్లీ! ఎప్పుడైనాసరే నీకు పాము కనిపిస్తే దణ్ణంపెట్టుకో! అది నీ జోలికి రాదు. మనం తరతరాలుగా సుబ్రహ్మణ్యేశ్వరుణ్ణి ఆరాధిస్తున్నాం" అని!

అంతకు ముందు ఆ పాము ఎలా ఉందో కానీ లైటు వేశాక దానిలో అస హనం పెరిగినట్లుంది.

చెప్పులు లేకుండా గచ్చుపై నడిచి రావటంవల్ల నాగలక్ష్మి అలికిడి ఆ పాముకు వినిపించలేదు.

ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్టు అలాగే పడగవిప్పి గాలికి కదులుతున్న కలువ పువ్వులా తల అటు ఇటు ఆడి స్తోంది.

అప్పుడప్పుడు చీలిన నాలుకలు బయటకు వస్తున్నాయి.

నాగలక్ష్మికి ఆ పాము పడగకి అటూ ఇటూ ఉన్న రెండు కళ్లు కనిపిస్తున్నాయి.

అవి లేకపోయినా ఒకటే, ఉన్నా ఒకటే అన్నట్లు నిర్జీవంగా ఉన్నాయి.

నాలుకలు బయటకు వస్తున్నప్పుడు నోరు కొద్దిగా తెరుచుకుంటోంది. అలా పాము నోరు తెరుచుకున్నప్పుడల్లా నాగ లక్ష్మి గుండెలు గుబగుబలాడుతున్నాయి. ఎవరో తరుముకు వస్తున్నట్టు ఆయాస పడుతోందామె.

దభాలున తలుపు మూసి లోపలకు వెళ్ళి ఎవర్నైనా పిలిచి పాము సంగతి చెబుదామనైనా తోచలేదు. ఎవరో హిప్న టైజ్ చేసినట్లు ఆమె అలాగే ఆ పాము

వైపు చూస్తోంది.

బయట లైటు వేస్తానని వెళ్ళిన నాగలక్ష్మి పావుగంట గడిచినా మళ్ళీ లోపలికి రాకపోవటంతో సుబ్బలక్ష్మి ఇటుకేసి వచ్చింది.

నాగలక్ష్మి తదేకంగా మెట్లవైపు చూడటం గమనించి, సుబ్బలక్ష్మి కూడా నాగలక్ష్మి కుడిచేతి పక్కనించి చూసి పడగెత్తి ఆడుతున్న పామును గమనించింది.

సుబ్బలక్ష్మి నాగలక్ష్మికి అత్తగారు. ఆమెకు అరవయ్యేళ్ళుంటాయి. ఆవిడ పుట్టింటివారికి కూడా సుబ్రహ్మణ్యేశ్వరుడే ఇలవేల్పు.

పామును చూసీచూడగానే అప్రయత్నంగా నాగలక్ష్మి కుడి జబ్బను పట్టుకుంది సుబ్బలక్ష్మి.

ఆవిడా నిశ్చేష్టురాలైంది - పామును చూసి. అత్తగారు తన చేతిని పట్టుకోవడంతో నాగలక్ష్మి అనుకోకుండా తలుపుపై ఆనుకొంది.

దాంతో 'ధన్'మని తలుపు చప్పుడైంది.

ఆ శబ్దం పాముని కలవర పెట్టింది.

వెంటనే అలాగే పడగ విప్పుకుని పాము చటుక్కున పైమెట్టుకు పాకింది.

ఇపుడు పడగతో పాటు మరో అర మీటరు శరీరం సైతం వాళ్ళిద్దరికి స్పష్టంగా కనిపిస్తోంది.

పాము ముందుకు రావడంతో వాళ్ళిద్దరూ అసంకల్పితంగా రెండడుగులు వెనక్కి వేశారు.

మళ్ళీ తలుపు చప్పుడైంది.

'బుస్' మంటూ పాము మరింత ముందుకు వచ్చింది.

ఏంచేయాలో పాలుపోలేదు వాళ్ళిద్దరికి.

"బాబోయ్! పాము... పాము..."

సుబ్బలక్ష్మి ముందుగా పెద్దగా కేకలు పెట్టింది. సరిగ్గా అప్పుడే గేటును పెద్దగా చప్పుడు చేస్తూ శివుడు లోపలికి వచ్చాడు.

శివుడికి పాతికేళ్ళుంటాయి. ఖాకీ నిక్కరు మీద బుష్‌షర్ట్ వేసుకున్నాడు. చొక్కా వదులుగా ఉంది.

ఆ చొక్కా వాడిదికాదు. అయ్యగారికి బిగుతైపోయిన చొక్కాలే వాడు వేసుకుంటాడు.

గేటు చప్పుడికి పాము ఛట్‌న వెనక్కి తిరిగింది పడగతో సహా.

ఒక్కొక్క మెట్టు జంప్ చేస్తున్నట్టు కిందకు దిగుతోంది. అది అలా మెట్లు దిగుతున్నపుడు మెత్తగా తప్ తప్‌మని చప్పుడవుతోంది.

ఆ విషయం శివుడికి తెలియదు.

అమ్మగారు "పాము...పాము" అని అరవటం వాడికి గేటులోంచి లోపలకి రాగానే వినిపించి ఓ చేతిలో ఉన్న కూరల సంచిని, మరో చేతిలో ఉన్న పొట్లకాయల్ని అలాగే కిందికి వదిలేశాడు.

కూరల సంచి కిందికి పడి కూరలన్నీ చిందరవందర అయ్యాయి. పొట్లకాయలు వాడి కాళ్ళకి అడ్డం పడ్డాయి.

ఆ హడావుడిలో శివుడు పొట్లకాయలను పటపట తొక్కేసి కాళ్ళ కిందే పాము ఉన్నట్టు కంగారుపడిపోయాడు.

నాలుగడుగులు మెట్లవైపు వేసి గిర్రున వెనక్కు తిరిగాడు.

అప్పటికి పాము గేటువైపు జరా జరా పాక్కుంటూ వచ్చేసింది.

వెనక్కు తిరిగి తాను తొక్కేసిన పొట్లకాయలని చూస్తున్న శివుడికి అడుగు దూరం వరకు వచ్చి పాము ఆగిపోయింది.

మళ్ళీ టక్‌న అది పడగ పైకెత్తింది.

తాను తొక్కింది పొట్లకాయలనేనని నిర్ధారించుకొని "అమ్మగారూ! ఎక్కడండీ పాము? పాము...పాము అంటున్నారు" అంటూ వెనక్కి తిరిగాడు.

అంతే!

ఈలోపే పడగని మెరుపు వేగంతో వెనక్కిలాగి అదే వేగంతో స్ప్రింగులా ఎదరకు సాగించింది.

'శివుణ్ని పాము కాటేసింది' అనుకున్నారు నాగలక్ష్మి, సుబ్బలక్ష్మి. కానీ, వెనక్కి తిరగడంలో ఓ అడుగు పక్కకు జరిగాడు శివుడు.

శివుడు అడుగు వేసిన చోట టప్న పాము కాటుపడింది.

గేటు వరకు పరచి ఉన్న నాప రాళ్ళపై తడి బలపంతో గీసినట్లు చిన్న చారికలు పడ్డాయి.

గురి తప్పిన కోపంతో పాము రెండడుగులు పైకిలేచి శివుడివైపు బుసబుసలాడుతూ, నాలుకలు బయటకు చాపుతూ ఉద్రేకంగా ఊగిపోతోంది.

"ఒరే...శివుడూ! కదలకురా! అలాగే నిలబడు" అంత కంగారులోనూ నాగలక్ష్మి హెచ్చరించింది.

ఆ మాటలు వినిపించుకోలేదు శివుడు.

పామునే తదేకంగా చూస్తున్నాడు.

సుబ్బలక్ష్మికి ఆ దృశ్యం లీలగా కనిపిస్తోంది.

నాగలక్ష్మికి కాళ్ళు, చేతులు ఆడటం లేదు.

నిండు ప్రాణం తన కళ్ళ ముందరే పోతోందనిపించింది ఆమెకు.

శివుడికి ముచ్చెమటలు పోశాయి.

వాడు తొడుక్కున్న చొక్కా ఇంచుమించు తడిసిపోయింది.

వరండా మెట్లకీ, గేటుకీ మధ్యగా ఉన్నాడు శివుడు. పాము వాడికి అరగజం దూరంలో ఉంది.

ఏక్షణంలోనైనా అదివాడిపై పడవచ్చు.

హఠాత్తుగా నాగలక్ష్మికి ఏదో స్ఫురించింది.

వెంటనే పట్టుచీర కొంగుని నడుం కట్టు వరకు చింపేసింది.

గబగబా మెట్లవరకు దిగింది.

"ఇదిగో ఇది దానిమీద కప్పెయ్"

గట్టిగా అరుస్తూ శివుడి మీదకు చింపిన చీరకొంగును చుట్టచుట్టివిసిరేసింది.

క్షణం ఆలస్యం చేయకుండా, అర క్షణం కూడా ఆలోచించకుండా శివుడు ఆ చీర ముక్కని ఒడుపుగా చేజిక్కించుకుని సెకను కంటె తక్కువ వ్యవధిలో దాన్ని వలలా రెండు చివర్లు పట్టుకుని పాము మీదకు విసిరేశాడు.

శివుడు చీర చుట్టని పట్టుకునే అలికిడికి పాము మళ్ళీ వాడిని భుస్సుమంటూ కాటు వేయబోయింది.

కానీ, అప్పటికే ఆలస్యమై పాముని సగం వరకు ఆ చీర కొంగు కప్పేసింది. పాముకాటు చీరకొంగుమీద పడింది. దాని కోరలు చీరముక్కలో చిక్కుబడ్డాయి.

శివుడు ఏమాత్రం ఆలస్యం చేయలేదు.

చీర కొంగుకు బయట ఉన్న పాము తోకని కర్రను పట్టుకున్నట్లు పట్టుకుని గిరగిరా కైచెని సరదాకోసం తిప్పుతున్నట్లు భయం భయంగా వడివడిగా తిప్పసాగాడు.

నాగలక్ష్మి అనుకున్నట్లు జరిగింది.

సుబ్బలక్ష్మి మాత్రం నిశ్చేష్టురాలైంది.

"ఓరి నీ దుంపతెగ! ఓరి నీ అఘాయిత్యం మండిపోను" అంటూ శివుడు చేస్తున్న పనిని మెచ్చుకుంటూ తిట్ల

రూపంలో పొగిడింది.

శక్తినంతటిని కూడగట్టుకుని పాముని దీపావళినాడు ఉప్పు పొట్లం తిప్పినట్లు తిప్పసాగాడు శివుడు.

పాము కోరలకు చిక్కుకున్న చీర ముక్క కూడా రెపరెపలాడుతూ దానితో పాటే తిరుగుతోంది.

పది నిమిషాలు గడిచాయి.

ఈలోగా పాము శాయశక్తులా శ్రమపడింది శివుణ్ని కాటేద్దామని.

కుదరలేదు.

ఆ పాముని అలాగే గేటు బయటకు విసిరేశాడు శివుడు.

ఆ ఊపులో అది రోడ్డుమీదపడి కొంతదూరం నిర్జీవంగా జరిగింది.

కానీ దానికి ఇంకా ప్రాణం ఉన్నట్టే అనిపించింది-నాగలక్ష్మికి.

"చచ్చినట్లేనా?"

అనుమానంగా రోడ్డుమీదకు చూస్తూ అడిగింది నాగలక్ష్మి.

"ఇంత సేపెందుకండీ! ఇందాకనే చచ్చుంటుంది. ఎందుకేనా మంచిదని అనుమానం తీరేవరకు దాన్ని వదల్లేదు"

అప్పుడు జ్ఞాపకం వచ్చింది నాగలక్ష్మికి- తన ఛాతీమీద జాకెట్టు తప్ప మరే ఆచ్ఛాదనా లేదని.

అప్రయత్నంగా రెండు చేతుల్తోనూ గుండెల్ని కప్పేసుకుంది నాగలక్ష్మి.

"పెద్దదేనండీ! రెండు బారలుంటుంది. లేచిన వేళ మంచిది. లేకపోతే నేనీపాటికి నురగలు కక్కుకుని చచ్చిపోయేవాణ్ని" అన్నాడు శివుడు.

నాగలక్ష్మి గుండెల్ని చేతుల్తో కప్పుకోవడం చూశాక సుబ్బలక్ష్మి "ఇక రా లోపలికి! పోయి చీరమార్చుకో" అంటూ మందలించింది.

అప్పుడు కానీ నాగలక్ష్మి స్థితిని గమనించలేదు శివుడు.

మొదటిసారిగా ఆమెను ఆ రకంగా చూసిన శివుడికి ఆమె చాలా ఆకర్షణీయంగా కనిపించింది.

తన తెలివితేటల వల్ల, ధైర్యం వల్ల శివుడు బతికిపోయాడన్న భావం నాగలక్ష్మి కళ్లల్లో స్పష్టంగా ప్రస్ఫుటిస్తోంది.

ఆ దశలో నాగలక్ష్మి శివుడి కళ్ళకి మొదటిసారిగా సెక్సీగా కనిపించింది.

అప్పటివరకూ 'చిన్నమ్మగారు' అనే భావం తప్ప శివుడిలో మరే వికారం తలెత్తలేదు.

'నన్ను రక్షించింది చిన్నమ్మగారే' అనే భావం అదృశ్యమై 'చిన్నమ్మగారు అందంగానే ఉన్నారు' అనే ఆలోచన శివుడిలోరాగానే అతని ముఖంలో రంగులు మారాయి.

ఆ మార్పుని గమనించాక నాగలక్ష్మి ఒక్క క్షణంకూడా అక్కడ నిలబడలేక రెండు అంగల్లో మెట్లెక్కి లోపలికి వెళ్ళిపోయింది.

"సర్లే! ఆ కూరలు, సంచి లోపలికి తీసుకురా" అంటూ ఆజ్ఞాపించింది సుబ్బలక్ష్మి తేలికపడిన మనస్సుతో వెనక్కి తిరిగి.

సరిగ్గా అప్పుడే "టెలిగ్రామ్" అని మొదట అరిచిన తర్వాత "పాము... పాము" అంటూ గాభరాగా బెంబేలెత్తుతున్న పోస్ట్‌మేన్ పొలికేకలతో శివుడు స్పృహలోకి వచ్చాడు.

గేటుబయట చిందులు తొక్కుతున్న బక్కపల్చటి మనిషి తాను చూసినది చచ్చిన పామునేనని అప్పటికి నిశ్చయించుకుని సైకిలుకి స్టేండ్ వేస్తూ "ఎవడెహె!

దీన్ని రోడ్డుకడ్డంగా పారేశాడు" అంటూ బూతులు లంకించుకున్నాడు.

'బి.శివుడు వ్రాలు' అని సంతకం పెట్టి టెలిగ్రాం అందుకున్నాడు శివుడు.

హడావుడిగా లోపలికి పరుగెత్తుకు వెళ్ళి "చిన్నమ్మగారూ! టెలిగ్రామ్ వచ్చింది" అంటూ కంగారు కంగారుగా నాగలక్ష్మిని పిలిచాడు.

చీర మార్చుకుని వంటపని ప్రారంభించిన నాగలక్ష్మి వచ్చి టెలిగ్రామ్ అందుకుంది.

విషయం చదువుకుని నిర్ఘాంత పోయింది.

ఆ వెంటనే గొంతు బొంగురుపోయేలా "అత్తయ్యా! మా అమ్మని పాము కాటేసిందట. ఇవాళ నాలుగ్గంటలకి చచ్చిపోయిందట" అని అరిచింది. అప్పటికే ఆమె కంఠం రుద్ధమయింది.



## 2

నాగరాజారావ్ బద్ధకంగా ఆవులిస్తూ మెలకువ తెచ్చుకున్నాడు.

ఖరీదైన లాడ్జిరూమ్ అతనిని మరి కాస్సేపు నిద్రపొమ్మని బుజ్జగిస్తోంది.

డోర్ సందులోంచి లోపలికి విసరబడిన రెండు ఇంగ్లీషు డెయిలీలు,ఓ తెలుగు దినపత్రిక అతని మంచానికి బారెడు దూరంలో పడిఉన్నాయి.

మంచం దిగి చెదిరిన లుంగీని సరిచేసుకుంటూ మూడు పేపర్లనీ ఒకేసారి అందిపుచ్చుకున్నాడు.

మళ్ళీ మంచంమీద కూలబడి సిగరెట్టు వెలిగించాడు. చాలా తక్కువగా తార్ కంటెంట్ ఉన్న ఆ సిగరెట్టు మొదటి పఫ్‌ని బయటికి విసురుగా బుస్సున ఊది బర్...ర్ మని బజర్ నొక్కాడు.

బయట బోయ్ లోపలి బజర్‌నొక్కి, ఆ వెంటనే తలుపు తీసుకుని లోపలికి వచ్చాడు.

"స్ట్రాంగ్ కాఫీ" పేపర్‌మీదనించి దృష్టి మళ్ళించకుండానే చెప్పాడు నాగరాజారావ్. తరువాత క్లిక్‌మన్న తలుపు శబ్దం మాత్రమే వినిపించిందతనికి.

ఇంగ్లీషు పేపరు పక్కనపడేసి తెలుగు పేపరు అందుకొన్నాడు. బేనర్ కంటె ముందు బాక్స్ అయిటమ్ అతని దృష్టిలో పడింది.

'పాము కాటువల్ల మాజీమంత్రి భార్య మరణం'

"అరే" అనుకున్నాడు నాగరాజారావ్ అప్రయత్నంగా.

అప్పుడే తలుపు తోసుకుని బోయ్‌కాఫీ తెచ్చాడు పెద్దట్రేలో ఒకే కప్పుతో. మంచానికి ఆనుకునిఉన్న టీపాయ్‌పై ట్రేని ఉంచి బోయ్ వెనుకకు అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

ఉత్సాహంగా కాఫీని 'సిప్'చేసి మళ్ళీ ఆ వార్త చదవసాగాడు నాగరాజారావ్.

"మాజీమంత్రి శ్రీ ఆదిశేష భార్య శ్రీమతి నాగవల్లి నిన్న మధ్యాహ్నం మూడు గంటల ప్రాంతంలో పాముకాటు వల్ల మరణించారు. తమ ఇంటి ఆవరణలోనేఉన్న పుట్టలోఅలవాటుగా పాలు పోస్తున్నపుడు ఈ దుర్ఘటన జరిగింది"

నాగరాజారావ్‌కి కళ్ళు గిర్రునతిరిగాయి.

ఆ దృశ్యాన్ని అతను ఊహించుకో సాగాడు.

50ఏళ్ల నాగవల్లి పట్టుచీర కట్టుకొని వెండి కమండలంతో, భీమవరానికి పది మైళ్ల దూరంలోఉన్న కాళ్ళలో, వెంకటేశ్వరస్వామి గుడిముందు రోడ్డుకు అవతలిపక్కనఉన్న విశాలమైన భవనం ప్రాంగణంలోగల పుట్టలో పాలుపోస్తోంది.

సన్నని తెల్లతాచుపిల్లలా కమండలం లోంచి పాలు ధారగా పుట్టలో పడుతున్నాయి.

హఠాత్తుగా పుట్టలోంచి నిగనిగలాడే నల్లతాచు బయటకు వచ్చింది.

భయంకరంగా పడగవిప్పింది. ఆ సంఘటనకి నిశ్చేష్టురాలయిన నాగవల్లి గుడ్లప్పగించి అలాగే నిలబడింది.

అదునుచూసి ఆ నల్లతాచు నాగవల్లిని 'ఫట్'మని కాటేసింది.

ఆవిడ నురగలు కక్కుకుంటూ అక్కడికక్కడే చచ్చిపోయింది...



ఊహలోంచి వాస్తవంలోకి వచ్చాడు. గట్టిగా మరోసారి సిగరెట్టు దమ్ము పీల్చి ఉఫ్‌ఉఫ్‌మంటూ పొగ వదులుతూ కాఫీ కప్పు అందుకుని మరోగుక్క కాఫీ తాగాడు నాగరాజారావ్.

భయంభయంగా ఆ వార్తను మళ్ళీ చదవసాగాడు.

"నాగులచవితి సందర్భంగా పొద్దుటి నించీ ఉపవాసంఉన్న శ్రీమతి నాగవల్లి శాస్త్రోక్తంగా పూజా పురస్కారాలు ముగించుకుని తమ ఇంటి ఆవరణలోనే ఉన్న పుట్టలో పాలుపోయడానికి మధ్యాహ్నం మూడుగంటల ప్రాంతంలో వెళ్లారు. పుట్టలో పాలుపోసి ఇంట్లోకి తిరిగివస్తున్నపుడు దారిలో ఓ పాము పడగవిప్పి ఆడుతూ ఆమెకు కనిపించింది. సుబ్రమణ్యేశ్వరుడు తమకు ఇలవేల్పు కావటంతో ఆమె భక్తితో ఆ పాముకు నమస్కారం చేసింది. ఆ దశలో ఆమె అనుకోకుండా తన చేతిలోని పూలబుట్టనూ, వెండికమండలాన్నీ నేలపై జారవిడిచారు. మరుక్షణంలో ఆ పాము శ్రీమతి నాగవల్లిని కాటువేసింది. తరువాత పాము ఎటో వెళ్ళిపోయింది. శ్రీమతి నాగవల్లితో పాటేఉన్న పనిమనిషి ద్వారా ఈ వివరాలు తెలిసాయి"

నాగరాజారావ్ మళ్ళీ ఆ దృశ్యాన్ని ఊహించుకోసాగాడు.

పట్టుచీర కట్టుకుని నుదుట పెద్ద కుంకుమ బొట్టుతో, ఎడమచేతిలో ఖాళీ పూలసజ్జ, కుడిచేతిలో వెండి కమండలంతో నాగవల్లి పదేపదే వెనక్కితిరిగి పుట్టకు నమస్కారం పెడుతూ ముందుకు నడుస్తోంది.

రెండు అడుగులు వెనకగా పాతికేళ్ల నించీ ఆ ఇంట్లోనే పనిచేస్తున్న నలభై ఏళ్ళ పార్వతి ఏమాత్రం పొల్లుపోకుండా అమ్మగార్ని అనుసరిస్తూ దణ్ణాలు పెడుతోంది.

దోవలో పడగెత్తి మూరెడు పైకి లేచిన నల్లతాచు నాగవల్లి కంటబడింది.

పుట్టలోని నాగేంద్రుడు కళ్ళఎదుట ప్రత్యక్షమయ్యాడని ఆవిడ మురిసిపోయింది.

ఆ మైమరుపుతో చేతిలోని వస్తువులు గభాలున నేలపై పడేసి చేతులెత్తి నాగేంద్రుడికి మొక్కింది.

కిందపడిన పూలసజ్జ, కమండలం శబ్దానికి పాము కంగారుపడిపోయి ఎదురుగా కనిపించిన నాగవల్లిని కాటేసింది.

తమ ఇలవేల్పు నాగేంద్రుడే తనని కాటువేయడంతో నాగవల్లికి మతిపోయినంత పనయింది.

అమ్మగార్ని పాము కాటేయడం చూసి పార్వతి బెంబేలెత్తిపోయింది.

"అమ్మోయ్...బాబోయ్" అంటూ పార్వతి అరవటంతో ఇంట్లోని పనిమనుషులు అటువేపు పరిగెత్తుకుంటూ వచ్చి ఉంటారు.

ఆ హడావుడికి పాము ఏ పక్కకో జారుకొని ఉంటుంది.

ఆ తర్వాత మంత్రాల నారాయణని పిలిచి ఉంటారు.

అతను వచ్చేలోగానే నాగవల్లి నురగలు కక్కుకుని చనిపోయి ఉంటుంది.

గణగణా ఫోన్ మోగటంతో నాగరాజారావ్ మళ్ళీ స్పృహలోకి వచ్చాడు.

సిగరెట్టుపీకని ఆష్‌ట్రేలో విసిరేసి ఫోన్ అందుకున్నాడు మంచంమీదనుంచే!

"హలో! నాగరాజారావ్ హియర్"

"నేను-శేషగిరిని మాట్లాడుతున్నాను!

పేపరు చూశావా? మీ అత్తగారు చచ్చి పోయారుట"

"అవును. ఇప్పుడే నిద్రలేచాను. పేపరు చూడగానే తెలిసింది"

"సారీ బావా! రియల్లీ అయామ్ వెరీ సారీ"

"నువ్వు బయలుదేరుతున్నావా?"

"ఆ! పదినిమిషాల్లో లాడ్జికి వస్తాను"

"వెంటనే వచ్చేయ్! నా ప్రోగ్రాము లన్నీ కాన్సిల్ చేసుకుంటాను. నీదే ఆలస్యం"

ఫోన్ పెట్టేసి మళ్ళీ సిగరెట్టు వెలి గించాడు నాగరాజారావ్.

వెంటనే రిసెప్షన్‌కి ఫోన్‌చేసి బిల్లు పంపమన్నాడు. తర్వాత గబగబా నలుగు రైదుగురికి ఫోన్‌చేసి ఆనాటి తన ప్రోగ్రాం లన్నీ కాన్సిల్ చేసుకుంటున్నట్లు, మరో సారి వచ్చినపుడు వాటిని డిస్కస్ చేయ నున్నట్లు చెప్పాడు.

గబగబా బ్రష్ చేసుకుని, స్నానం అయిందనిపించి సూట్‌కేస్ సర్దేశాడు.

అంతలో శేషగిరి వచ్చేశాడు.

ఓ చేతిలో సూట్‌కేస్, మరో చేతిలో సూట్‌కేస్‌కు రెండింతలున్న సన్నని ప్లైవుడ్ పెట్టె ఉన్నాయి శేషగిరి చేతుల్లో!

పెట్టెకి పైమూత మీదా, పక్కల్లోనూ సన్నని రంధ్రాలు కనిపిస్తున్నాయి.

ఒక్కో రంధ్రం కందిగింజంత ఉంది. "పన్నెండేమిటి?" నాగరాజారావ్ అడిగాడు.

"మొత్తం పనవలేదు. ఇంకో రెండ్రోజులాగితే మరో నాలుగు దొరికేవి. కష్టపడి ఒక్కదానిని మాత్రం సంపా దించాను. వెధవలు...స్మగ్లింగ్ పేరుతో రెట్టింపు ధర చెబుతున్నారు" శేషగిరి ఉక్రోషంగా అన్నాడు.

తర్వాత ఇద్దరూ హైద్రాబాద్ నుంచి బయలుదేరారు. విజయవాడ వరకు విమానం మీద, ఆ పైన టాక్సీలో!

* * *

నాగలక్ష్మి దుఃఖానికి ఆనకట్ట పడటం లేదు.

సుబ్బలక్ష్మి ఆమెను సముదాయి స్తోంది.

శివుడికి 'ఎప్పుడు కాళ్ళకూరులో వాలి పోదామా' అని ఉంది.

అంత దుఃఖంలోనూ పదేపదే గేటు వేపు చూస్తోంది నాగలక్ష్మి.

ఏ క్షణాన నాగరాజారావ్ వస్తాడో అని ఆమె ఆత్రుత.

టెలిగ్రాం అందగానే హైదరాబాద్ ఫోన్ చేయాలనికూడా ఆమెకు అనిపించ లేదు.

మర్నాడు పొద్దున్న శివుడి సలహా మీద ఎప్పుడూ అలవాటుగా నాగరాజా రావ్ దిగే లాడ్జికి ఫోన్‌చేసింది.

అప్పటికే అతను బయలుదేరినట్లు రిసెప్షనిస్టు చెప్పింది.

క్రితంరోజునే శివుడు కాళ్ళకూరునుంచి వచ్చాడు తాడేపల్లిగూడెం.

నాగవల్లి అనేక జాగ్రత్తలు చెప్పి తనని పంపించింది.

అంతలో హఠాత్తుగా ఇలా జరుగు తుందని కల్లోకూడా అనుకోలేదు శివుడు.

నాగవల్లికి ఆదిశేషుకు శివుడు ఆరో ప్రాణం.

శివుడు ఇవ్వకుండా ఆదిశేషు కాఫీ కూడా తాగడు, భోజనం అసలేచేయడు. బాత్‌రూమ్‌కి స్వయంగా వెళ్ళి స్నానం చేసిరాగలగటం పొరపాటున కూడా జర గదు. ముఖ్యంగా తనకిష్టమైన చుట్టకూడా వెలిగించుకోలేడు మాజీమంత్రి ఆదిశేషు.

కారణం–ఆదిశేషుకు పక్షవాతంవచ్చి కాళ్ళూ, చేతులు పడిపోయాయి. అప్పటికి ఏడాదిముందరే రాజకీయాలనుంచి ఆయన విరమించుకున్నాడు. ఆ దశ రావడానికి ముందే ఆదిశేషు రాజకీయంగా 'అన్ పాపులర్' అయ్యాడు.

నాగవల్లి కి శివుడు లేందే క్షణం గడిచేది కాదు.

వాడు పక్కనుంటే ఏ సమస్యనయినా చిటికెలో పరిష్కరించేదావిడ.

పదేళ్ళవయసులో శివుడు ఆదిశేషు ఇంట్లో పనివాడయ్యాడు. రెండేళ్లు గడిచే సరికి ఆ ఇంటిబాధ్యత అతనిదయింది.

అప్పటికే ఆదిశేషు రాజకీయాల్లో వెలగటం ప్రారంభించాడు. సర్పంచి స్థాయినించి సమితి ప్రెసిడెంటయి ఆ తరువాత పరిషత్ ఛైర్మన్ అయ్యాడు. కాళ్ళు కూరులో శివుడు ఇంటివ్యవహారాలు, పొలం మంచిచెడ్డలు చూసేవాడు. ఆదిశేషు హైదరాబాద్‌లో పైరవీలు నిర్వహించేవాడు.



శివుడికి పదిహేనేళ్లు వచ్చేసరికి ఆదిశేషు ఎమ్మెల్యే అయ్యాడు. అయిదేళ్ళ పాటు అలాగే ఎమ్మెల్యేగా ఉండి, ఓ కార్పొరేషన్‌కి ఛైర్మన్‌గిరీచెలాయించాడు. మరుసటి సంవత్సరం ఎన్నికల్లో గెలిచి మంత్రి అయిపోయాడు.

అవినీతి చరిత్రలో రికార్డు సృష్టించిన అతిగొప్ప మంత్రిగా పేరుతెచ్చుకుని రెండేళ్లు గడిచేయగానే బలవంతంగా రాజకీయాల్లోంచి విరమించుకున్నాడు- అనారోగ్యం వంకతో.

అయితే చివరికి అదే నిజమయింది.

పక్షవాతం అతనిని శాశ్వతంగా మంచం ఎక్కించింది. ఫలితంగా ఆదిశేషు శివుడి 'సన్నిధి'లో చేరాడు **కాళ్ళకూరులో!**

ఆ రోజు **కాళ్ళకూరులో** ఆదిశేషు ఇంటి ముందుజనం లెక్కకుమించి ఉన్నారు.

ఊరు ఊరంతా కదిలి అక్కడికే వచ్చింది.

అప్పటికే ఒకరిద్దరు మంత్రులు కూడా అక్కడకు చేరగలిగారు.

నాగపల్లి శవం వైభవంగా అలంకృతమయింది.

నాగరాజారావ్, నాగలక్ష్మిల కోసం అందరూ ఎదురుచూస్తున్నారు.

సాయంత్రం నాలుగు గంటలవేళ శివుడితోసహా వాళ్లిద్దరూ, సుబ్బలక్ష్మి కాళ్ళకూరు చేరారు.

ఆదిశేషు మంచం దిగలేని కారణంగా నాగరాజారావే మిగతా కార్యక్రమాలు చూడవలసి వచ్చింది.

మర్నాటి పేపర్లలో ముఖ్యమంత్రితో పాటు అనేకమంది మంత్రులు, ప్రముఖుల సంతాప సందేశాలు రివాజుగా అచ్చయ్యాయి.

బాధతోనూ, అలసిపోవటంవల్ల నాగరాజారావు, నాగలక్ష్మి, పార్వతి, శేషగిరి, సుబ్బలక్ష్మి రెస్ట్ తీసుకోసాగారు.

సరిగా ఆ సమయంలోనే అంత్యక్రియలకు వచ్చిన బంధువుల కుర్రాడు మణి కుతూహలంతో శేషగిరి ప్లయివుడ్ పెట్టెని కదిలించాడు.

పెట్టెమీద చిల్లులు ఉండటంతో ఆ కుర్రాడిని బాగా ఆకర్షించింది ఆ పెట్టె.

మిగతావాళ్లు ఎవరి పనులలో వాళ్లు ఉండగా మణి సరదాగా ఆ పెట్టె మూత తీశాడు.

పెట్టెకు తాళంలేదు. రెండు కొక్కేలు మాత్రం బిగువుగా ఉన్నాయి. ఆమాత్రం కష్టపడ్డాడు ఆ కుర్రాడు.

మూత ఊడివచ్చింది.

మెల్లిగా మూత పైకిలేవతీశాడు.

అంతే!

మణి షాక్‌తిన్నట్లు వెనక్కిజరిగాడు.

ఆ వెంటనే "పాము...పాము" అంటూ అరవసాగాడు. మరుక్షణంలో మూర్ఛపోయాడు.

అతని అరుపులకి ఇంట్లోని వారంతా ఆ గది గుమ్మంముందు చేరారు.

పాము ఎక్కడుందో ఎవరికీ తెలీదు.

ఎవరికీ కాళ్ళూచేతులూ ఆడటం లేదు.

గదిలో పడిపోయినపిల్లాడు అందరికి కనిపిస్తున్నాడు. అందరి దృష్టి ఆ పిల్లాడిపైనే!

ప్రతి ఒక్కరికి ప్రాణ భయం. కుర్రాడిపై జాలి.

అతనిని డాక్టరుకు చూపించాలనితపన ఉన్నా, ఎవరూ గుమ్మందాటి లోపలికి వెళ్లటంలేదు.

అంతలో కుర్రాడి తండ్రి సుబ్బారావు వచ్చాడు. ఆ వెనకే అతని భార్య కూడా వచ్చింది. అప్పటివరకు పెట్టెలోనే ఉన్న

పాము మెల్లిగా తలపైకెత్తింది.

మణి తల్లిదండ్రులకి ఆ పెట్టె కనిపించింది. పెట్టెలో పామూ కనిపించింది. ఆ వెంటనే మూర్ఛపోయి కిందపడిన కొడుకూ కనిపించాడు.

ఆ క్షణంలో వాళ్ళేంఆలోచిస్తున్నారో వాళ్లకే తెలియదు.

మాటిమాటికి కళ్లార్పుతున్న మనిషిలా ఆ పాము నిమిషానికోసారి నాలుకలను బయటికిచాస్తోంది.పడగమాత్రంవిప్పలేదు.



## 3

శేషగిరి పరిగెత్తుకుంటూ ఆ గుమ్మందాకా వచ్చాడు. పెట్టెలోని పాము మరికాస్త బయటికివచ్చింది.

"శివుడెక్కడ?"

"శివుడేమయ్యాడు?"

"శివుణ్ణి ఎవరేనా, ఎక్కడికేనా పంపారా?"

నాగారాజారావు, నాగలక్ష్మి, సుబ్బలక్ష్మి ఒకరితర్వాత మరొకరు జనాంతికంగా ప్రశ్నించారు.

పాముల్ని చంపటంలో శివుణ్ణిమించిన వాళ్ళులేరని వాళ్ల నమ్మకం.

శేషగిరి అంత ఉద్రేక పరిస్థిలోనూ తనపై తానే విసుక్కున్నాడు.

"తప్పంతా నాదే! దాన్ని భీమడోలులోనే వదిలేసి రావాల్సింది. ఇక్కడికి రావడం ఆలస్యమైపోతుందని నాతోకూడ తీసుకువచ్చేశాను"

నాగరాజారావుకు దిక్కుతోచటంలేదు. ధైర్యంచేసి తానే లోపలికివెళ్ళి పిల్లాడిని బయటికితీసుకువచ్చేద్దామనుకున్నాడు.

నాగలక్ష్మి, సుబ్బలక్ష్మి అతనిని కదలనివ్వటంలేదు.

టెలిగ్రాం ఆలస్యంగా అందటంవల్ల అప్పటికి అక్కడికిచేరుకున్న ఫణిభూషణ్ వీధిగుమ్మంలో ఏఒక్కరిఅలికిడి లేకపోవడంతో హడావుడిగా లోపలికి వచ్చేశాడు.

అందరూ ఓగదిముందు గుమిగూడటం చూసి "ఆదిశేషు కూడా భార్యతో పాటేనా" అనుకుంటూ అందరి వెనకనించి గదిలోపలకి తొంగిచూశాడు.

పడగవిప్పకుండా కేవలం శరీరాన్ని మెలికలుతిప్పుతూ పెట్టెలోంచి కిందకుదిగి వస్తున్న పాము ఫణిభూషణ్ దృష్టిలో పడింది.

ఆ పాముకి మూడుఅడుగులదూరంలో స్పృహతప్పి పడివున్న కుర్రాడు కనిపించాడు.

పాముని చూసిన ఆనందంతో అతని ముఖం వేటదొరికిన నాగులా విప్పారింది. ఆ సంతోషంలో అతని పెదాలు ఒళ్ళు విరుచుకుంటున్న పాముపిల్లల్లా అటు ఇటు సాగాయి.

"అరే! డిస్ఫోలియస్ టైఫస్" గట్టిగా అరిచాడు ఫణిభూషణ్.

అంతకంగారులోనూ అందరూ ఒక్కసారిగా అతనివైపు చిరాగ్గా చూశారు- అతను ఏమంటున్నాడో అర్థంగాక!

"శేషగిరీ! ఎప్పుడు తెచ్చావ్ దీన్ని? ఎంత? రెండు తీసుకున్నాడా? మూడు తీసుకున్నాడా?"

అందరూ భయపడి ప్రాణాలు చేత

పట్టుకుని క్షుద్రుడిని ఎలా రక్షిద్దామా అని సతమతమవుతుంటే ఫణిభూషణ్ పాము వివరాలు తెలుసుకోవటానికి శ్రద్ధచూపడం అక్కడున్న ప్రతిఒక్కరికీ ఎబ్బెట్టుగా తోచింది.

పెట్టెలోపల అది ఇంకా ఎంత పొడుగుందో తెలీదు.

అప్పటికే మణికి రెండు అడుగుల దూరం వరకు వచ్చేసిందది.

"నువ్వు కాస్సేపు నోర్మూయ్" అరిచి నంత పనిచేశాడు శేషగిరి.

ఏదో పనిమీద బయటకు వెళ్లిన శివుడు





ఆ గది దగ్గరికి అప్పుడే చేరాడు.

అందరి గుసగుసల వల్ల శివుడికి అర్థమయిపోయింది-లోపల పాముందని.

ఒక్కొక్కళ్ళని తోసుకుంటూ శివుడు గది గుమ్మం వరకు వచ్చాడు.

పెట్టిలోంచి శరీరాన్ని బయటకు తీసుకురావటానికి వీలుగా పాము ఆ కుర్రాడికి రెండు అడుగుల దూరంలోనే ఆగింది.

మెల్లి మెల్లిగా పాము సాధ్యమైనంత దగ్గిరగా మెలికలు తిరుగుతూ బయటకు వస్తోంది.

సగం వరకు అది బయటపడింది.

శివుణ్ని చూశాక మిగతావాళ్ళందరికీ ధైర్యం వచ్చింది.

ఒక్కొక్కడు ఒక్కో సలహా చెప్పటం ప్రారంభించారు.

"కర్ర లేకుండా వచ్చేవేరా వెధవా?"

"పెద్దమొగాడు బయల్దేరాడండి! వట్టి చేతుల్తో పాముని చంపేవాడు"

"ఓరి బాబోయ్! మీకు తెలియదండి. వాడు అంతటి మొనగాడే!"

ఆ మాటలను శివుడు లెక్కచేయలేదు.

తను కూడా పాములాగే కాలివేళ్ళమీద జరుగుతూ ముందు ముందుకు వెళ్ళ సాగాడు.

పడగ విప్పలేదు కనుక అది ప్రమాద కరమైన పాము కాదని వాడి ఉద్దేశం.

ప్రాణాలు తీసే పాములే పడగ విప్పు తాయని వాడి నమ్మకం.

"ఓరే! దాన్ని చంపద్దు" ఫణిభూషణ్ అరిచాడు.

శేషగిరికి కూడా దాన్ని చంపకూడ దనే అనిపించింది. కాని రెండురోజులైనా కాలేదు. మూడున్నరవేలు ఖర్చు చేశాడు. ధర మూడువేలు. ఖర్చులు మిగతావి.

ఆ పాముని చంపటం శివుడి ఉద్దేశం కాదు.

మణిని బయటకు ఈడ్చుకు వచ్చేయా లనుకుంటున్నాడు శివుడు.

నాగరాజారావ్ శ్వాసించటం మానే శాడు. నాగవల్లి కళ్ళు ఆర్పటం మరిచి పోయింది. సుబ్బలక్ష్మి గుండెలమీద చెయ్యేసుకుని భగవంతుణ్ని ప్రార్థిస్తోంది.

కుర్రాడి తల్లిదండ్రులు మౌనంగా నిమి షాలు లెక్కపెడుతున్నారు.

"జాగ్రత్త! జాగ్రత్త"

ఒకేసారి చాలామంది అరిచారు.

అప్పటికే శివుడు మణిని కాలుపట్టి గుమ్మం వరకూ విసిరేశాడు.

మూడు వంతులు బయటికి వచ్చేసిన పాము అందరి అరుపుల శబ్దానికి మిగిలిన శరీరాన్ని కూడా ఒకేసారి 'ఛక్'మని బయటికి లాగేసింది—హంటర్‌ని నేలమీద ఛెళ్ళుమనిపించినట్లు.

శివుడి గుండె ఝల్లుమంది.

పాము బుసకొట్టటంలేదు. కానీ అది ఎంత పొడుగుందో చూసేసరికి శివుడి కళ్ళు గిర్రున తిరిగాయి.

"అది ఇప్పుడే ఆహారాన్ని జీర్ణం చేసు కుంది! నువ్వేమీ కంగారుపడకుండా అలాగే వెనక్కి పాక్కుంటూ వచ్చేయ్" చిన్నగా అరిచాడు ఫణిభూషణ్.

అదే మంచిదనిపించిందిశివుడికి.

మొత్తం శరీరం పెట్టెలోంచి బయటకు వచ్చిన తరువాత పాములో చురుకుదనం వచ్చింది.

ఆ గదిలో శివుడొక్కడే!

డిస్ఫోలియస్ టైఫస్ తలతో పాటు ఓ అడుగు శరీరాన్ని ఓ అడుగు ముందుకు చాపింది.

శివుడు అప్రయత్నంగా ఓ అడుగు వెనక్కువేశాడు.

పాము మిగతా శరీరాన్ని ముందుకు తెచ్చుకుంటోంది.

ఒక్కసారిగా శివుడు వెనక్కి విరు చుకుపడి, వెంటనే కాళ్ళు పైకెత్తి నడుంమీద నుంచి ఉండలా వెనక్కి దొర్లాడు.

ఏదో ఆలోచిస్తున్నట్టు పాము ఓ క్షణం కదల్లేదు.

వెనక్కి పిల్లిమొగ్గవేసిన శివుణ్ని

ఎవరో పట్టి లాగేశారు.

"ఈ 'బూమ్‌స్లాంగ్'లు చాలా ప్రమాదకరమైనవి! శివుడు అదృష్ట వంతుడు! అది ఇక్కడి వాతావరణానికి ఇంకా అలవాటుపడలేదు" ఫణిభూషణ్ వ్యాఖ్యానించాడు.

మణికి స్పృహ తెప్పించేందుకు ప్రయత్నాలు చేస్తున్నారు అతని తల్లిదండ్రులు, వారి బంధువులు.

ఒకళ్ళ చేతిలోంచి కర్ర అందుకుని "దాన్ని చంపేస్తా" అన్నాడు శివుడు.

"పాముల నారాయణని పిలిస్తే పాముని కదలకుండా మంత్రాలతో కట్టేస్తాడు" అంది పార్వతి.

ఆ పాటికే పాములు పట్టేవాళ్ళని తీసుకువచ్చారు ఎవరో.

వాళ్లు మిగిలిన వాళ్ళందరిని అక్కణ్నించి వెళ్ళిపోమని చెప్పి నాగస్వరం ఊదటం మొదలుపెట్టారు.

"ఒరేయ్! మీ భ్రమ తప్ప, వినటానికి మనకు మాత్రమే నాగస్వరం హాయిగా ఉంటుంది. కానీ దానిని అది ఆకర్షించలేదురా! గోనెసంచీ దానిపై కప్పి ఆ పాముని జాగ్రత్తగా ఆ పెట్టెలో పెట్టెయ్యండి" ఫణిభూషణ్ ఆ పాముల వాళ్ళను మందలిస్తూ సలహా చెప్పాడు.

"అవును! అలాగే చెయ్యండి" శేషగిరి కూడా ఫణిభూషణ్‌కి మద్దతు ఇచ్చాడు.

"అదేంకుదర్దు! మేము పట్టుకున్న పాముని మేమే తీసుకువెళ్తాం! మీరేం డబ్బులు ఇయ్యక్కర్లేదు" పాములు పట్టేవారిలో పెద్దతను మొరాయించాడు.

పడగవిప్పని పాము, నాలుగు మీటర్ల పొడవున్న గోధుమ వర్ణం పాము వాళ్లకి నాలుగు డబ్బులు చేసిపెడుతుంది.

కోరలు పీకేసి, నోరు కుట్టేసి ఆ పాముని మెళ్లోవేసుకుని అడుక్కోవడానికి బయలుదేరితే డబ్బులే డబ్బులు! అదీ వారి ఆలోచన!

"ఏంట్రా! తెగ వగురుస్తున్నారు. మీరు అవతలికిపొండి! ఆ పని నేనే చేస్తాను" అంటూ శివుడు గోనెసంచితో అక్కడికిరావడంతో వాళ్లు వెనక్కితగ్గారు.

"సర్లేండి. గొప్పోళ్లు! మీ మాటే మా మాట" ఆ పామును మళ్ళీ పెట్టెలో పెట్టినందుకు ఇచ్చే పదో పాతికో వదులుకోవటమెందుకనుకున్నాడు పాములను పట్టేవారి పెద్ద.



## 4

మణి ఇంకా స్పృహలోకి రాలేదు. అసలు వస్తాడోరాడో ఎవరికీ తెలియట్లేదు. దాదాపు అరగంట గడిచింది. కుర్రాడి శరీరం చెమటలు పట్టేస్తోంది. ఎవరో ఉల్లిపాయకోసి అతనికి వాసన చూపిస్తున్నారు. ఇంకెవరో అరికాళ్లు, అరిచేతులు రుద్దుతున్నారు.

అతని తల్లిదండ్రులు దిక్కుతోచక మాటిమాటికి కొడుకు శరీరంపై చేయి వేసి కుళ్ళికుళ్ళి ఏడుస్తున్నారు.

స్పృహతప్పిన ఆ పరిస్థితిలోనే కొడుకు శరీరం చల్లబడిపోతుందేమో అని వాళ్ళ భయం.

పాములవాళ్ళు ఆ 'డిస్పోలియస్ టైఫస్'ని ఎలాగూ పట్టుకుంటారనే నమ్మకంతో నాగరాజారావ్ మణిని పడుకో పెట్టిన గదిలోకి వచ్చాడు.

సుబ్బారావుగారు, ఆయన భార్య పడే బాధని చూసి అతనికి వెంటనే ఏదో స్ఫురించింది.

శత్రువు వెనుకే ఉన్న స్పృహతో 'ఛక్'న వెనక్కి తిరిగిన పాములా ఆ గది గుమ్మంలోనే వెనక్కి తిరిగి ఫోను దగ్గరికి పరిగెత్తుకు వెళ్ళాడు నాగరాజారావ్.

గబగబా హడావుడిగా ఎక్స్చేంజివాళ్ళకి ఓ నెంబరు ఇచ్చి అర్జంటుగా లైను కలపమన్నాడు.

నాలుగైదు సెకనులు కూడా గడవకుండా లైను కలిసింది.

"డాక్టర్ నాగేంద్రరాజు హియర్" అని వినిపించింది అవతలినుంచి.

"నేను నాగరాజారావ్ని. కాళ్ళకూరునించి మాట్లాడుతున్నాను. మా బంధువుల కుర్రాడు స్పృహతప్పాడు. పాముని చూసి భయపడ్డాడు. వెంటనే రాగలరా మీరు" ఆతృతగా మాజీ మంత్రి అల్లుడి స్థాయిలో దర్పంగా రిక్వెస్ట్ చేశాడు.

"ఓయస్. పావుగంటలో అక్కడుంటాను" డాక్టర్ జవాబు విని ఫోను పెట్టేశాడు నాగరాజారావ్.

మళ్ళీ కుర్రాడున్న గదిలోకి వెళ్ళాడు. స్పృహ తెప్పించడానికి ముఖంపై చల్లిన నీళ్ళు చమటతో కలిసిపోయి మణి చొక్కా పూర్తిగా తడిసిపోయింది.

"ముందా చొక్కా, లాగూ తీసేసి కుర్రాడికి గాలి తగిలే ఏర్పాటు చేయండి" నాగరాజారావ్ అంటూ ఆజ్ఞలాంటి సలహా ఇచ్చాడు.

ఎవరో ఆ కుర్రాడి చొక్కా, లాగూ తీసే ప్రయత్నం మొదలుపెట్టారు.

అప్పుడే ఫణిభూషణ్ శేషగిరితో పాటు ఆ గదిలోకి వచ్చాడు.

"ఇదంతా మామూలే! ఆ పాముని చూసి భయపడి స్పృహ తప్పాడు తప్ప ప్రాణభయమేమీ ఉండదు" ఫణిభూషణ్ సహజ ధోరణిలో అందరికి ధైర్యం చెప్పబోయాడు.

"పెట్టె మూత తీసేటపుడే ఆ పాము వీణ్ని కాటేసిందేమో...?"

"కొన్ని పాముల్ని ముట్టుకుంటేనే చచ్చిపోతారట" ఎవరో వ్యాఖ్యానించారు.

"ఈ పాము అలాంటిది కాదు. దాన్ని ముట్టుకున్నంత మాత్రాన ఎవరూ చచ్చిపోరు. కాటేస్తే తప్ప" శేషగిరి చెప్పాడు.

"పాముని చూసి భయంతో ప్రాణాలు పోగొట్టుకున్నవాళ్ళ కేసులు ఎన్నో నాకు తెలుసు" ఫణిభూషణ్ తన అనుభవాలను చెప్పబోయాడు.

"సమయం, సందర్భం లేకుండా పాముని గురించి నీకు తెలిసిన పాండిత్యాన్ని ఇక్కడ ప్రదర్శించకు. ముందు ఈ గదిలోంచి అవతలకి పో"

నాగరాజారావ్ కోపంగా రెండడుగులు ముందుకు వేసి ఫణిభూషణ్ని బయటకి గెంటేయబోయాడు.

"అనువుగాని చోట..." అని గొణుక్కుంటూ ఫణిభూషణ్ తల వంచుకుని వీధి వరండాలోకి వచ్చి కూచ్చుని సిగరెట్టు వెలిగించాడు.

తరువాతి నిమిషంలో డాక్టర్ నాగేంద్రరాజు తెల్లని కారు గేటులోంచి దూసుకు వచ్చి వరండా మెట్ల ముందు ఆగింది.

* * *

స్వామి భీమడోలునించి బస్సులో

భీమవరం వరకు వచ్చి, అక్కణ్నించి మరో బస్సులో కాళ్ళకూరు చేరాడు.

మాజీమంత్రి ఆదిశేషు ఇల్లు ఎక్కడో అతనికి బాగా తెలుసు.

గేటు తీసి లోపలికి నడచి వస్తున్న స్వామిని చూసి- 'పాముల మధ్య తిరిగి తిరిగి వీడికి పాముల లక్షణాలు బాగా వంటపట్టేశాయి' అనుకున్నాడు ఫణి భూషణ్.

ఆ ఇంట్లో ఏం జరుగుతోందో బాగా తెలిసినట్లు స్వామి లోపలికి వెళ్ళి పోయాడు-ఫణిభూషణ్‌ని చూసి నవ్వుతూ పలకరిస్తూ.

స్వామి రాకతో శేషగిరికి రెట్టింపు ధైర్యం వచ్చింది.

"నువ్వు ఇక్కడికి వస్తావనుకోలేదు. కానీ...మంచి సమయానికి వచ్చావు" అంటూ స్వామిని 'డిస్పోలియస్ లైఫస్' ఉన్న గది దగ్గరకి తీసుకువెళ్లాడు.

లోపల పాములవాళ్లు గోనెసంచి పుచ్చుకుని ఆ పాముతో కుస్తీ పడుతున్నారు.

అప్పటికి ఆ గదిలో ఓ మూలగా ఉంది పాము.

అది బుసలు కొడుతూనే ఉంది.

పడగ విప్పకుండానే అప్పుడప్పుడు 'ఫట్ ఫట్'మంటూ ఆ పాములవాళ్ళ నిద్దరినీ కాటువేయడానికి ప్రయత్నిస్తూనే ఉంది.

పరిస్థితి అర్థమయింది స్వామికి.

తను కూడా వాళ్ళతో చేరాడు.

అంతకు ముందే ఆ పాముని అప్పటి వరకు బంధించి ఉంచిన పెట్టె అతని చేతులలోకి వచ్చింది.

పెట్టె రెండు మూతల్ని అలాగే తెరిచి పట్టుకొని పాము తలని పెట్టెతో నొక్కి పట్టాలని స్వామి ఉద్దేశం.

గోనెసంచి మూతితో పాము తలని కప్పేసి ఒడుపుగా మిగతా శరీరాన్ని సంచీలోనికి గెంటేసి సంచీ మూతి కట్టేయాలని పాములవాళ్ళ ప్రయత్నం.

జాతరలో పోతురాజు వీరంగంలా ముందుకి, వెనక్కి అడుగులు వేస్తూ పాము పనిపట్టాలని ఆ ముగ్గురూ తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు.

గది బయట శేషగిరి, నాగలక్ష్మి, సుబ్బలక్ష్మి ప్రభృతులు ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని చోద్యం చూస్తున్నారు.

అప్పటిదాకా అక్కడే ఉన్న శివుడు హఠాత్తుగా బయటికి పరుగెత్తాడు.

స్వామితోపాటు మిగిలిన ఇద్దరు ఆ పామును పట్టాలని ప్రాణాలకి తెగించి ప్రయత్నిస్తున్నారు.

ఉండి ఉండి పాము అరమీటరు ఎత్తు దాకా ఎగురుతూ వాళ్ళ బారినించి తప్పించుకోడానికి శాయశక్తుల ప్రయత్నిస్తోంది.

అవకాశం ఉంటే కాటువేయడానికి అది మాటిమాటికి కత్తెరలా నోరు తెరుస్తోంది.

అది నోరు తెరచినపుడల్లా నోటిలో వెనక్కి తిరిగిన రెండు కోరలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

అది నోరు తెరచిన ప్రతిసారి తోక పైకి లేస్తోంది.

అప్పుడప్పుడు పడగ విప్పకుండానే తలను మాత్రం మూరెడు పైకి లేవదీస్తోంది.

అంతలో శివుడు బారెడు గడకర్రను చేత పట్టుకుని లోపలికి వచ్చాడు.

దాన్ని చంపటం వాడి ఉద్దేశం కాదు.

ఆ గడకర్రకు ఒక చివర రెండు బద్దలుగా విడదీసి ఉంది. రెండు బద్దలకి మధ్యన పలకలుగా ఉన్న కంకర్రాయి

అడ్డం ఉంది.

రెండు బద్దలుగా విడదీసిన ఆ గడకర్ర విడదీసిన పాము నోరులా ఉంది.

శివుడు కూడా ఆ ముగురితో చేరాడు- ఆ పాముని లొంగదీసుకునే ప్రయత్నంలో.

* * *

డాక్టర్ నాగేంద్రరాజు స్పృహ తప్పిన మణిని చూసీ చూడగానే 'స్టెత్'కి పని చెప్పాడు.

హార్ట్ బీట్ లెక్కకి మించి వినిపించింది.

ఆ వెంటనే నాడి చూశాడు.

అనాలోచితంగా డాక్టర్ నాగేంద్ర మెడికల్ కిట్ ఓపెన్ చేసి స్మెల్లింగ్ సాల్ట్ బయటకి తీశాడు.

తల్లిదండ్రులతోసహా ప్రేక్షకులంతా డాక్టర్ నాగేంద్ర వైపు, కుర్రాడి వైపు మార్చి మార్చి చూస్తున్నారు.

మణికి స్మెల్లింగ్ సాల్ట్ ప్రయోగింపబడింది.

"ఎంత డబ్బు ఖర్చైనాసరే ఈ అబ్బాయిని బతికించండి" అప్పుడే ఆ గదిలోకి వస్తూ డాక్టర్‌ని బతిమాలింది నాగలక్ష్మి.

"ప్రాణానికేం భయం లేదు. పది నిముషాల్లో తెలివొస్తుంది."

డాక్టర్ భరోసాతో ఆ గదిలో చేరిన వారంతా 'బుస్సున' నిట్టూర్పు వదిలారు.

ప్రతి ఒక్కరూ సెకన్లు, నిముషాలు లెక్కిస్తున్నారు.

నాగరాజారావ్ డిస్కోలియన్ టైఫస్ను ఏం చేశారో తెలుసుకోడానికి అది ఉన్న గది దగ్గరకు వచ్చాడు.

సరిగ్గా అప్పుడే శివుడు నోరు తెరుచుకున్న గడకర్రను పాము తలకి జానెడు దూరంలో దాని శరీరాన్ని ఇరికించి, దాని తలని కుడివైపు మెలిపెట్టి, ఆపైన టకాటకా మొత్తం శరీరాన్ని బలవంతంగా చుట్ట చుట్టేశాడు.

మధ్య మధ్యలో గడకర్ర పట్టునించి తప్పించుకోవడానికి పాము శక్తికిమించి ప్రయత్నించింది.

పాముని కదలకుండా గడకర్ర చీలికల మధ్యలో ఇరికించడం గమనించిన వెంటనే దాన్ని పట్టి బంధించడానికి అనువుగా పెట్టె మూతలని తెరచి తగినంత దూరంలో నిలబడ్డాడు స్వామి.

పాము చుట్టని కర్రతోసహా పెట్టెలో పెట్టాడు శివుడు.

మరుక్షణం పెట్టె మూతవేసి ఆవెంటనే గడకర్రను బయటికి లాగేశాడు శివుడు.

పాము పెట్టెలో మళ్ళీ బంధించబడింది.

ఆ హడావిడిలో గడకర్ర చీలిక మధ్యన ఉన్న రాయి కూడా పెట్టెలో పడిపోయింది.

మూడువేల అయిదు వందల రూపాయలు ఖర్చుపెట్టి తీసుకు వచ్చిన ఆ 'స్మగ్లింగ్ పాము'ను చంపకుండా మళ్ళీ బంధించగలిగినందుకు మనసులోనే శివుడికి 'థాంక్స్' చెప్పుకున్నాడు శేషగిరి.

ఎలాంటి పామునైనా ఇలాకూడా పట్టుకోవచ్చునని ప్రయోగాత్మకంగా నిరూపించినందుకు శివుడిని కౌగిలించుకున్నంత పనిచేశాడు ఫణిభూషణ్.

"నీ ఇల్లు చల్లగుండ, నీ కడుపు బంగారంకాను" అంటూ శివుణ్ని దీవించింది సుబ్బలక్ష్మి.

శివుడి ముఖంలో ఉన్న అలసటని ఎవరూ గమనించలేదు.

నిస్త్రాణగా ఆ గదిలోనే గుమ్మానికి చేరపడిపోయి కాళ్లు బార్లచాపి కళ్లు

మూసుకున్నాడు శివుడు.

ఇంచుమించుగా వాణ్ని తన్నుకుంటూ బయటికి వచ్చారు పాముల వాళ్ళిద్దరూ.

తమకు రావలసిన డబ్బులు రాకుండా చేశాడని శివుడి మీద కోపంతో గోనె సంచీని ఓ పక్కకి విసిరికొట్టి ఆ ఇద్దరు రుసరుసలాడుతూ వీధి గుమ్మం వైపు అడుగులు వేశారు.

వెనకాలే నాగరాజారావ్ వాళ్ళని అనుసరించి వీధి వరండా వరకు వచ్చి జేబులోంచి ఇరవై రూపాయల కాయితం తీసి "మీ కష్టం మాకెందుకు" అంటూ వాళ్ళలో ఒకడికి ఇచ్చాడు.

డిస్ప్లేలియస్ లైఫస్‌ని తామే పట్టు



కున్నంత సంబరంగా ఆ నోటుని అందుకుని వాళ్లు వెళ్ళిపోయారు.

నాగరాజారావ్ వెనక మిగిలిన వాళ్ళు కూడా ఆ పామున్న గది దగ్గిర్నించి కదిలి మణి ఉన్న గది వద్దకు వచ్చారు.

అప్పుడే మెల్లి మెల్లిగా కదలటం ప్రారంభించాడు మణి.



పిల్లాడు కదలటం చూసి డాక్టర్ నాగేంద్ర స్టిఫ్‌గా సర్దుకుని కూర్చున్నాడు.

కుర్రాడు కళ్ళు విప్పాడు. ఎదురుగా ఆ గదికప్పు అస్పష్టంగా కనిపించింది.

కళ్ళు టపటపలాడించి అతికష్టంమీద పక్కకి వత్తిగిల్లాడు. ఎదురుగా మంచం మీదే వారగా కూర్చున్న డాక్టర్ నాగేంద్ర తెల్లని షర్ట్ కనిపించింది.

కుర్రాడు తన దృష్టిని కొంచెం పైకి పోనిచ్చాడు. రూపాయిబిళ్ళకంటె కొంచెం పెద్దగాఉన్న స్టెత్ దయాఫ్రం కుర్రాడి దృష్టిలో పడింది.

అది నోరు తెగగొట్టబడిన పాము పడగలా అనిపించింది.

వాడిదృష్టి మరికొంచెం పైకి పాకింది.

అలా అలా డాక్టర్ నాగేంద్రని పూర్తిగా చూశాడు. మెడలో ఒక పామునో...లేదా రెండు మూడు పాముల్నో వేసుకుని డాక్టర్ నాగేంద్ర అక్కడ కూర్చున్నాడు అనుకున్నాడు మణి.

ఆ వెంటనే ఆ కుర్రాడి నోటివెంట వచ్చిన మొదటి రెండు మాటలు "పాము.. పాము..."

ఆ తర్వాత మరో మూడునాలుగుసార్లు అన్నాడు.

"పాములు... పాములు... బాబోయ్ పాములు" అని.

మరుక్షణంలో ఆ కుర్రాడు మళ్ళీ స్పృహ తప్పాడు.

* * *

శేషగిరి డిస్పోలియస్ టైఫస్ ఉన్న పెట్టెను ఎవరికీ అందకుండా భద్రపరిచి అన్యమనస్కంగా, పరధ్యానంగా వీధివరండా మెట్లుదిగి కుడిపక్కగా ఇంటి వెనకకి వెళ్ళాడు.

ఇంటివెనుక చాలా ఖాళీప్రదేశం ఉంది. అక్కడ అరంగుళంమేర పచ్చిక దట్టంగా మొలిచి ఉంది.

మధ్యమధ్యలో పదుల సంఖ్యలో రకరకాల చెట్లు ఉన్నాయి.

ఆ చెట్లు నిలబడిన లావుపాటి కొండ చిలువల పైన వేలు, లక్షల సంఖ్యలో పడగలు విప్పుకొన్న పాముల్లా ఆకులు విస్తరించి ఉన్నాయి.

శేషగిరి పూర్తిగా ఆ ఇంటి వెనుకకి వచ్చాడు.

ఎడమవేపున దాదాపు వందగజాల దూరంలోనే నిలువెత్తు పుట్ట ఉంది.

ఆ పుట్టలోనే ఆదిశేషు భార్య నాగవల్లి చనిపోయేముందు పాలు పోసింది. అక్కణ్ణించి తిరిగివస్తున్నపుడే పాము కాటువేయడంవల్ల చనిపోయింది.

అతను పేపర్లో చదివిన విషయాలన్నీ ఊహించుకుంటూ ముందుకు అడుగులు వేస్తున్నాడు.

కాళ్ళకింద మెత్తని పచ్చిక నిశ్శబ్దముగా చెప్పులకింద అణిగిపోతోంది.

శేషగిరి అనాలోచితంగానే పుట్టవేపు సాగిపోతున్నాడు.

ఎందుకో...తనని ఎవరో అనుసరించి వస్తున్నారు అనిపించింది శేషగిరికి.

'భ్రమ పడు తు న్నా ను' అనుకుంటూనే మెత్తగా వెనక్కితిరిగాడు.

అల్లంతదూరంలో పచ్చని పచ్చికలో ఆలివ్‌గ్రీన్‌లో ఉన్న దాదాపు నాలుగు అడుగుల పాము జరజరా పాక్కుంటూ తన అడుగుల వెంబడే వస్తోంది.

దాని అడుగుభాగం తెల్లగానే ఉంది. పడగవిప్పలేదు కానీ జానెడు పైకి తల ఎత్తి మిగతా శరీరాన్ని ఊహించరానంత

వేగంతో మెలికలు తిప్పుకుంటూ పరుగు పరుగున వస్తోంది.

అప్రయత్నంగా శేషగిరి దృష్టి పాతిక ముప్పైగజాల దూరంలో వస్తున్న ఫణిభూషణ్, స్వామిలపై పడింది.

తమకంటె ముందు భయంకరమైన ఓ పాము శేషగిరి వేపు వెడుతోందని ఆ ఇద్దరికీ తెలియదు.

'నాగవల్లిని కాటేసింది ఈ పామే అయ్యుంటుంది' అనుకున్నాడు శేషగిరి.

ఆ వూహ రాగానే అతని అరికాళ్ళ కిందే పాము ఉన్నంతగా వణుకుపుట్టింది.

శేషగిరి జీవనాధారం పాములు.

అతని వ్యాపారం పాములు.

పాములే అతన్ని లక్షాధికార్ని చేశాయి.

తెల్లారిలేస్తే వందలసంఖ్యలో పాములున్న 'స్నేక్‌ఫార్మ్'లోనే అతను కూర్చుంటూ ఉంటాడు.

అయినా అతనికి పాములంటే భయమే.

భీమడోలులో ఉన్న అతని స్నేక్ ఫార్మ్‌కి చాలాదూరంగా ప్రత్యేకంగా మరో ఆఫీసుని ఏర్పాటు చేసుకున్నాడు.

స్వామి ఉంటేతప్ప నిజానికి అతను ఆ ఫార్మ్‌లో అడుగుపెట్టడు.

మళ్ళీ అతనే హైదరాబాద్, బొంబాయి, మద్రాస్ వగయిరా చోట్లనించి నిర్భయంగా పాముల్ని పట్టుకొస్తాడు.

పకడ్బందీగా ఒక్కొక్క దానిని ఒక్కొక్క పెట్టెలో నిరపాయంగా పేక్ చేయిస్తాడు.

ఫణిభూషణ్, స్వామి తనవేపే వస్తున్నారు.

వాళ్ళకంటెముందే తను నడిచిన గడ్డిమీద పాక్కుంటూవస్తున్న పాముని మరోసారి చూడాలని అనుకున్నాడు శేషగిరి.

కానీ... తన కళ్ళముందే అది ఎటో మాయమైంది.

శేషగిరి గుండెలు గుబగుబలాడాయి.

ఆ విషయం ఫణిభూషణ్‌కి, స్వామికి చెప్పాలని రెండడుగులు ముందుకివేశాడు.

అంతలోనే టక్కున ఆగిపోయాడు.

పాము ఎక్కడికి తప్పుకుందో తెలీదు.

తను ముందుకువెడితే ఏ పక్క నుంచి అది మీదపడుతుందో అని శేషగిరి భయం.

"ఫణీ...మీరిద్దరు ముందుకు రావద్దు. వెనక్కి తిరిగి వెళ్ళిపోండి. మీకూ, నాకూ మధ్యలో పాముంది" శక్తికొద్దీ అరిచాడు శేషగిరి.

అతని అరుపుల్ని అర్థం చేసుకోవటానికి కొన్ని క్షణాలు పట్టింది వారిద్దరికి.

ఆ వెంటనే "అయితే మీరు ఆ వైపు నించి వీధిలోకి వచ్చేయండి" అంటూ సమయస్ఫూర్తిగా సలహా చెప్పి స్వామి వెనక్కి పరిగెత్తాడు.

ఫణిభూషణ్ తప్పనిసరిగా స్వామిని అనుసరించవలసి వచ్చింది.

వాళ్ళిద్దరూ వీధి వరండా వద్దకు వచ్చేసరికి శేషగిరి అటువైపునించి అక్కడికి చేరుకున్నాడు.

శేషగిరిని చూడగానే ఫణిభూషణ్ అమాంతంగా అతనిని కౌగలించుకోబోయినంత పనిచేస్తూ ''ఎలాఉందా పాము...? తాచుపామేనా?'' అంటూ ప్రశ్నలవర్షం కురిపించాడు.

''ఏమో... నేను అదంతా గమనించలేదు. చచ్చేంత భయమేసింది. అంతటైం ఎక్కడిది''అంటూ శేషగిరి ఫణిభూషణ్ భుజంమీద చేయివేసి వరండా మెట్లు ఎక్కసాగాడు.

ఓ మెట్టు తేడాతో స్వామి వాళ్ళని అనుసరించబోయాడు.

అనుకోకుండా ముగ్గురూ హఠాత్తుగా మెట్లమీదే ఆగిపోయారు.

ఎదురుగా గుమ్మం ఇవతల దాదాపు నాలుగుఅడుగుల పాము గుమ్మానికివేసిన వార్నిషు రంగుని చీలిన నాలుకలతో పరిశీలిస్తూ కనిపించింది.



## 5

స్మెల్లింగ్ సాల్ట్ వాసన చూశాక స్పృహ వచ్చిన పది నిమిషాలలోనే "పాము... పాము..." అంటూ అరిచి మళ్ళీ స్పృహ తప్పిన మణిని నిశితంగా పరిశీలిస్తున్నాడు డాక్టర్ నాగేంద్రరాజు.

పైన సీలింగ్ ఫ్యాన్ తిరుగుతున్నా ఆయనకి చెమటలు పడుతున్నాయి.

నాగవల్లి చనిపోయిన బాధకంటె మణి మళ్ళీ స్పృహతప్పడమనే బాధే ఆ ఇంట్లో చేరినవాళ్ళందరి ముఖాలలోనూ ఎక్కువ ప్రస్ఫుటిస్తోంది.

నాగలక్ష్మి అందరికంటె ఎక్కువ కంగారుపడుతోంది. పాముకాటువల్ల తల్లి చనిపోవడం ఆమెకు లోలోపల పదేపదే జ్ఞాపకంవస్తున్నా, తమ కుటుంబంపై సానుభూతి చూపించడానికి వచ్చిన బంధువుల కుర్రాడు పామును చూసి స్పృహతప్పి అపాయస్థితిలో ఉండటం ఆమెకు పరువుకు సంబంధించిన విషయంగా తోచింది.

డాక్టర్ నాగేంద్ర మణికి స్పృహ తెప్పించడానికి రకరకాలుగా ప్రయత్నిస్తున్నాడు.

నాగరాజారావ్ మనసు చాలా ఆందోళనగా వుంది. మధ్యమధ్యలో అతనికి ఎక్కడెక్కడినించో ఫోన్‌కాల్స్ వస్తున్నాయి-సానుభూతివర్షం కురిపిస్తూ.

అప్పటికి శివుడు కొంచెం తేరుకొని నిస్త్రాణగా ఆ గదిదగ్గరికి చేరుకున్నాడు.

మంచంమీద కుర్రాడి పక్కనే ఓ వైపు నాగలక్ష్మి, ఓ వైపు డాక్టర్ నాగేంద్ర కనిపించారు శివుడికి.

నాగలక్ష్మి వెనకే నిలబడిఉన్న నాగరాజారావ్ కూడా కనిపించాడు.

ఆమెవెనక నాగరాజారావ్ స్థానంలో తనే ఉన్నట్లు శివుడికి అనుభూతి కల్గింది.

తల్లిమరణంతో కలిగిన బాధ, ఆరోజు అంతా పడిన శ్రమ, బంధువుల కుర్రాడి స్థితి వగైరాలవల్ల అలసిపోయిన ఆమె ముఖం ఆమె వయసుని ఐదు, ఆరేళ్ళు తగ్గించింది.

ఆమె పైట ఎడమచేతి మీదకు జారిపోయింది.

పైట సర్దుకోవాలనే ధ్యాసకంటె మణికి ఎప్పుడు తెలివొస్తుందో అనే ఆత్రుతే నాగలక్ష్మిలో ఎక్కువగా కనిపిస్తోంది.

ఆమె పైట సర్దుకుని, పిల్లాడి ఒళ్ళు వెచ్చగా ఉందో లేదో గమనించడం కోసం కదలడంతో శివుడు ఊహల్లోంచి బయట ప్రపంచంలో పడ్డాడు.

తప్పుచేసినవాడిలా తల వంచుకుని వీధి వరండా వైపు అడుగులు వేశాడు.

అప్పుడే నాగరాజారావ్ ఆ గదిలోంచి బయటపడి తనుకూడా శివుడి వెనకే నడవసాగాడు.

మర్నాడు జరగాల్సిన కర్మకాండ కోసం ఏర్పాట్లు పూర్తి అయ్యాయో లేదో

తెలుసుకోవడంకోసం నాగరాజారావ్ "శివుడూ" అని గట్టిగా పిలిచాడు.

ఇంచుమించు వీధి గుమ్మం వరకు వెళ్ళిన శివుడు ఆ పిలుపు విని వెనక్కి తిరిగి రెండు అడుగులు ముందుకు వేశాడు.

వీధివరండా మెట్లమీద నిలబడ్డ శేషగిరి, ఫణిభూషణ్,స్వామి గుమ్మం లోపల నిలబడి ఉన్న నాగరాజారావ్‌నీ, శివుడినీ చూశారు.

పాము ఇంకా ఆ గుమ్మం దగ్గరే తచ్చాడుతోంది.

వాళ్ళు తమని చూస్తే గుమ్మందాటి బయటికి వస్తారేమోనని శేషగిరి కంగారు పడిపోయాడు.

అప్రయత్నంగా "బావా..." అన్నాడు.

చాలా వేగంగా పరుగెడుతున్న పాములా శివుడిమీదనించి నాగరాజారావ్ తన దృష్టిని వీధి వరండా మెట్లమీద ప్రస రింపజేశాడు.

ఎదురుగా శేషగిరితోపాటు ఫణి భూషణ్, స్వామి అప్రతిభులై గుమ్మం వైపు చూస్తుండడం స్పష్టంగా గమనిం చాడు నాగరాజారావ్.

మరుక్షణంలో శివుడుకూడా వారివైపు చూసి, ఆ తర్వాత గుమ్మం ముందు మెలి కలు తిరిగి అటు ఇటు గాలిపటం తోకలా కదుల్తున్న ఆ నాలుగడుగుల పామునీ చూశాడు.

వెంటనే గుమ్మంవరకు ఒకే అంగలో దూకి నిశ్శబ్దంగా రెండు తలుపుల్నీ దగ్గ రికి చేరవేసి, నాగరాజారావుని వెనక్కి లాక్కుపోతూ "మీరు లోపల్నించి బయ టికి రాకండి..." అనేసి శివుడు దొడ్డి గుమ్మం వైపు పరిగెత్తాడు.

శివుడు ఎంత నిశ్శబ్దంగా తలుపులు మూసినా ఆ శబ్దం పాముకు వినిపించింది.

చటుక్కున అది వెనక్కి తిరిగి మెట్ల వైపు రాసాగింది.

శేషగిరి మిగిలిన ఇద్దర్నీ ఒక్క ఊపున వెనక్కి గెంటి, తనూ వెనక అంగతో కింద మెట్టుమీదకి చేరాడు.

ఫణిభూషణ్, స్వామి ఆ విసురుకి తట్టుకుని కింద మెట్టుకంటే కింద ఉన్న నాపరాయి నేలమీద నిలబడ గలిగారు.

పై మెట్టుమీదనించి కిందకు దిగడానికి పాము తటపటాయిస్తోంది–బుసలుకొడు తూనే!

మాటిమాటికీ అది నాలుకలు చాపు తూనేఉంది.

మీరు ముగ్గురూ పాములతోనే కాపరం చేస్తున్నా నా విషయం వేరు అన్నట్టూ, వెక్కిరిస్తున్నట్టూ కనిపించిందా పాము– ఆ ముగ్గురికీ.

స్వామి 'పాముని పట్టగలనా' అని ఆలోచిస్తున్నట్టు కనిపించాడు.

ఫణిభూషణ్, 'ఆ పాము ఏ తరగతికి చెందినదా' అని తను నేర్చుకున్న పాముల శాస్త్రాన్ని సినిమాలో ఫ్లాష్‌బేక్‌లా నెమరువేసుకోసాగాడు.

శేషగిరి 'ఇలాంటి పాముద్వారా ఎంత తక్కువ వ్యవధిలో ఎంత ఎక్కువ విషాన్ని సంపాదించవచ్చు'అని క్షణం కంటె తక్కువ సేపు అంచనా వేశాడు.

ఆపాటికి శివుడు పరుగెత్తుకుంటూ వచ్చి వాళ్ళ వెనుక చేరాడు.

పరుగెత్తుకు రావడం వల్ల వాడి వగుర్పు ఎదురుగుండా కనిపిస్తున్న పాము బుసల ధ్వని కంటె ఎక్కువ ధ్వనితో వినిపిస్తోంది.

పాము మెల్లిగా రెండో మెట్టుని

ఆసరా చేసుకుని కిందకు దిగడం ప్రారం భించింది.

పాముకీ, ఆ నలుగురికీ మధ్యలో మరో ఎనిమిది మెట్లే ఉన్నాయి.

శివుడు తమ వెనుకనించి ఎప్పుడు కదిలాడో మిగిలిన ఆ ముగ్గురికి తెలీదు. కానీ రెంతంగల్లో కుడిపక్కనించి వరండా అరుగు ఎక్కి పాముకంటె మెత్తగా అడుగులు వేస్తూ ఊహించరానంత ధైర్యంగా పాము తలని జానెడు దిగువగా గుప్పిడి బిగించి పాముని పట్టుకున్నాడు.

ఆ పరిణామాన్ని పాము ఊహించలేదు.

శేషగిరి, ఫణిభూషణ్, స్వామికూడా ఊహించలేదు.

అప్పటికే రెండు మూడు క్షణాల పాటు పాము మిగతా శరీరం గాలిలో కదలాడి, ఆ తర్వాత హంటర్‌లా శివుడి మోచేతిని చుట్టేసుకుంది.

పాము తలని శాయశక్తులా కిందకు వంచి శివుడి మణికట్టు కింద కాటువేయడానికి ప్రయత్నిస్తోంది.

శివుడు దాని ప్రయత్నం కొనసాగనివ్వట్లేదు. పాము తలకంటె వేగంగా వాడు చేతిని అటుఇటు తిప్పుతున్నాడు.

మొత్తం మీద శివుడి మోచేయి పాముకి అందట్లేదు.

శివుడికి మెరుపులా ఏదో జ్ఞాపకం వచ్చేసింది.

అలాగే వెనక్కి రెండడుగులు వెళ్ళి 'ధనా'లున చప్పుడు చేస్తూ అంతక్రితం తాను మెత్తగా మూసిన తలుపుల్ని తెరుచుకుని గిరుక్కున వెనక్కి తిరిగి 'డిస్పోలియస్ టైఫస్' పెట్టెలో బంధించబడి ఉన్న గదిలో ఓ మూలగా పాముల వాళ్ళు విసరేసిన గోనెసంచిని ఎడం చేత్తో పైకి తీసి, ఏమైతే అవుతుందని కుడిచేతిని గోనెసంచీలో పెట్టి లోపల దాన్ని వదిలేసి మెరుపు వేగంతో కుడిచేతిని బయటకు తీశాడు.

ఆ వెంటనే గోనెసంచీ మూతిని రెండు చేతులతోను పట్టుకుని మెలిపెట్టి పుటుక్కున నిక్కర్ని బిగించి పట్టిన మొలతాడును తెంపి, చటుక్కున దాంతోటే సాధ్యమైనంత కిందవరకు గోనెసంచీని బిగించాడు.

భయపడుతూ, అడుగులో అడుగు వేసుకుంటూ ఆ సమయానికి ఆతృతగా ఆ గది దగ్గరకి వచ్చారు శేషగిరి,ఫణిభూషణ్, స్వామి.

అంతలో ఘొల్లున ఏడుపు వినిపించింది మణి ఉన్న గదిలోంచి.

అప్పటికి ఒక క్షణం ముందు డాక్టర్ నాగేంద్ర చెప్పాడు "కుర్రాడిని వైజాగో, హైదరాబాదో తీసుకు వెళ్ళడం మంచిది" అని.

శివుడికి ఏం ప్రమాదం జరగలేదని గ్రహించి, అంతలో కలకలం వినిపించడంతో అనుకోకుండానే ఆ ముగ్గురూ కుర్రాడున్న గదిలోకి పరుగెత్తారు.

డాక్టర్ నాగేంద్ర మెడికల్ కిట్ సర్దుకుంటు ఆ గదిలోంచి బయట పడడానికి సిద్ధపడ్డాడు.

"వాట్ డాక్టర్! వాట్ హేపెండ్" శేషగిరి లోపలికి వస్తూనే అడిగాడు.

"మణిని వైజాగో, హైదరాబాదో తీసుకెళ్ళటం మంచిదంటున్నారు" నాగరాజారావ్ చెప్పాడు.

"అంత సీరియస్సా ఈ కేసు?" ఫణిభూషణ్ వెటకారం చేస్తున్నట్టు అడిగాడు.

"నా ఉద్దేశం అదికాదు! ఇఫ్ అయామ్ కరెక్ట్...ఇతను చాలా భయపడ్డాడు. మామూలు ట్రీట్‌మెంట్ కంటే సైకో థెరపీ ఇతనికి అవసరం అని నా ఉద్దేశం!" ఆ పని తనకు తలకు మించిన బరువన్నట్లు సంజాయిషీ చెబుతున్న ధోరణిలో చెప్పాడు డాక్టరు నాగేంద్ర.

"కుర్రాడికి వీలైనంత వరకు గ్లూకోజు ఇవ్వడానికి ప్రయత్నించండి! సాధ్యమైనంత త్వరగా స్పెషలిస్టులకు చూపించండి" - చకచకా సలహా చెప్పేసి తప్పు చేసినవాడిలా త్వరత్వరగా డాక్టర్ నాగేంద్ర కారు ఎక్కేసి రివర్స్‌లో రోడ్డు వరకు వెళ్ళి ఆ పైన భీమవరం దారి పట్టాడు.

పాముని గోనెసంచీలో కట్టేసి కుడి చేతిని ఎడమ చేతితో నొక్కుకుంటూ బయటకి వచ్చాడు శివుడు.

అప్పటికి శేషగిరి, ఫణిభూషణ్, స్వామి, నాగరాజారావ్ వీధి బయటే ఉన్నారు.

"ఏమిట్రా అది! ఆ రక్తం ఏమిటి నీ కుడిచేతి మీద" నాగరాజారావ్ ముందుగా చూసి అడిగాడు.

ఆశ్చర్యపోతూ శివుడు కూడా తన కుడిచేతి వేపు చూసుకున్నాడు.

చేతిగుత్తి మీద మణికట్టునుంచి మూడు అంగుళాల పొడవున సన్నని రక్తపు చారిక ఉంది.

ఆ చారిక చూడగానే చెయ్యి బరువెక్కినట్టు అనిపించింది శివుడికి.

'గోనె సంచీలో పాముని వదిలేసి చెయ్యి బయటకి లాగుకొనేలోగా అది తనని కాటేసిందా' అని అనుమానం వచ్చింది శివుడికి.

అతనికి తెలుసున్నంతవరకు దానికా అవకాశం ఇవ్వలేదు.

"మోచేతి దగ్గరినించి కిందకు బరువుగా ఉన్నట్టు అనిపిస్తోంది" శివుడు గొణుగుతూ చెప్పాడు - మూడంగుళాల రక్తపు చారికని చూస్తూ.

"ఆ...జ్ఞాపకం వచ్చింది! అది డెండ్రో యాస్పిస్ పోలీలెపిస్"ఫణిభూషణ్ అరిచినంతపనిచేశాడు.

శివుడు తన చేతి బాధను ఒక్కక్షణం పాటు మరచిపోయాడు.

ఫణిభూషణ్ జ్ఞాపక శక్తిని అభినందిస్తున్నట్టు కళ్ళెగరేసి, అంతలోనే అతని కుర్రతనానికి చిరాకుపడుతున్నట్టు కళ్లు చిట్లించాడు శేషగిరి.

"ఫణిబాబూ! మీరు పాముల గురించి చదువుకున్నారు కానీ ఎప్పుడూ ఏమాట మాట్లాడాలో తెలియదు" స్వామి మందలిస్తున్నట్టు నిర్మొహమాటంగా అన్నాడు.

అతనికి ఫణిమీద ఆ హక్కు ఉంది. స్వామి సాయం లేకపోతే ఫణి ప్రయోగాలు కొనసాగవు.

నాగరాజారావ్ మాత్రం ఫణి మీద కోపం పట్టలేకపోయాడు.

'అసలు నిన్నెవడు రమ్మన్నాడు ఇక్కడికి' అనబోయి తానే అతనికి టెలిగ్రామ్ ఇచ్చానన్న విషయం గుర్తుకు వచ్చి-"చూడు మిస్టర్ ఫణీ! కొన్ని కొన్ని విషయాలు కొన్ని చోట్లకే పరిమితం! నువ్వు ఇలాగే ఎక్కడపడితే అక్కడ వాగితే నిన్ను పిచ్చివాడిగా జమకట్టి..." ఆపైన మరేమీ అనలేక నాగరాజారావ్ లోపలికి వెళ్ళిపోయాడు.

శివుడికి గాయం మండుతోంది. గాయంమీద "ఉఫ్...ఉఫ్..." అంటూ ఊదుకొంటున్నాడు.

శేషగిరి గబగబా మెట్లెక్కి శివుడి

చేతిని పట్టుకొని చూశాడు.

పాముకి శివుడి చెయ్యి 'క్లోజ్'గానే ఉంది. కనుక అది కాటువేసిఉంటే రెండు కోరలు స్పష్టంగా దిగేవి! కాని ఒకటే రక్తపు చారిక ఉంది కనుక 'బహుశా కాటు వేసి ఉండదు' అనుకున్నాడు.

"ఛ! ఇది పాముకాటు కాదు" నిర్ద్వంద్వంగా చెప్పాడు శేషగిరి.

"డెండ్రోయాస్పిస్‌పోలీలెపిస్ కాటేస్తే ఇంతసేపు బతుకుతాడా వాడు? గోనె సంచీలో అతుక్కున్న ఏ జనప పుల్లో గుచ్చుకుని గీసుకుండేమో! డెండ్రోయాస్పిస్ పోలీలెపిస్‌లు ఆఫ్రికాలో ఉంటాయి. అది ఒకసారి కాటువేస్తే వెలువడే విషంతో కనీసం అయిదు - ఆరుగురిని తేలిగ్గా చంపొచ్చు. పోనీ ఒక కోరే శివుడికి గుచ్చుకొందనుకొన్నా ఈపాటికి వీడి శవమే కనిపించేది మనకి"

ఫణి ఆ పాము గురించి వివరాలు చెప్పాడు. పాము వివరాలకంటే, అతను తనని పాము కాటువేసి ఉండదన్న మాటలే



శివుడి మీద బాగా పనిచేశాయి.

శివుడి ముఖంలో ఒకరకమైన రిలాక్సేషన్ కనిపించింది ఫణి మాటల వల్ల.

శేషగిరి మరింత పరీక్షగా చూశాడు- శివుడి మణికట్టుమీద రక్తపు చారికని.

ఇంచుమించుగా ఆ చారిక చివర్న, చిటికనవేలు పక్కనున్న ముడుసుమీద గుండుసూది కంటె తక్కువ సన్నగా ఉన్న జనుము పేడు కనిపించింది.

"శివుడూ! కంగారుపడకు. ఆ పాము నిన్నేమీ చేయలేదు! జనుము పేడు గుచ్చుకుంది. అంతే!"

శేషగిరి ఆ విషయం చెబుతూ బొటనవేలు, మధ్యవేలి గోళ్ళతో ఆ పుల్లని తీసే ప్రయత్నం చేయసాగాడు.

"జనప పేడు గుచ్చుకుంటే చెయ్యి బరువెక్కుతుందేమిటి? నన్ను ఓదార్చ దానికి ఏమిటేమిటో చెబుతున్నారు"

శివుడు నిస్సందేహంగా ఫణి చెప్పినట్లు ఆ డెంద్రోయాస్పిస్ పోలిలెపిస్ తనని కాటువేసి ఉంటుందన్న నమ్మకంతో కంగారుగా అన్నాడు.

"ఏడిశావ్లే! నువ్వు ఆ పాముని పట్టుకున్నపుడు అది నిన్ను హంటర్లా చుట్టుకోలేదురా! నువ్వు, నేను వేసే తాడు ముడికంటే అది మరింత బిగుతుగా చుట్టుకోగలదు. అందుకే నీ కుడిచేతి రక్తప్రసరణ ఆగిపోయి ఉంటుంది. తిమ్మిరెక్కినపుడు కాలు కానీ, చేయి కానీ బరువెక్కదా! అలాగే ఇదీను! చూడు. కాస్సేపటిలో నీ చేయి తిమ్మిరెక్కినట్లు ఉంటుంది" ఫణి చెప్పాడు.

అప్పటికే శివుడి చేయి తిమ్మిరెక్కినట్లయింది. శివుడు నిజంగానే డెంద్రోయాస్పిస్ పోలిలెపిస్ తనను కాటు వేసిందని అనుకున్నాడు. అందువల్లనే తన చేయి తిమ్మిరెక్కిందనుకున్నాడు.

పొరపాటున ఒక కోరే తన చేతిమీద దిగిందని శివుడు నమ్మాడు.

కానీ పదినిమిషాలు గడిచినా తననోటి వెంబడి నురుగులు రాకపోవడంతో బహుశా తనని పాము కాటు వేయలేదేమో అనుకున్నాడు.

అప్పటికే శేషగిరి అతని చేతి మణికట్టుమీద నుంచి పావు సెంటీమీటరు పొడవున్న జనప ముల్లును బయటకు తీశాడు.

దాంతో శివుడి అనుమానం పటాపంచలైంది.

తనకేమీ జరగలేదన్నంత మామూలుగా "ఆ అబ్బాయి విషయం ఏం చేశారు?" అన్నాడు నాగరాజారావ్తో.

అప్పటికే నాగరాజారావ్ ఆ కుర్రాడిని హైదరాబాద్ పంపించడానికి కారుని పురమాయించాడు.

సుబ్బారావు, ఆయన భార్య స్పృహ తప్పిన మణితోపాటు హైదరాబాద్ వెళ్ళడానికి సిద్ధమయ్యారు.

సరిగ్గా అప్పుడే భీమవరం నుంచి డాక్టర్ నాగేంద్రరాజు ఫోనుచేశాడు.

"నేను హైదరాబాదులోని డాక్టర్ శేషశయన్కి ఫోన్ చేశాను. మీరు ఆ కుర్రాడిని అక్కడికి తీసుకువెళ్ళండి"

నాగరాజారావు ఆ విషయం విన్న తరువాత తనుకూడా డాక్టర్ శేషశయన్కు ఫోన్చేసి తాను మాజీ మంత్రి ఆదిశేష అల్లుడనని, తన తరఫునుంచి బంధువుల కుర్రాణ్ని హైదరాబాద్ పంపుతున్నానని, ఆ అబ్బాయిని మామూలు మనిషినిచేసి బిల్లు తనకు పంపమని చెప్పాడు.

మణితోసహా ఆదిశేష కారు హైదరాబాద్ ప్రయాణమైంది.

స్వామి డిస్పోలియస్ టైఫస్ ఉన్న పెట్టెతోపాటు డెండ్రోయాస్పిస్ పోలీలెపిస్ ఉన్న గోనెసంచిని కూడా వెంట తీసుకుని భీమడోలు ప్రయాణమయ్యాడు.

శేషగిరి తనకు బిజినెస్ వ్యవహారాలు తలమునకలుగా ఉన్నాయని చెప్పి సెలవు తీసుకున్నాడు.

నాగవల్లి కర్మ పూర్తయ్యాక నాగరాజారావ్ కూడా మావగార్ని ఒప్పించి శివుడికి రకరకాలుగా జాగ్రత్తలుచెప్పి తల్లిని తీసుకుని తాడేపల్లి గూడెం బయలుదేరాడు.

పక్షవాతంతో తీసుకుంటున్న తండ్రిని చూసుకోవటానికి నాగలక్ష్మి కాళ్ళకూరులో ఉండిపోయింది.

* * *

స్వామి, శేషగిరి వెళ్ళిపోయినతర్వాత తనకు భీమడోలులోని స్నేక్‌ఫార్మ్‌లో అత్యవసరంగా చేయాల్సిన కొన్ని ప్రయోగాలున్నాయని ఫణిభూషణ్ కూడా వాళ్ళవెనకే భీమడోలు వచ్చేశాడు.

శివుడు గోనెసంచిలో బంధించిన డెండ్రోయాస్పిస్ పోలీలెపిస్ పామును ఏ జాతికి చెందిన పాముతో సంపర్కం చేయిస్తే కొత్త రకం పాములు పుడతాయో తెలుసుకోవాలని ఫణిభూషణ్ కుతూహల పడసాగాడు.

ఫణిభూషణ్ స్నేక్‌ఫార్మ్‌లో అడుగు పెట్టాడు స్వామితోసహా.

డైరీఫారంలో పాలిచ్చే జంతువుల్ని ఆప్యాయంగా పెంచుతున్నట్లు ఆ స్నేక్ ఫార్మ్‌లో అతి భయంకరమైన విషసర్పాలను పెంచుతున్నాడు శేషగిరి.

దానిపేరు 'యూనీడ్ స్నేక్‌ఫారం'.

ఆ వ్యాపారం మొదలుపెట్టడానికి శేషగిరి చాలా అవస్థపడ్డాడు. స్టేట్ బాంకును ఒప్పించి వాళ్ళనుంచి సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంట్ స్కీమ్‌కింద అప్పు మంజూరు చేయించుకోవడానికి చీమల పుట్టలో ప్రవేశించడానికి తాచుపాము పడినంత శ్రమపడ్డాడు.

"అసలు నీకు ఎందుకు ఈ స్నేక్ ఫార్మ్ పెట్టాలనిపించింది?"

ఫణిభూషణ్ ఎప్పుడో శేషగిరిని అడిగినప్పుడు అతను చెప్పిన సమాధానం గుర్తుకు వచ్చింది.

శేషగిరి కుటుంబానికికూడా సుబ్రహ్మణ్యేశ్వరస్వామే ఇలవేల్పు. అతనికి ఒకప్పుడు పాములన్నీ దేవుడితో సమానమే. ఒకసారి అనుకోకుండావాళ్ళింట్లో ఓ పిచ్చుకగూడు కట్టింది. ఆ పిచ్చుక గుడ్లు తినడానికి ఓ పాము వాళ్ళింట్లో ప్రవేశించింది. భక్తితో దణ్ణంపెట్టి తన్మయత్వంలో మునిగిపోయిన శేషగిరి తల్లిదండ్రుల్ని ఆపాము కాటువేసి ఆతరువాత యథాప్రకారం పిచ్చుక గుడ్లు తినేసింది.

పాముకాటువల్ల శేషగిరి తల్లిదండ్రులు కొన్నిగంటల తేడాలో ఒకేరోజున చనిపోయారు.

ఆ క్షణంలో అతనికి విచిత్రమైన అనుభూతి కల్గింది. నిజానికి అది అనుభూతి కూడాకాదు. స్పష్టంగా చెప్పాలంటే శేషగిరికి అప్పుడే జ్ఞానోదయమయింది.

అప్పటివరకు అతను కూడా సుబ్రహ్మణ్యేశ్వరస్వామి భక్తుడే. కానీ ఆ క్షణంలో తాను అలా గుడ్డిగా పాముని దేవుడుగా నమ్మినందుకు మనస్ఫూర్తిగా సిగ్గుపడ్డాడు.

తల్లిదండ్రుల అంత్యక్రియలు పూర్తిచేసి ఆపైన తన భవిష్యత్తు ఏమిటి అని ఆలోచించుకుంటున్న దశలో ఒక ఇంగ్లీషు

దినపత్రికలో ఒకవ్యాసాన్ని చదివాడు.

"లాస్ ఏంజిల్స్ సిటీ పొలిమేరల్లో నివసిస్తున్న ఓ ధనవంతుని ఆస్తి కోర్టు గొడవల్లోఉంది. ఆస్తి మొత్తం దాదాపు వందఎకరాలు. వ్యాజ్యం కోర్టులోఉన్నందు వల్ల కొన్ని సంవత్సరాలుగా ఆ పొలం బీడుపడిపోయింది. అప్పుడు ఆ ధన వంతుడు ఓస్నేహితుణ్ని సలహా అడుగు తాడు—డబ్బు సంపాయించే మార్గం చెప్ప మని. కోర్టులోఉన్న వ్యాజ్యం ఎలాగయినా అతనికే అనుకూలంగా తిరుగుతుందని, ఈలోగా ఆ పొలంలో పంటమాట ఎలా ఉన్నా పాములు పుష్కలంగా ఉన్నాయి కనుక ఆపాముల్ని పట్టుకోవటానికి ఏకోర్టు అభ్యంతరంచెప్పదు కనుక అతనిపొలంలో పేరుకొన్న పుట్టల్లోని పాములను పట్టి ఆ పాముల విషాన్ని సేకరించి అలా వచ్చిన డబ్బుతో జీవితాన్ని వెళ్ళబుచ్చమని సలహాఇస్తాడు ఆ మిత్రుడు. అలా అతను ధనవంతుడవుతాడు''—ఇదీ ఆ వ్యాసం సారాంశం.

ఆ వ్యాసం శేషగిరిని బాగా ఆకర్షిం చింది. తాను దేవుడిగా నమ్మే పామువల్లే తన తల్లిదండ్రులు చనిపోవటంతో ఆ పాములను హింసించి బలవంతంగా విషం కక్కించి ఆ విషంతో వ్యాపారం చేయ టంలో అతనికి ఓ రకమైన 'సినికల్' అనుభూతి కలిగింది.

ఆ 'సినిసిటీ' ఫలితమే 'యూ నీడ్ స్నేక్‌ఫార్మ్'.

తనతో శేషగిరి ఎప్పుడో చెప్పిన విషయాలన్నీ యధాలాపంగా గుర్తు కొచ్చాయి ఫణిభూషణ్‌కి. అప్పటికి ఆ ఇద్దరూ స్నేక్‌ఫార్మ్ లోపలికంటా వచ్చేశారు.

అప్రయత్నంగా ఫణి వెనక్కి తిరిగి చూశాడు.

దాదాపు తొమ్మిది అడుగుల ప్రహరీ గోడ కనిపించింది.

పాములకి పట్టు చిక్కకపోతే పాక లేవు. అందుకే ఆగోడని చాలా నున్నగా అద్దంకంటె నున్నగా ప్లాస్టర్‌చేయించాడు శేషగిరి.

ఆ గోడ మీదినుంచి పాకి ఏ పామూ బయటికివెళ్ళలేదు. కష్టపడి అది బయటికి తప్పించుకున్నా గోడకు లోపలా బయటా 'స్నేక్‌పిట్స్' ఉన్నాయి.

ఫణి వెనక్కి చూస్తూనే ముందుకు అడుగులు వేస్తున్నాడు...పడగ వెనక్కి తిప్పి ఎదరకు పాకుతున్న పాములా!

స్వామి సరాసరి తన ఇంట్లోకి వెళ్ళి పోయాడు.

స్నేక్‌ఫార్మ్‌లోనే అతడికోసం ప్రత్యే కంగా ఓ గదిమాత్రమే ఉన్న ఇంటిని కట్టించాడు శేషగిరి.

ఫణిమాత్రం ఆఫీస్ రూంలోకి వెళ్ళి ప్రయాణ బడలిక తీర్చుకుంటున్నాడు.

ఆఫీస్‌రూమ్ కూడా ఒకేగది ఉన్న డాబాలాంటిది.

లోపల అన్ని సౌకర్యాలు ఉంటాయి—ఎయిర్‌కండిషన్‌తో సహా.

గదిలో ఓ టేబులు, శేషగిరికోసం ఓ రివాల్వింగ్ ఛైర్, అతిథుల పార్టీలకోసం వైర్లుఅల్లిన నాలుగు కుర్చీలు, ముఖ్యమైన ఫైల్స్ పెట్టుకోవటానికి ఓ గాడ్రేజ్ బీరువా.

అంతకు మించి ఆ ఆఫీస్ రూమ్‌లో మరేమీ ఫర్నిచర్‌లేదు.

అసలు ఆఫీస్ అక్కడికి కొంచెం దూరంలోఉంది. అక్కడే ఎకౌంటెంట్ కమ్ క్లర్క్, టైపిస్టు ఉంటారు.

పదినిమిషాల తర్వాత స్వామివచ్చాడు

ఫణి దగ్గరికి.

"అప్పుడే రెడీ అయిపోయావన్న మాట'' స్వామి వేషాన్ని చూసి ఫణి కామెంటు చేశాడు.

పాదం నించి మోకాలు పైవరకు బూటుతోసహా తోలు తొడుగు, మోచేతుల మీదివరకు గ్లోవ్స్‌లాంటి తోలు కవర్లు బిగుతుగా పట్టినట్లు ఉన్నాయి. స్వామి ఆ డ్రెస్‌లో ఫైర్ సర్వీస్ ఉద్యోగిలా ఉన్నాడు.

అతను దగ్గరికి రాగానే పాము చర్మాల వాసన గుప్‌మంది ఫణికి.

పని అయిపోయాక ఆ జోళ్ళని, గ్లోవ్స్‌ని పాము చర్మాలున్న పెట్టెలో భద్రపరుస్తాడు స్వామి.

ఆ జోళ్ళు ఏమాత్రం చప్పుడు చేయవు.

అడుగులు మెత్తగా పడతాయి.

ఇద్దరూ ఆ గదిలోంచి బయటపడ్డారు.

"దిసీ పెల్టిస్ స్కార్చాని, నజా నిగ్రి కొల్లిస్‌ని కలిపి ఉంచిన పంజరం దగ్గరకు వెళ్దాం" ఫణి చెప్పాడు.

"ఓరి బాబోయ్! వాటి దగ్గరకా! రెండూ ప్రమాదకరమైనవేనే!" అప్రయత్నంగా అన్నాడు స్వామి.

"పైగా మీరు పాంటు, షర్టులోనే ఉన్నారు. ఎందుకైనా మంచిది. ఇంటికెళ్ళి గ్లోవ్స్, బూట్స్ వేసుకురండి" స్వామి జాగ్రత్త చెపుతున్నట్టు సలహా ఇచ్చాడు.

"ఫరవాలేదులే! ఇంటికెళ్ళి రావాలంటే టైముపడుతుంది'' మొండిగా సమాధానం చెప్పాడు ఫణి.

* * *

నాగరాజారావ్ తల్లితో సహా గూడెం వచ్చాడు.

పెద్ద చప్పుడు చేస్తూ గేటుతీసి లోపలికి ప్రవేశించాడు.

ముందు నాగరాజారావ్ ఆ తరవాత సుబ్బలక్ష్మి...!

"ఇదిగో! ఇక్కడేరా... ఆ రోజున శివుడు పాముని పట్టుకొని గిరగిరా తిప్పి చంపేశాడు" సుబ్బలక్ష్మి కొడుకుతో చెప్పింది.

నాగరాజారావు గుండె ఎందుకో ఓసారి ఝల్లుమంది.

అతను ఏమీ మాట్లాడకుండా మెట్లెక్కి కాలింగ్ బజర్ నొక్కాడు.

లోపల్నించి 'వస్తున్నా' అన్న కేక వినిపించింది.

మరికాస్సేపట్లో ఆ ఇంటికి కాపలాగా ఉన్న పాములమ్మ తలుపు తీసింది.

పాములమ్మ సుబ్బలక్ష్మికి దూరపు బంధువు. ఎపుడేనా ఇంట్లోని వాళ్ళంతా ఎక్కడికేనా వెళ్ళాల్సివస్తే పాములమ్మని ఇంటికి కాపలా పెట్టి వెళ్ళటం వాళ్ళ అలవాటు.

బతికి చెడిన కుటుంబం పాములమ్మది. వయసు అరవై పైనే ఉంటుంది ఆమెకి. చిన్న చితక అవసరాలను సుబ్బలక్ష్మి ద్వారా తీర్చుకుంటూ ఉంటుంది.

అన్ని గదులు తాళం వేసి వంట గదిని మాత్రం పాములమ్మకి అప్పచెప్తారు.

పాములమ్మ నిలుచున్నపుడు చూస్తే అరసున్నాలా కనిపిస్తుంది.

తలుపు తీసిన పాములమ్మని తప్పించుకుని నాగరాజారావ్ లోపలికి అడుగు పెట్టాడు.

సుబ్బలక్ష్మి గుమ్మం బయటే నిలబడి పాములమ్మని పలకరించింది.

ముందుగా తన గది తాళంతీసి బ్రీఫ్‌ని లోపలున్న టేబుల్ మీద పెట్టాడు.

తర్వాత మిగతా గదుల తాళాలు తీశాడు.

ఆఖరున నాగలక్ష్మి గది తలుపు తీశాడు.

నాగలక్ష్మి గదే అతనికి బెడ్‌రూమ్. ఆ గదిలోనే డబ్బు వగైరాలున్న బీరువా ఉంటుంది.

జేబులో ఉన్న డబ్బుని బీరువాలో పెట్టాలనుకొని బీరువాతాళాలు తీసి తలుపులు తెరిచాడు నాగరాజారావ్.

ధడాలున చప్పుడు చేస్తూ బీరువా తెరుచుకుంది.

అంతలో ఆ గదిలోని అతని మంచం కింద ఏదో మెత్తగా శబ్దం అయినట్లు అనిపించి మెడ వెనక్కి తిప్పి మంచం కిందకు చూశాడు.

"మై...గుడ్...నెస్"

గిరుక్కున మనిషి పూర్తిగా మంచం వైపు తిరిగి కంగారుకంగారుగా అరిచాడు.

మరుక్షణంలో కలవరపడిన పాములా ఒక్క గెంతు గెంతి గుమ్మం ఇవతలకి వచ్చాడు.

ఆలోగా సుబ్బలక్ష్మి లోపలికి వచ్చింది.

"ఏమిట్రా! అలా చిందులు తొక్కుతున్నావు"- విషయం అర్థంకాక కొడుకును అడిగింది సుబ్బలక్ష్మి.

"నా పడగ్గదిలో మంచం కింద పాముంది! అయి బాబోయ్! చాలా పెద్ద పాము! దాని తోకనే అది తినేస్తోంది''

ఘొల్లుమంది సుబ్బలక్ష్మి.

నాగరాజారావ్ చెప్పింది వినగానే పాములమ్మ పడుతూ లేస్తూ గేటుబయటికి వచ్చి "పాము...పాము..." అని అరవసాగింది.



## 6

డాక్టర్ శేషశయన్ మణిని ఆసుపత్రిలో చేర్చుకున్నాడు.

ఆ కుర్రాడిని చూసీ చూడగానే కళ్ళెగరేశాడు శేషశయన్.

"బాగా భయపడినట్లున్నాడు"

అన్యాపదేశంగా అని వెంటనే ఆ కుర్రాడికి గ్లూకోజ్ ఎక్కించేందుకు ఏర్పాట్లుచేశాడు.

గంటన్నర తరువాత సుబ్బారావుని, ఆయన భార్యను పిలిచి జరిగిన సంగతి తెలుసుకున్నాడు.

మణి తెరచిన పెట్టెలోంచి బయటికి వచ్చిన పాముని మళ్ళీ ఎలా పట్టుకొన్నారనే విషయం గురించే ఎక్కువగా చెప్పారు వాళ్ళిద్దరు.

"మీరేం భయపడకండి! అబ్బాయి ఝడుసుకొన్నాడు. ఇలా జరగటం సర్వసామాన్యమే! అబ్బాయి మళ్ళీ మనలో పడేలా నేను చూస్తాను. మీరేం బెంగ పెట్టుకోకండి!"

మణి తల్లిదండ్రులు చెప్పింది విని వాళ్ళకి ధైర్యం చెప్పాడు శేషశయన్.

స్పృహలో లేదన్న మాటేగాని బయటి శబ్దాలను అతను వినగలుగుతున్నాడు.

"ఈ ఒక్క అవకాశం చాలు" అనుకున్నాడు శేషశయన్.

"మణి నాతో బాగా సహకరించాలి!

ఎప్పుడు పడితే అప్పుడు మీ అబ్బాయిని చూడటానికి రావద్దు! మీరు పొద్దున్న, సాయంత్రం ఆసుపత్రికి రండి. చాలు! మీ కుర్రాడిని భద్రంగా చూసుకునే బాధ్యత నాది"

శేషశయన్ చెప్పిన ప్రతిమాటకి తల ఊపారు మణి తల్లిదండ్రులు.

"మీరు మీ అబ్బాయిని ఏమని పిలుస్తారు? అసలు పేరుతోనా, ముద్దుపేరుతోనా?"

"వాడి అసలు పేరు మణి! మేము బాబూ అని పిలుస్తాం వాడిని!"

"సరే! అయితే నేను చెప్పినట్లు ఇద్దరూ చెప్పండి! మీ మాటల్ని నేను టేప్ చేస్తాను"

ఇద్దరూ తలూపారు.

"ఒరే! బాబూ! నేను...! అమ్మని... లే! లే! ఇంకా పడుకున్నావేమిటి?' అనండమ్మా"

ఆమె చెప్పింది.

అదే వాక్యాన్ని పదే పదే చెప్పించాడు శేషశయన్.

తరవాత సుబ్బారావుగారిచేత కూడా అలాంటి వాక్యాలే చెప్పించాడు.

"బాబూ...లే! లే! ఇంకా పడుకున్నావేమిటి? స్కూలుకు టైమయిపోవట్లా! వంట్లో బావుండలేదా! లే!... లేచి మొహం కడుక్కో"

మణి తండ్రి మాటలని మరో టేపు మీద రికార్డు చేశాడు.

నాలుగుసార్లు ఆమె మాట్లాడిన మాటలని, మరో నాలుగుసార్లు ఆయన చెప్పిన మాటలని మూడో టేపు మీదకు ఎక్కించాడు.

మూడో టేప్‌ను ఆన్ చేసి ఇంచుమించు బాబు చెవిదగ్గర పెట్టాడు.

టేప్ పూర్తిగా అయిపోయాక అతనిలోని మార్పుని గమనించసాగాడు.

ఈలోగా శేషశయన్ ఆ టేప్‌ను రీవైండ్ చేయించే ఏర్పాటు చేశాడు.

మూడుసార్లు ఆ టేపుని బాబుకి వినిపించాడు-మధ్య మధ్యలో పావుగంట, పావుగంట ఇంటర్వెల్స్ ఇస్తూ!

తల్లిదండ్రుల పిలుపులు మందుల కంటె ఎక్కువ పనిచేశాయి.

నెమ్మది నెమ్మదిగా కదలసాగాడు బాబు.

దాదాపు నాలుగు గంటల తర్వాత బాబులో చురుకుతనం, చురుకుతనంతో పాటు ముఖంలో ఓరకమైన కళ వచ్చింది.

కళ్ళుతెరవడానికి శక్తికిమించి ప్రయత్నిస్తున్నాడు. బాబు.

బాబు బలవంతంగా, పూర్తిగా కళ్ళు తెరిచాడు.

"బాబూ! మణీ!" శేషశయన్ పలకరించాడు.

మత్తుగా మళ్ళీ కళ్లు మూసుకున్నాడు మణి.

రెండు నిమిషాల తరువాత చురుకుగా కళ్ళు తెరిచాడు బాబు.

ఆ రెండు నిముషాలు శేషశయన్‌కి పాముల పుట్టమీద కూర్చున్నట్లు అనిపించింది.

బాబు సన్నగా, మెల్లగా "అ... హా... మా! అ...మ్...మా!" అన్నాడు.

అదే సమయానికి కొడుకును చూడటానికి వచ్చారు మణి తల్లిదండ్రులు.

కళ్లు తెరచి 'అమ్మా' అనటం చూసి వాళ్ళిద్దరూ ఆనందం పట్టలేకపోయారు.

ఒక్క అంగలో మంచందగ్గరకు వెళ్ళి కుర్రాడికి ఎడమవైపు వంగుని మణి ముఖానికి మూడు జానల దూరంలో

ముఖాలు పెట్టి చూడసాగారు.

మణి-తల్లినీ, తండ్రినీ గుర్తుపట్టలేదు.

నిస్తేజంగా, అనుభూతి శూన్యంగా చూస్తున్నాడు బాబు.

కొడుకు పరిస్థితి ఏమిటో తెలియక "ఉస్..." అంటూ నిట్టూర్చింది తల్లి.

ఏకైక కొడుకు జీవితం సర్వనాశనమై పోయిందన్నంత బాధగా "స్...స్..." అంటూ బరువుగా బాధపడ్డాడు తండ్రి సుబ్బారావుగారు.

"స్...స్...ష్...ష్!"



శేషశయన్ పెద్దగా నోటితో శబ్దం చేస్తూ చూపుడువేలిని నోటికి అడ్డంపెట్టుకొని "నిశ్శబ్దంగా ఉండండి" అని సంజ్ఞ చేశాడు.

అంతే!

మణి గిలగిలలాడిపోతున్న పాములా మెలితిరిగిపోతూ మంచంమీద పడుకునే ఒక్కసారి ఒళ్లు విరుచుకుని "అమ్మో! పాము...పాము..." అని అరిచాడు.

అంతకుముందు ఆ కుర్రాడికి గ్లూకోజు ఎక్కించడానికి బాటిలూ, ట్యూబు స్టాండుకి వేలాడుతూనే ఉన్నాయి.

ఆ ట్యూబుని చూసి మణి పాము

అనుకొని భయపడ్డాడని అతని తల్లిదండ్రులకు తెలియదు.

వాళ్ళిద్దరూ కంగారుగా పక్కనే ఉన్న డాక్టర్ దగ్గిరకి పరుగెత్తారు.

మణి మానసిక స్థితిని అంచనా వేయడానికి ప్రయత్నిస్తూ దీర్ఘాలోచనలో మునిగిపోయాడు డాక్టర్ శేషశయన్.

* * *

**కాళ్ళకూరు** నించి బయలుదేరిన శేషగిరి భీమవరంనించి తాడేపల్లిగూడెం బస్సు కోసం ఎదురుచూశాడు.

అక్కడినించి సరాసరి భీమడోలు వెళ్ళడానికి వేరే బస్సులు ఉన్నా, గూడెం వెళ్లి అక్కడనించి నల్లజర్లమీదుగా భీమడోలు వెళ్లాలని అతని ఆలోచన.

నల్లజర్లలో పాముల సుబ్బిగాడు ఉన్నాడు.

వాడు కనీసం వారానికి ఓ పామునైనా పట్టి శేషగిరికి అమ్ముతాడు.

వాడికి దొరికిన పాము ముసలిదైతే తన దగ్గరే ఉంచుకుంటాడు. వయసులోఉంటే శేషగిరికి ఇస్తాడు.

పాముకి పాతిక రూపాయలు ఇస్తాడు శేషగిరి. సుబ్బిగాడు తెచ్చే పాముల విలువ శేషగిరికి బాగా తెలుసు.

నల్లజర్లనించి అటు భీమడోలు, తిరపతి, చింతలపూడి, ఇటు పోలవరం అన్నీ మెట్ట ప్రాంతాలే.

ఏ మూల చూసినా ఓ పుట్ట దర్శనమిస్తుంది.

సుబ్బిగాడు ధైర్యంగా పుట్ట తవ్వుతాడు. వాడికి సాయం చేసేందుకు మరో ఇద్దరున్నారు. వాళ్ళు అతని బంధువులే!

వాళ్ళ జీవనోపాధి పాములు! పాముల్ని ఆడించి డబ్బుల్ని దండుకోవడం, పాముల్ని అమ్ముకోవడం మాత్రమే వాళ్లకి తెలుసు. పొరపాటున ఎప్పుడైనా ఎక్కువ పాముల్ని పట్టుకోగలిగితే అలా సంపాయించిన డబ్బు వాళ్ళకి సారాకే సరిపోతుంది.

పాములు దొరికిన వెంటనే సుబ్బిగాడే స్వయంగా భీమడోలు వచ్చి వాటిని స్నేక్ ఫార్మ్‌లో అందజేస్తాడు.

స్వామి వాటినిచూసి ఫరవాలేదన్న తరవాతే సుబ్బిగాడికి దారి ఖర్చులతోసహా డబ్బులు ఇస్తాడు శేషగిరి.

అయినా పనిలోపనిగా సుబ్బిగాడి దగ్గిరికి వెళ్లి, అక్కడినించే అలా భీమడోలు వెళ్దామనుకున్నాడు శేషగిరి.

నల్లజర్లలో దిగి సుబ్బిగాడి పాకకి వెళ్ళాడు.

శేషగిరిని చూసి సుబ్బిగాడు ఆశ్చర్యపోయాడు.

"నేను ఇయాల భీమడోలు వద్దారనుకున్నానండీ! కానీ పొద్దున్నే మా పెసిరెంటుగారింట్లో పామువుపిత్తే దాన్నట్టుకోటానికి మావోళ్లెళ్లారండీ! దాన్ని కూడా తీసుకొచ్చేద్దారని ఆగిపోయానండీ" సుబ్బిగాడు చెప్పాడు.

"సర్లే. ఇప్పుడెన్ని ఉన్నాయ్ నీ దగ్గిర"

"రెండేనండి! ఓటి మరీ పిల్లండీ! తస్సదియ్యా! ఎగిరెగిరి పడుతోందండీ! ఓసారి నన్నేసిందండీ! మందేసుకొనేలోగా కాలు బరువెక్కిపోయిందండీ"

"అయితే నువ్వు రేపు భీమడోలురా! ఇదిగో ఈ పదీ తీసుకో బస్సుకి!"

శేషగిరి బస్‌స్టాండ్‌కి వచ్చేసరికి వాసుదేవ్ కనిపించాడు.

ముందు తనే శేషగిరిని చూశాడు.

"చంపేశారు! మీ కోసమే వచ్చాను! మీ ఫార్మ్‌కి,ఆఫీసుకి వెళ్లే మీరు కాళ్ళకూరు

వెళ్ళారని చెప్పాడు! అర్జంటుగా మీరు నాతో బొంబాయి రావాలి" వాసుదేవ్ చెప్పాడు.

"అంటే మీరు అక్కడినుంచి నా కోసం వచ్చారా! వాట్సిదమేటర్! నేను ఫార్మ్‌కి వెళ్ళి దాదాపు పదిరోజులైంది. ఓసారి అక్కడికి వెళ్లి వెంటనే ప్రయాణం అవుదాం" శేషగిరి అన్నాడు.

"వద్దుసార్! టైమ్‌లేదు! నన్ను మా వాళ్లు ప్రత్యేకంగా పంపారంటే ఆలోచించండి! కమాన్! ఇక్కడినుంచి ఇలాగే.. లెటస్ గో"

వాసుదేవ్ అతన్ని కంగారుపెట్టాడు.

బొంబాయిలోని హాఫ్‌కిన్ ఇన్‌స్టిట్యూట్‌లో వాసుదేవ్ పి.ఆర్.ఓ.

ఆ ఇన్‌స్టిట్యూట్ వాళ్లు 'బల్క్'గా పాము విషంకొని విదేశాలకు ఎగుమతి చేస్తారు.

ఇప్పుడు వాళ్ళకి న్యూయార్క్‌నుంచి రెండేళ్ల కాంట్రాక్టుమీద నెలకి పదికిలోల పాము విషం సప్లైచేసే ఆర్డరు దొరికింది.

దానికి సంబంధించి శేషగిరితో ముఖాముఖీ మాట్లాడి ఓ ఒప్పందం కుదుర్చుకోవాలని ఆ కంపెనీ తహతహ!

అంతక్రితం చాలాసార్లు శేషగిరి ఆ సంస్థకి విషం సప్లైచేశాడు. ఇకనుంచి రెగ్యులర్‌గా, నిర్ణీతసమయానికి అందేలా అనుకున్న క్వాంటిటీలో విషాన్ని పంపాల్సి ఉంటుంది.

బిజినెస్ పెంచుకోవటానికి తప్పనిసరిగా వాసుదేవ్‌తో బొంబాయి వెళ్లక తప్పలేదు శేషగిరికి.

* * *

'ది సీ పెల్టిస్ స్కార్బా'ని, 'నజా నిగ్రి కొల్లిస్'నీ కలిపి ఉంచిన పంజరం దగ్గరకు చేరాడు స్వామి, ఫణి. రెండు పాములూ దక్షిణాఫ్రికాలో నివసించే జాతి పాములే!

స్కార్బాకు పక్షుల గుడ్లను తినటం అంటే చాలా ఇష్టం.

వాటి కంఠంలోపల గుడ్లను ఒకేసారి చితుక గొట్టేందుకు వీలుగా ఏర్పాట్లు ఉన్నాయి.

స్కార్బా తల చూడడానికి సన్నగా కనిపిస్తుంది కానీ, అవసరమైతే పెద్దసైజు కోడిగుడ్డును సైతం మింగడానికి వీలుగా నోరును చాపగలుగుతుంది. దాన్ని చూడగానే ఎంత మొనగాడైనా కళ్లుతిరిగి పడిపోతాడు. శరీరం ఇటుకరంగులో ఉన్నట్టు ఉంటుంది. శరీరం పొడవునా అడ్డంగా ఒక వైపునుంచి మరోవైపు వరకూ మాసికల్లా మచ్చలు ఉంటాయి.

పంజరంలో ఉన్న స్కార్బా నాలుగు మూరల పొడవుంది. తలకు బెత్తెడు ఎడం వరకు మొత్తం దాని శరీరంమీద ఇరవై ఆరు మచ్చలున్నాయి. మచ్చకు పైనా, కిందా సన్నని తెల్లని గీతలు! తెల్లబోర్డరు, నల్ల మచ్చల మధ్య శరీరం ఇటుకరంగు పొలుసులతో, మెలి తిరిగినపుడు కనిపిస్తున్న పొట్టకింద తెల్లని అంచులతో స్కార్బా భయంకరంగా ఉంది.

పడగ విప్పకపోవటం దాని ప్రత్యేక లక్షణం. నెమ్మదిగా పాకుతున్నట్లు అనిపించినా దాని చురుకుదనం దానిదే!

భయపెట్టడానికి బుసకొడుతున్నట్లు పెద్ద శబ్దంతో కమ్మరి కొలిమి ముందు తిత్తిలా 'భుస్...భుస్...'అంటూ శబ్దం చేస్తుంది. అంతలోనే మీద పడుతుంది.

ఆరడగుల వెడల్పున్న పంజరంలో స్కార్బా తల ఓవైపుపెట్టి గాఢంగా నిద్రపోతున్నట్లు కదలకుండా పడుకొనివుంది. దాని తోక నిగ్రి కొల్లిస్‌ని తాకుతోంది.

స్నీగ్రి కోల్లీస్ ముడతలు పడిన పలుపు తాడులా ఒక మెలికమీద మరోమెలికవేసి తలని దాని తోకకి మూరెడు దూరంలో పైన పెట్టుకొని ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్లు కనిపించింది.

కోల్లీస్ తలవరకూ కనుగుడ్డు తప్ప మిగిలిన భాగమంతా లేత టమోటాపండు రంగులోఉంది. కన్ను కొంత తేనె రంగులోనూ, కొంత నల్లగా, నలుపు భాగానికి కొంచెం పైగా పడుతున్న వెలుతురు తెల్లగా మొత్తంమీద ఉబ్బెత్తుగాఉన్న నల్ల కంది గింజలా కనిపించింది.

కన్ను చుట్టూ ఉన్న పొలుసులను విడగొడుతున్న గాడిలో కనిపించే నలుపు మనుషల కనురెప్ప వెంట్రుకలంత సన్నని గీతలా ఉంది. తలకి కిందనుంచి రెండుజానెల పొడవున అటూ ఇటూ కొన్ని పొలుసులుతెల్లగా, కొన్ని పొలుసులు నల్లగాఉన్నాయి. ఆ తర్వాత దాని శరీర మంతా కనిపించే పొలుసులు పండీపండని గోరింటాకు ఎరుపులో మెరుస్తున్నాయి.

ఆ పొలుసుల మధ్య సీతాఫలం గొగ్గులమధ్య కనిపించే తెలుపులా లేత నలుపురంగు కొట్టొచ్చేటట్టు కనిపిస్తోంది.

కోల్లీస్ చాలా బలంగా శత్రువుని కాటువేయగలదు. అవసరాన్ని బట్టి, వీలును బట్టి శత్రువు కళ్ళలో విషాన్ని పిచికారీ చేసే శక్తికూడా దానికుంది.

పంజరంపొడవు దాదాపు పది అడుగులు ఉంది. కేవలం ప్రయోగాలకోసం ఆ కొలతలతో పంజరాలు చేయించాడు శేషగిరి.

ఫణి ప్రయోగాలు ఫలిస్తే తక్కువ వ్యవధిలో, తక్కువ పాముల్తో ఎక్కువ విషాన్ని సంపాయించవచ్చునని అతని ఉద్దేశం.

తమచుట్టూ పంజరంఉన్నా స్వామి, ఫణిభూషణ్ వేస్తున్న అడుగులకు అదిరే భూమిద్వారా వచ్చే తరంగాల వల్ల అవి రెండూ ఒకేసారి వాళ్లు వస్తున్న దిశవైపు తలలుతిప్పాయి.

రెండు పాములూ ఒకే ప్రాంతానికి చెందినా వాటి అలవాట్లు వేరు. అప్పటికి నెల్లాళ్లుగా అవి సహజీవనం చేస్తున్నాయి. వాటిలో ఏ మార్పూ కనిపించలేదు ఫణికి.

"లెక్క ప్రకారం ఇవాళ ఈ స్నీగ్రి కోల్లీస్‌చేత విషం కక్కించాలి"

సాయంత్రం సినిమాకు వెళ్దామన్నంత సాదాగా చెప్పాడు.

"నాకు చాలా బడలికగా ఉంది. నేను ఇంటికి వెళ్లిపోతాను. నీ పని నువ్వు చూసుకో" అనేసి వెనక్కి తిరిగి గేటు వైపు వెళ్ళిపోయాడు ఫణి.

స్నీగ్రి కోల్లీస్‌ని బయటకు తీయడానికి వీలుగా, ముందు జాగ్రత్త కోసం కళ్ళజోడు తెచ్చుకోవడానికి స్వామి తన రూమ్‌కి వెళ్ళాడు.

నిజానికది కళ్ళజోడుకాదు. ముఖాన్ని పూర్తిగా కవర్ చేస్తూ ముక్కు దగ్గర మాత్రం రెండు చిల్లులు ఉంటాయి. కళ్ళు కనిపించడానికి వీలుగా కళ్ళజోడు మాదిరిగా రెండు ప్లాస్టిక్ అద్దాలు అమర్చి ఉంటాయి ఆ మాస్క్‌కి. దాన్నే స్వామి కళ్ళజోడు అంటాడు.

* * *

నాగరాజారావ్ ఇంటికి రాగానే పడక గదిలో మంచంకింద పామును చూశాక హడావుడిగా బయటకు వచ్చేశాడు ఒక్క గెంతులో!

అప్పటికే రోడ్డు మీదకు పారిపోయిన పాములమ్మ "పాము...పాము..." అని

అరవటంతో చుట్టుపక్కలవాళ్లు కొందరు, దారినపోయే వాళ్ళు కొందరు గేటు బయట గుమిగూడారు.

లోపలికి రావడానికి ఎవరికీ ధైర్యం చాలటంలేదు.

అంతలోనే నాగరాజారావ్ బయటకు వచ్చాడు.

"ఎలా ఉంది పాము?"

"తాచుపామా?''

"బాగా పొడుగ్గా ఉందా?"

"అసలు సరిగ్గా చూశావా! పామేనా?"

ఎవరెవరో ప్రశ్నల వర్షం కురిపించారు.

అతని కళ్ళలో పాము నీడలు ఇంకా తొలగిపోలేదు. ఆ విషయం అతని వణుకుతున్న పెదాలే చెబుతున్నాయి. కుడి అరచేత్తో నుదుటికి పట్టే చెమటని తుడుచుకొంటున్నాడు.

"అది... అది... పామే! చాలా పొడుగ్గా ఉంది"-మాట పెగుల్చుకొని చెప్పాడు నాగరాజారావ్.

గబగబా ఎవరో వెళ్ళి కర్ర పట్టుకొచ్చారు.

మరో ఇద్దరు మడత మంచం ఊచలు లాగేసి తీసుకు వచ్చారు.

"అది...ఆ పాము...మనకి లొంగకపోవచ్చు. దాని తోకనే అది తింటోంది. ఆకలిమీదుంది"

అంతమంది ఉన్నారన్న ధైర్యంతో తనని తాను కూడదీసుకుంటూ చెప్పాడు నాగారాజారావు.

ఆ మాటలు వినటంతో పాముని చంపటానికి బయలుదేరిన ధైర్యవంతులు జంకారు.

"నిడదవోలులో పాముల నరసయ్య ఉంటాడు. ఫోను మీద పిలిచి పామును కట్టేయిద్దాం"-ఎవరో సలహా ఇచ్చారు.

"పాముల నరసయ్య పాము కాటుకి మంత్రం వేస్తాడు కానీ పాముల్ని కట్టెయ్యలేడు" ఇంకెవరో చెప్పారు.

సుబ్బలక్ష్మి కొడుకునీ, అక్కడ చేరిన వాళ్ళనీ గమనిస్తోంది.

ఏదో గుర్తుకువచ్చినదానిలా ఆవిడ తల ఊపి నాగరాజారావ్‌ని పిలిచింది.

"శేషగిరికి ఫోన్ చెయ్యి"

తల్లి మాటలు విని నాగరాజారావ్ ఓ క్షణం ఆలోచించాడు.

'శేషగిరి టాక్సీలోనో, కార్లోనో వెంటనే బయలుదేరినా గంటకు కానీరాడు. ఈలోగా ఏదైనా ఉపద్రవం జరిగితే...' అనుకున్నాడు.

అప్పుడే జ్ఞాపకం వచ్చింది ఫోన్ ఆ పామున్న గదిలోనే ఉందని. పైగా యస్.టి.డి. సౌకర్యంలేదు. కనెక్షన్ దొరకడానికి ఎంత సేపు పడుతుందో? లోపలికి వెళ్ళటానికి నాగరాజారావ్‌కి ధైర్యం చాలలేదు.

పక్కింటినించి శేషగిరికి ఫోన్ చేశాడు. కానీ శేషగిరి ఊళ్ళో లేడు.

"హైద్రాబాద్ వెళ్తాననిచెప్పి వెళ్ళాక ఇప్పటి వరకు ఆఫీసుకు రాలేదండి! కాళ్ళకూరులో కనిపించినట్లు స్వామి, ఫణిగారు చెప్పారు. మేము ఇంకా అక్కడే ఉన్నారనుకొంటున్నాం"

భీమడోలు ఆఫీస్‌నుంచి ఎక్కౌంటెంట్ కాబోలు చెప్పాడు.

"స్వామిని, ఫణిని అర్జంటుగా గూడెం రమ్మనమని చెప్పండి"

నాగరాజారావ్ ఫోన్ పెట్టేశాడు.

మాటిమాటికి గుమ్మం వైపు చూస్తున్నారు అక్కడ గుమిగూడినవాళ్ళు.

ఆ పాము ఎప్పుడు బయటికి వస్తుందో

అని వాళ్ళ భయం.

లెక్క ప్రకారం ఊపిరి తీస్తున్నారంతా!

చూస్తుండగానే గంటంపావు గడిచి పోయింది. ఎవరికీ టైమ్ తెలియటం లేదు.

క్రమక్రమంగా జనం పెరుగుతున్నారు. వచ్చిన వాళ్ళలో చాలామంది నాగరాజారావ్‌కి అత్తగారు చనిపోయినందుకు సానుభూతి చెపుతున్నారు.

గూడెంలో అతను చాలా పలుకుబడి ఉన్న వ్యక్తి. పైగా మాజీ మంత్రి అల్లుడు! ఆదిశేషుకి పదవి పోయినా, పక్షవాతం వచ్చినా నాగరాజారావ్ వ్యక్తిత్వానికి లోటురాలేదు.

నాగరాజారావ్ శరీరం వేడెక్కిపోతోంది. తల బద్దలయిపోతున్న అనుభూతి.

తన ఇంట్లోకి తానే వెళ్ళలేని పరిస్థితి.

ఫణిని, స్వామిని చూడగానే ప్రాణం లేచి వచ్చింది నాగరాజారావ్‌కి.

రిక్షావాడికి స్వామి డబ్బులిస్తోంటే, ఫణి గబగబా నాగరాజారావ్‌ని కలిశాడు.

కంగారు కంగారుగా అన్ని వివరాలు చెప్పేశాడు నాగరాజారావ్.

"మై గాడ్!" గట్టిగా అరిచాడు ఫణి.

"అది ఆఫిలో ఫాగస్‌హనా" వెంటనే అతనే అన్నాడు.

అయోమయంగా చూశాడు నాగరాజారావ్.

"అదేనండి, కింగ్ కోబ్రా పేరు వినలేదూ! అదే ఇది"

జేబులో పామున్నట్లు ఎగిరి పడ్డాడు నాగరాజారావ్.

"అయ్యబాబోయ్! ఇపుడెలా?"

నాగుపాముకీ, కింగ్‌కోబ్రాకీ తేడా లేదని నాగరాజారావ్‌కి తెలుసు.

నాగుపామంటే తమ ఇలవేల్పే!

'నాగుపాముని చంపితే కళ్ళుపోతాయి'

చిన్నపుడు ఎప్పుడో తల్లి చెప్పిన మాటలు జ్ఞాపకంవచ్చాయి నాగరాజారావ్‌కి.

"ఏమిట్రా అంటున్నాడు ఫణి" సుబ్బలక్ష్మి కొడుకు దగ్గరికి వచ్చి అడిగింది.

"నా పడగ్గదిలో ఉన్న పాము నాగుపాముట" చెప్పాడు అతను.

"ఆఁ"

ఆశ్చర్యపోతూనే అప్రయత్నంగా గాలిలో సమస్కారంచేసింది సుబ్బలక్ష్మి.

రిక్షాకు డబ్బులు ఇచ్చేసి స్వామి అక్కడికి వచ్చి నిలబడి వారి మాటలు వింటున్నాడు.

"ఇలాంటి పాములు సాధారణంగా ఎక్కడా కనిపించవు. వీటినే మనం దేవతా పాములంటాం. మనదేశంలోను, చైనాలోను బర్మా, అండమాన్‌లలోను ఎక్కువగా ఉంటాయి ఇలాంటి పాములు"

ఫణి చెబుతున్న విషయాలని ఆసక్తిగా వింటున్నారు జనం.

"మనదేశంలో కర్నాటక, ఉత్తర ప్రదేశ్, ఒరిస్సాల్లో కింగ్‌కోబ్రాలు ఎక్కువగా ఉంటాయి! సొంత గూళ్ళు కట్టుకోవటం వాటికి మాత్రమే చేతనవును! ఆ గూడు రెండు గదులుగా ఉంటుంది. ఓ గూటిలో గుడ్లు పెడుతుంది. మరో గూటిలో ఇది ఉంటుంది. ఒక్కొక్క దఫాకి 20 నుంచి 40 గుడ్లు పెడతాయియివి"

వినేవారున్నారని ఉత్సాహంగా చెప్పుకుపోతున్నాడు ఫణి.

"ఒక్కొక్క గుడ్డు 50నుండి60మిల్లీ మీటర్ల పొడవు, దాదాపు 32మిల్లీమీటర్ల

వెడల్పు, 30-40 గ్రాముల బరువు ఉంటాయి. ఇప్పటిదాకా బాగా పెరిగిన కింగ్ కోబ్రా 18 అడుగుల 4అంగుళాల పొడవు మాత్రమే ఉంది. సాధారణంగా ఇవి 10,12 అడుగుల కంటే ఎక్కువ పెరగవు.

నాగరాజారావ్ అయోమయంగా ఫణిని, అతని కబుర్లను వింటున్న మనుషలను మార్చి మార్చి చూస్తున్నాడు.

స్వామికి ఆపాటికి విషయం అర్థం అయిపోయింది.

"ఇంట్లో పాములను తినే పాముంది" స్వామి తనలో తనే అనుకున్నాడు.

స్వామినే నమ్ముకుంది సుబ్బలక్ష్మి.

స్వామి చుట్టూ చూశాడు. అతనికి ఏమీ దిక్కు తోచలేదు.

ధైర్యంగా తీసి ఉన్న గేటులోంచి లోపలికి అడుగు పెట్టాడు. అతని వెనకాలే నాగరాజారావ్ కూడా అనుసరించాడు.

స్వామి మెట్లెక్కి గుమ్మంలోంచి లోపలికి తొంగి చూశాడు.

"పాము లోపల నా పడక గదిలో ఉంది" నాగరాజారావ్ గుమ్మంలోంచి కనిపిస్తున్న తలుపు తీసి ఉంచిన పడక గది వైపు వేలితో చూపించాడు.

స్వామి అడుగులో అడుగు వేసుకుంటూ నిశ్శబ్దంగా ఆ గదికి రెండు అడుగుల దూరంలో ఆగి లోపలికి పరకాయించి చూశాడు.

అతని దృష్టి మంచం కింద ఆగిపోయింది.

చిన్నపిల్లాడు వంకర టింకరగా రాసిన 'ర'లా కనిపించింది కింగ్ కోబ్రా. తోక ప్రత్యేకంగా సున్నా నుంచి బయటికి కన్పిస్తోంది 'ర' తలకట్టులా!

"అయిదు అడుగులుంటుంది" స్వామి మనసులోనే అంచనాకట్టసాగాడు పామును.

పాము శరీరం నిండా పొలుసులు చీకట్లో కూడా తళతళలాడుతున్నాయి.

కళ్లు పెద్దవిచేసుకుని నిశితంగా చూడసాగాడు స్వామి.

పాము తన తోకను తినడానికి తీవ్రంగా ప్రయత్నిస్తోంది. దాని శరీరం మీద అడ్డంగా ముప్ఫై, నలభై తెల్లని చారికలు ఉన్నాయి.

అనుకోకుండానే అతనికి కట్లపాము జ్ఞాపకమొచ్చింది.

'అది తోకను కొరుకుతోంది కనుక నొప్పిపుడితే ఆ ప్రయత్నం విరమించుకోవచ్చు. అప్పుడు దానిదృష్టి గుమ్మం దగ్గర నిలబడిన తనవేపు ఎలాగయినా ప్రసరిస్తుంది. ఈలోగానే ఏదో ఒకటి చెయ్యాలి' అనుకొన్నాడు స్వామి.



## 7

నాగలక్ష్మి కాళ్ళకూరులో నిరుత్సాహంగా ఉంది-నాగరాజారావ్‌కూడా వెళ్ళిపోయాక!

శివుడు తప్ప మరెవ్వరూ కదిలే మనుషులు ఆమెకు ఆ ఇంట్లో కనిపించటంలేదు.

పార్వతి బంధువుల ఇంట్లో పెళ్ళి ఉందని ఏదోఊరు వెళ్ళింది. పదిరోజుల దాకా పార్వతి రాదు.

ఆదిశేషు మంచంమీద పడిఉన్నాడు.

అప్పటివరకు జరిగిన సంఘటనలను



నెమరువేసుకోసాగిందామె.

తాము దైవంలా పూజించే పామువల్ల తల్లి చచ్చిపోయింది.

పరామర్శకోసం వచ్చిన బంధువుల పిల్లాడు పామునుచూసి భయపడి స్పృహ తప్పాడు.

'అసలు శేషగిరి ఆ పామును ఇక్కడిదాకా ఎందుకు తీసుకురావడం? కొంపతీసి

అతను కావాలనే ఏదయినా గూడుపుఠాణీ చేయటంలేదు కదా?' తనకు తానే ప్రశ్నించుకుంది నాగలక్ష్మి.

జవాబు దొరకలేదు.

'శేషగిరికి పాములే జీవనాధారం. అతను పాములమధ్యే తిరుగుతాడు. పాముల మంచిచెడ్డల గురించి బాగా తెలుసు' అనుకొంటూండగానే ఆమెకు ఓ సంఘటన జ్ఞాపకమొచ్చింది.

ఆరోజు రాత్రి శేషగిరి గూడెంలో తమఇంట్లోనే పడుకున్నాడు. ఏదో పని మీద గూడెం వచ్చాడు. దాదాపు 12



గంటల ప్రాంతంలో "పాము...పాము" అని అరిచాడు శేషగిరి.

ఆ అరుపులు తలుపులుమూసిఉన్న తమ పడకగదిలోకి వినిపించాయి. తనూ, నాగరాజారావ్, వేరేగదిలో ఉన్న సుబ్బ లక్ష్మి శేషగిరి మంచందగ్గరికి పరుగెట్టారు. తీరాచూస్తే శేషగిరి మామూలుగానే మంచంమీద పడుకొని గాఢంగా నిద్ర పోతున్నాడు. కాకపోతే అతని ముఖం ఆందోళనగా ఉంది.

నిద్రలేపి "ఏమిటి? ఏమయినా కల గన్నావా?" అని అడిగాడు నాగరాజా రావ్. తెలివివచ్చాక సిగ్గుపడిపోయాడు శేషగిరి–కలలో పలవరించినందుకు.

అపుడు నాగలక్ష్మి అతనిని బాగా వేళాకోళం పట్టించింది.

"పాములతో సహజీవనం సాగిస్తున్నా నాకు మాత్రం పాములంటే చచ్చేంత భయం" అన్నాడు శేషగిరి.

ఆ మాటలు జ్ఞాపకంరాగానే శేషగిరి మీద జాలిగలిగింది.

అతను తనకి వరుసకు అన్న అవు తాడు. అతని వ్యాపారానికి అవసరమయి నప్పుడల్లా నాగరాజారావే డబ్బు సర్దుతూ ఉంటాడు. బంధుత్వంకొద్దీ అతను హడా వుడిగా హైదరాబాద్‌నించి కాళ్ళకూరువచ్చే శాడు. పాముల్ని కొనడానికే శేషగిరి హైదరాబాద్ వెళ్ళాడని తెలుసు ఆమెకు.

వ్యాపారంకంటే ఎక్కువగా బంధు ప్రేమను చూపినందుకు శేషగిరిని మనసులోనే అభినందించింది నాగలక్ష్మి. దాంతో అతనిపై తలెత్తిన అనుమానం పటాపంచలయింది.

శేషగిరి తెచ్చిన పాము పెట్టెను తెరవటం మణి తప్పు. ఆ కుర్రాడిని పట్టించుకోకుండా ఉండటం అతని తల్లి దండ్రుల తప్పు.

ఆ అభిప్రాయానికి రాగానే నాగ లక్ష్మికి మణి జ్ఞాపకంవచ్చాడు. 'స్పృహ వచ్చిందో లేదో. ప్రాణానికి అపాయం లేకపోవచ్చు' నాగలక్ష్మి అనుకొంది.

ఇంట్లో మనుషులు ఎవరూ లేకపోవ డంతో పరధ్యానంగా ఏవేవో ఆలోచిస్తూ మంచంమీద పడుకొని ఉందామె.

అప్పుడే శివుడు అటువచ్చి ఆమెను చూశాడు.

హఠాత్తుగా ఆమెకి గూడెంలో తమ ఇంటి ముందు శివుడు పాముని చంపటం గుర్తుకు వచ్చింది.

ఆ పాము ఆమె కళ్ళలో మెదుల్తోంది.

శివుడు పామును చంపిన కొద్ది సమ యానికే తన తల్లి చనిపోయినట్లు టెలిగ్రామ్ వచ్చింది.

శివుడు పాముని చంపడానికీ, తల్లి చని పోవటానికి సంబంధం ఉందా?

తమకు పాము ఇలవేల్పు.

ఇలవేల్పుని చంపటం ఎంత తప్పు!

తన చిన్నప్పుడు ఆదిశేషు ఓ కట్లపామును చంపాడు.

అప్పుడు వాళ్లు వేరే ఇంట్లో ఉండే వారు.

పెంకుటిల్లు! విశాలమైనదే!

ఇంటి మొగలో ఉన్న ధాన్యపుగాదె దగ్గిర ఆడుకుంటోంది తను.

సన్నని పొట్లకాయంత లావుగా, మూరన్నర పొడవు ఉన్న కట్లపాము ఆమె వైపే పాక్కుంటూ రావడం చూశాడు ఆదిశేషు.

కట్లపాము తన వైపు వస్తున్నట్లు నాగలక్ష్మికి తెలీదు.

హఠాత్తుగా కర్రతో నేల మీద కొట్టిన చప్పుడవటంతో నాగలక్ష్మి ఉలిక్కిపడి

వెనక్కి తిరిగింది.

కట్లపాము గంతులేస్తోంది.

అప్పటికే ఓ దెబ్బ దాని నడుంపై పడింది.

అందువల్ల అది ఎదరకు పాకలేక పోతోంది.

ఉన్న చోటే ఎగురుతూ తాడు ఆట ఆడుకుంటున్నట్టు అనిపించింది.

అంతలో ఆదిశేషు వీలు చూసుకుని మళ్ళీ కర్రతో బలంగా పాముని కొట్టాడు.

రెండో దెబ్బ దాని తలకు కొంచెం కిందగా తగిలింది.

అక్కడికి దాని శరీరం చిట్లిపోయింది.

అయినా అది గంతులు వేయటం మానలేదు.

తల కదలటం లేదు కానీ మిగతా శరీరాన్ని తువ్వాలు దులుపుతున్నట్లు తపతప నేలపై కొట్టసాగింది.

అదను చూసుకుని కర్రకొసతో దాని తలపై నొక్కిపట్టి కవ్వం తిప్పినట్టు చేతోనే కర్రని అటు ఇటు తిప్పసాగాడు ఆదిశేషు.

మొత్తానికి ఆ కట్లపాము చచ్చింది.

తల పూర్తిగా చితికిపోయినా, శరీరం మీద రెండు చోట్ల బలమైన దెబ్బలు పడినా మరి కొన్ని క్షణాలపాటు తోక మాత్రం కదులుతూనే ఉంది.

చివరికి తోకలో కూడా పూర్తిగా చలనం ఆగిపోయాక నాగలక్ష్మి వైపు తిరిగి "ఎంత గండం తప్పిపోయింది" అన్నాడు ఆదిశేషు - కూతుర్ని పాము ఏమీ చేయకుండానే అక్కడికి తాను రాగలిగానన్న సంతృప్తితో!

కానీ, ఆ తర్వాత అతనికి జ్ఞాపకం వచ్చింది. "అయ్యో పాము మాకు ఇలవేల్పు కదా" అని!

మరుక్షణం నించే కళ్లు మసక మసకగా కనిపించసాగాయి.

"మన వంశం వాళ్లు పాముని చంపినా, చంపించినా కళ్లు పోతాయి."

ఎపుడో ఆదిశేషుకు వాళ్ళ తాతయ్య చెప్పిన మాటలు 'ఆటో సజెషన్'లా గుర్తుకు వచ్చాయి. ఆ వెంటనే అతని దృష్టి మసక మసకగా మందగించింది.

ఆ తర్వాత రెండు రోజులయ్యాక ఇంట్లోని పెద్దవాళ్ళు ఆదిశేషు చేత సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి షష్టి రోజున వెండి కళ్లు సమర్పించుకుంటామని మొక్కించాక ఎవరో మంత్రం వేసినట్లు మళ్ళీ చూపు అనసాగింది అతనికి!

చిన్నపుడు తన కళ్ళముందే తండ్రి చంపిన కట్లపాము ఆకారాన్ని గుర్తు చేసుకోవటానికి ప్రయత్నించింది నాగలక్ష్మి.

ప్రాణం పోయినా, రకరకాలుగా మెలికలు తిరుగుతున్న ఆ పాము తోకే ఆమె కళ్ళల్లో మెదలసాగింది. అది మొత్తం మీద సిమెంటు రంగులో ఉంది. మధ్య మధ్య అడ్డంగా సగం కనిపించే నల్లని ఉంగరాల కట్లు!

దానికి తగిలిన దెబ్బల బాధ తోక కదలికల్లో ప్రస్ఫుటించింది నాగలక్ష్మికి.

పసితనంలో ముద్ర వేసుకున్న ఆ దృశ్యం ఆమెలో పాముల పట్ల మరింత భయాన్ని పెంచింది.

ఆ రోజున కట్లపామును చంపినందుకు తండ్రికి రెండు రోజులు కళ్లు కనిపించలేదు.

శివుడు తన ఇంట్లో చంపిన పాముకు ఇంకా మహత్తు ఉండి ఉంటుంది. దోసె దంత పడగ విప్పింది. బహుశా అది నాగుపామే అయి ఉంటుంది.

పాము అంటే అంత భయం ఉన్న

తాను శివుడికి ఆ పాముని చంపడానికి చీర చెంగును ఎలా చింపి ఇచ్చింది?

ఆ రోజున నాగులచవితి. ఆమె కూడా అత్తగారితోపాటు ఉపవాసం ఉండి పుట్టలో పాలుపోసి వచ్చింది.

ఇంటి దగ్గిర శాస్త్రోక్తంగా పూజ చేసింది.

పాము తన ఇంటి ముంగిట్లోకి వచ్చిందంటే బహుశా తననీ, తన కుటుంబాన్నీ ఆశీర్వదించటానికే వచ్చి ఉంటుంది.

కానీ, తాను తొందరపడి మానవ సహజమైన భయంతో దాన్ని చంపించేసింది.

తాను సాయంచేసి ఉండకపోతే శివుడికి ఆ పాముని చంపడం అసాధ్యం అయి ఉండేది.

శివుడు పక్కకు తప్పుకుని ఉంటే ఆ పాము తన దోవన తాను వెళ్ళిపోయేదేమో?

తానో పాముని చంపించింది కనుక సుబ్రహ్మణ్యేశ్వరుడు తగిన శిక్ష విధించాడు.

తల్లి మరణంతో సరైన గుణపాఠం చెప్పాడనే నిర్ధారణకు వచ్చేసింది నాగలక్ష్మి.

శివుడు ఆలోచనల్లో వున్న నాగలక్ష్మిని అలాగే చూస్తున్నాడు.

ఆమె ఏమాత్రం కదలకుండా అలాగే పడుకొనివుంది.

తపస్సులో ఉన్న నాగకన్యలా కనిపిస్తోందామె శివుడికి! ఆస్థితిలో ఆమెను ఒక్కసారి తాకాలనిపించింది శివుడికి.

ఆమె పరధ్యాసంగా ఉంది.

నిశ్శబ్దంగా .... నాగలక్ష్మిని తదేకంగా చూస్తూ గదిలో అడుగుపెట్టాడు శివుడు.

మంచం దగ్గరకు వచ్చేశాడు.

ఆమె ఇంకా అదే భంగిమలో పడుకొని ఉంది. ఎడమ చేయికిందనించి చీర కట్టువరకూ నగ్నంగా ఉన్న ఆమె శరీరంమీద అరిచేతిని ఆన్చాడు శివుడు.

క్షణం కంటె తక్కువ సేపు ఆమెలో ఏ చలనంలేదు.

ఆ వ్యవధిలో శివుడి మనస్సులో తీయని అనుభూతి.

అతని శరీరంలోని రక్తం సముద్రంలా పరవళ్లు తొక్కింది. గుండె ఆ కాస్సేపట్లో ఎన్నిసార్లు కొట్టుకుందో అతనికే తెలియదు.

ఊపిరి బిగపట్టడంవల్ల ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. తట్టుకోలేని ఉద్వేగంవల్ల అతని కుడి చెయ్యి సన్నసన్నగా వణికింది.

ఆ ఉద్రేకంలో కుడిచేతి వేళ్ళతో సుతారంగా నాగలక్ష్మి శరీరాన్ని వత్తసాగాడు.

అది అంతా క్షణం కంటే తక్కువ సేపే!

తనకు తెలియకుండా తన శరీరం మీద పాకుతున్న పాముని హఠాత్తుగా గుర్తించినంత కంగారుగా బెంబేలెత్తిపోయి ఒక్క ఉదుటున చివాలున మంచం దిగింది నాగలక్ష్మి.

ఆ విసురుకి శివుడి కుడిచెయ్యి మంచం పట్టికి కొట్టుకుంది.

అదిరిపాటుతో లేవటంతో ఆమె పైట జారిపోయింది.

అప్పటి వరకు పడుకుని ఉండటంవల్ల జాకెట్టు చెదిరింది.

ఆమె ఎత్తు గుండెలు సగం వరకూ శివుడికి కనిపిస్తున్నాయి.

"అదేమిటండీ! అలా ఉలిక్కిపడ్డారు. పగటి పూట కళ్ళు తెరచుకొనే పీడకలలు

కంటున్నారా" అన్నాడు శివుడు.

నాగలక్ష్మి పైట సర్దుకోలేదు.

"ఏరా! ఒళ్ళెలావుంది? నరికి పోగులు పెట్టేస్తాను వెధవా!"

శివుడు తనని తాకినప్పటి స్పర్శని చీదరించుకున్నట్లు అంది నాగలక్ష్మి.

"ఏమిటండీ! ఏమయిందిప్పుడు? ఎన్ని సార్లు పిలిచానండి మిమ్మల్ని? ఎంత భయపడిపోయానండీ! మీరు ఎంతకీ పలక్కపోతే! అందుకే తట్టి లేపానండీ!" సాధ్యమైనంత అమాయకంగా ముఖం పెట్టి అన్నాడు శివుడు.

"నా వంటిమీద చెయ్యి వెయ్యడానికి ఎన్ని గుండెలు నీకు! పోన్లేకదాని చిన్నప్పటి నుంచి ఇంట్లో పెంచి పోషిస్తున్నందుకు..."

అంతలోనే తానెలా వుందో జ్ఞాపకం వచ్చింది నాగలక్ష్మికి.

గబగబా పైట పైకిలాక్కుంది.

"ఇది మరీ బావుందండీ! ఎప్పుడూ లేంది ఇదేమిటండీ కొత్తగా" అంటూనే శివుడు ఆగదిలోంచి బయటకు వచ్చేశాడు.

శివుడు 'కొత్తగా' అనటంలో వాడి ఉద్దేశాన్ని కనిపెట్టింది నాగలక్ష్మి.

నాగరాజారావ్‌కి ఫోన్‌చేసి ఈ విషయం చెప్పి శివుడిని పన్లోంచి తీసేయాలనుకుంది.

గబగబా ఫోనున్న గదిలోకి వెళ్ళి ఎక్స్ఛేంజివాళ్ళకి నెంబరు చెప్పి కనెక్షన్ ఇమ్మంది.

మరో రెండు నిమిషాల్లో కనక్షన్ దొరికింది!

"ట్రింగ్...ట్రింగ్"

తదేకంగా మంచంకింద ఉన్న పామునే చూస్తూ దాన్ని ఎలా పట్టుకుందామా అని తీవ్రంగా ఆలోచిస్తున్న స్వామి టెలిఫోన్ రింగ్ అయిన శబ్దానికి ఉలిక్కిపడ్డాడు.

టెలిఫోన్ ఇంకా శబ్దం చేస్తూనే ఉంది. టెలిఫోన్ రింగవుతున్న శబ్దం విని పాము తోకని వదిలేసి గిరుక్కున స్ప్రింగులా వెనక్కి తిరిగి టెలిఫోన్‌వైపు చూసింది.

టెలిఫోన్ నుంచి ఇంకా శబ్దంవస్తూనే ఉంది.

పాములో కదలికలు చూసి నిప్పులు తొక్కినట్లు రెండడుగులు వెనక్కి వేశాడు స్వామి.

దాదాపు వీధి గుమ్మంవరకు వెళ్ళిపోయాడు నాగరాజారావ్.

బయట జనం ఉత్కంఠతో లోపలివైపే చూస్తున్నారు.

లోపల ఉన్న పాము గురించే ఆలోచిస్తున్నాడు ఫణి. 'పాము ఆకలిమీద ఉంది'-తనలో తనే అనుకున్నాడతను.

వెంటనే అతనికి మెరుపులా ఓ ఆలోచన వచ్చి గబగబా ఎవరికీ చెప్పకుండా ఎక్కడికో వెళ్ళాడు ఫణి.

టెలిఫోన్ ఇంకా రింగ్ అవుతూనే ఉంది.

చీలిన నాలుకతో నేలపై తడుముతూ అంగుళం అంగుళం చొప్పున ఎదరకు రాసాగింది కింగ్ కోబ్రా.

పాము ప్రతికదలికనీ అతి జాగ్రత్తగా గమనిస్తున్నాడు స్వామి.

'చేతికి దొరకదు'

పాము సైజును అంచనావేస్తూ నిర్ధారించుకున్నాడతను.

టెలిఫోన్ రింగవటం మానేసింది.

మళ్ళీ ఆ గదిలో నిశ్శబ్దం.

ఆ నిశ్శబ్దం కూడా కోబ్రాకి చిరాకు కల్గించింది. "బుస్....స్" అంటూ పడగ విప్పి తల పైకెత్తి, మిగతా శరీరాన్ని

అలాగే వదిలేసి పైకి లేచింది.

దాని చూపు తలుపు మూలగా ఉన్న ఫోన్‌మీదే !

స్వామిని, నాగరాజారావ్‌ను అది గమనించలేదు.

పడగవిప్పి పైకి లేవగానే స్వామి, నాగరాజారావ్ వీధి గుమ్మం వరకూ వచ్చేసి గుమ్మంలోపలే నిలబడి ఉన్నారు.

పడకగది గోడకు అభిముఖంగా పైకెత్తి ఉన్న దాని పడగ వాళ్ళకి కనిపిస్తోంది.

ఫణి అప్పుడే మళ్ళీ వచ్చాడు. అతని చేతిలో కోడిగుడ్ల కేసు ఉంది. మొత్తం పన్నెండు గుడ్లు.

జనాన్ని తప్పించుకొని ధైర్యంగా గేటు దాటి లోపలికి వచ్చాడు.

పాముమీద నించి దృష్టి మరల్చకుండానే ఫణి రాకను గమనించాడు స్వామి.

నాగరాజారావ్ గుమ్మం దాటి ఇవతలకి వచ్చేశాడు.

"ఏమిటీ...గుడ్లు తెచ్చావ్?" ఫణిని అడిగాడు నాగరాజారావ్.

"వీటితో దాని ఆటకట్టు"

ఆ ఆలోచన తనకు రానందుకు నాగరాజారావ్ తనలో తానే సిగ్గుపడ్డాడు.

ఇష్టంలేని పనిచేస్తున్నట్టు అన్యమనస్కంగా ఆ గుడ్లు అందుకున్నాడు స్వామి.

తనంతట తాను ఆ పామును పట్టుకోలేనందుకు స్వామి 'ఇన్‌ఫీరియారిటీ' ఫీలవుతున్నాడనుకున్నాడు నాగరాజారావ్.

"గుడ్లు ఇంకా కొంచెం వేడిగా ఉన్నాయి. ఉడకబెట్టించాం?"

స్వామి అడిగాడు ఫణిని – పామును చూస్తూనే!

"అవును! ఈ పద్ధతే మంచిదికదూ!"

ఫణి జవాబును వినిపించుకోలేదు స్వామి.

ఓ గుడ్డును చేతిలోకి తీసుకొని పడగ విప్పిన పాముకు, గోడకు మధ్య ఉన్న సందులోంచి నేలబారుగా ఓ గుడ్డును గుమ్మానికి ఎదురుగా ఉన్న గోడవైపు దొర్లించాడు స్వామి.

గుడ్డుతో పాటే చర్రున పాము అటువైపు ఎగిరి ఎగిరి వెళ్ళింది.

గోడకు కొట్టుకుని చిటుక్కున పగిలింది బోయిల్డ్ ఎగ్.

గోడకు తగిలి వెనక్కు వస్తున్న పగిలిన గుడ్డుపై 'ఫట్'న పడగతో కొట్టింది పాము.

కానీ గుడ్డు జారిపోయింది.

పాము గదిలో ఆ గోడవరకు వెళ్ళటం చూసి ధైర్యంగా గుడ్ల కేసును నిశ్శబ్దంగా పడక గది గుమ్మంలో ఉంచాడు స్వామి.

గుడ్డు కాస్సేపు అటూ ఇటూ కదిలి ఆగిపోయింది.

అది తన ఆహారమేనని అర్థం చేసుకుంది పాము.

పడగ ముడుచుకుపోయింది.

ఆలోచించి ఆలోచించి, గుడ్డు సైజుకు నోరు జాపి ఆ గుడ్డును నోట చిక్కించుకుంది కోబ్రా.

చప్పుడు చేయకుండా స్వామి ఒక్కొక్క గుడ్డును తీసి జాగ్రత్తగా నేలపై పరవసాగాడు. పదకొండు గుడ్లను నేలమీద పరిచేసి, కేసు తీసుకుని వెనక్కి వచ్చేసి, తీసివున్న పడక గదిగుండా ఎదురుగా అటు తిరిగి ఉన్న పామునే చూడసాగాడు.

గుడ్డును పూర్తిగా మింగేసిందది. దాని తలకిందుగా గుడ్డు ఆకారంలో పాము శరీరం ఉబ్బింది.

దాని తోక ఆ గదిలో ఉన్న మంచం

కోడు కిందఉన్న రాతిదిమ్మకు తగుల్తోంది.

ఒళ్ళు విరుచుకోవటానికి ఆత్రుత పడు తున్న మనిషిలా తోచింది ఆ పాము... స్వామికి.

తోకను రాతిదిమ్మదగ్గర్నించి వెనక్కి లాగుకొని పారాడటానికి ఓపిక లేని బక్కపల్చని పాపాయిలా కోబ్రా క్రమ క్రమంగా రాతిదిమ్మ వైపు జరగసాగింది.

తర్వాత అది మెల్లిమెల్లిగా ఆ రాతి దిమ్మచుట్టూ చుట్టగా చుట్టుకొంది.

దాంతో దాని తల మళ్ళీ మంచం కిందకి వచ్చింది. సరిగ్గా ఆ తల రాతి దిమ్మపై ఆనుకొని ఉంది. రాతిదిమ్మ ఒంపులో కోడిగుడ్డు కలిసిపోయింది.

అమ్మవారి జాతర్లలో ఒంటి పడగ ఉన్న గరగలా ఉందా పాము.

ఉడికిన కోడిగుడ్డు అరిగించుకోవటానికి ఆ నాగుకి కనీసం పది నిమిషాలైనా కావాలి.

అదే పచ్చిగుడ్డు అయితే అంత సమయం అక్కర్లేదు.

కోబ్రాలో మళ్ళీ కదలిక వచ్చేలోగా బంధించేయాలనుకున్నాడు స్వామి.

లోపల గదివైపుగల మంచం కోడు కింద రాయికి చుట్టుకొంది పాము.

ఫణి కూడా ఆ విషయాన్ని గమనించాడు.

"ఇవతలివైపు నుంచి మంచాన్ని పైకి ఎత్తేసి..." గట్టిగా, ఉత్సాహంగా ఆ పాముని ఎలా పట్టుకుంటే బావుంటుందో చెప్పబోయాడు ఫణి.

ముక్కుమీదనుంచి నోటి పైన కుడిచేతి చూపుడు వేలు నిలువుగా ఉంచి 'నిశ్శబ్దం' అన్నట్టు సైగ చేశాడుస్వామి.

ఫణిని తీసుకుని బయటకి వచ్చేశాడతను.

వీధి గుమ్మం ఇవతల వరండాలో నాగరాజారావ్ సూట్ కేస్ ఉంది.

రెండు మూరల వెడల్పున, జానెడు ఎత్తులో ఉందా సూట్ కేసు.

ఏమి మాట్లాడకుండా గబగబా ఆ సూట్ కేస్‌లోని బట్టల్ని బయట పారేశాడు స్వామి.

ఆ వెంటనే హిప్నటైజ్ అయిన మనిషిలా గేటు బయటకు వచ్చి, పాముని చంపడానికి తెచ్చిన మడత మంచం ఊచలలోంచి ఒక దానిని అందుకుని మళ్ళీ వరండాలోకి వచ్చేశాడు.

ఒక్కో దెబ్బకి ఒక్కో రంధ్రం చొప్పున మడత మంచం ఊచతో సూట్ కేస్ మీద మొత్తం పది రంధ్రాలు పొడిచాడు.

నిక్షేపంలాంటి సూట్ కేస్‌ని పాడు చేస్తున్నందుకు లబోదిబోమంది సుబ్బలక్ష్మి.

తల్లిని వారించాడు నాగరాజారావ్.

వెంటనే అతడు కూడా స్వామి దగ్గరకు వచ్చాడు. అప్పటికి సూట్ కేస్‌ని పాముల పెట్టెగా మార్చేశాడు స్వామి.

సూట్ కేస్‌తోసహా స్వామి లోపలికి అడుగు పెట్టాడు. నాగరాజారావు అతనిని అనుసరించాడు.

ఫణితోసహా వాళ్ళు మొత్తం ముగ్గురు. అడుగులో అడుగు వేసుకుంటూ, ఒకరి తరవాత ఒకరు పడక గదిలోకి వెళ్ళారు.

నాగరాజారావ్, ఫణి బలమంతా ఉపయోగించి ఇటువైపునుంచి మంచం పైకెత్తి అలాగే పట్టుకున్నారు.

గోడకు చేరవేస్తే ఆ శబ్దానికి పాము కదులుతుందేమోనని వాళ్ళ భయం!

అమాంతంగా స్వామి సూట్ కేస్

రెండు మూతల్ని వెనక్కి తెరచి పట్టుకుని, రాతితోసహా పాముపై కప్పేశాడు.

ఆ వెంటనే క్షణం కూడా ఆలస్యం చేయకుండా 'సహేంద్ర తక్షకాయస్వాహా' అన్నట్టు రాతితో సహా పాముని సూట్ కేస్ లోకి లాగేసి ధడాలున మూతలు



వెనుకనించే మూసేశాడు.

ఆ హడావుడిలో పాముతోక పెట్టె బయటే వుండిపోయింది.

సూట్ కేస్‌ని మూయటంతో దాని తోక బాగా నలిగిపోయింది.

పెట్టె లోపల పాము ఎలా గిలాగిలా కొట్టుకొంటూందో తోక కొట్టుకోవటాన్ని బట్టి అర్థం చేసుకున్నాడు స్వామి.

అప్పుడే మళ్ళీ ఫోన్ మోగింది.

నాగారాజారావ్ మంచం వదిలేసి ఫోన్ దగ్గరకు పరుగెత్తాడు. ఒక్కడు మంచాన్ని పైకి ఎత్తి పట్టి ఉంచలేక ఫణి కూడా మంచాన్ని వదిలేశాడు. ధఢాలున శబ్దం చేసింది మంచం.

'శేషగిరి వచ్చేడేమో, అతనే ఫోన్



చేస్తున్నాడేమో' అనుకున్నాడు నాగ రాజారావ్.

కానీ, ఆ ఫోన్ కాళ్ళకూరునించి అని టెలిఫోన్ ఆపరేటర్ చెప్పాడు.



## 8

హైదరాబాద్‌లో శేషశయన్ రాత్రీ పగలు బాబుని మామూలు మనిషిని చేయడానికే కష్టపడుతున్నాడు.

లెక్క ప్రకారం అతనికి గ్లూకోజ్ ఎక్కిస్తున్నాడు.

అపప్పుడప్పుడు కళ్ళు తెరుస్తున్నా బాబుకి స్పృహ రావటంలేదు.

"దిసీజ్ సథింగ్ బట్ స్నేక్ ఫోబియా" తనలో తానే అనుకున్నాడు శేషశయన్.

అలా నిర్ధారించుకున్నాక తాను చేయాల్సిందేమిటో నెమరు వేసుకో సాగాడు.

అతని బుర్రలో వందలాది స్నేక్ ఫోబియా కేసులు మెదిలాయి.

స్టెత్, ట్యూబులూ వగైరాలేమీ బాబుకి కనుపించకూడదు.

ఏ వస్తువూ బాబుకి సర్పభ్రాంతిని కలగచేయకూడదు.

ఆ ఏర్పాట్లు చేశాడు శేషశయన్.

మణి తల్లిదండ్రులను అక్కడే ఉండమన్నాడు.

మళ్ళీ మళ్ళీ టేప్ రికార్డర్ని ఆన్ చేశాడు.

నిమిషాలు గడుస్తున్నాయి.

బాబు తల్లిదండ్రులు ఊపిరి తీసుకోవటం అప్పుడప్పుడు మరిచిపోతున్నారు.

చల్లని ఎ.సి. రూమ్‌లో కూడా శేషశయన్‌కి చెమటలు పట్టేస్తున్నాయి.

అరగంట తర్వాత బాబులో కదలిక కనిపించింది. టక్కున టేప్ స్విచ్‌నొక్కి దానినోరు నొక్కాడు శేషశయన్.

వెంటనే బాబు తల వైపు, అతను కళ్ళు తెరిచినా కనిపించకుండా ఉండేలా సర్దుకున్నాడు.

'ఎందుకీయన ఇలా పక్కకు తప్పుకుంటున్నాడు ?' అనుకుంటూ సుబ్బారావు డాక్టరు వైపు చూశాడు.

సుబ్బారావు ముఖంలో కనిపించిన దైన్యం శేషశయన్ని కుదిపేసింది.

చేతో గది పైకప్పును, స్టాండ్‌కు ఉన్న గ్లూకోజ్ బాటిల్‌ను మిగతా పరిసరాలను చూపిస్తూ "ఇప్పుడు మీ అబ్బాయి ఆసుపత్రిలో ఉన్నట్టు మాట్లాడొద్దు" అని సైగ చేశాడు డాక్టర్ శేషశయన్.

బాబు తండ్రికి అర్థమయింది.

'అమ్మా!'

బాబు స్పష్టంగానే, బాధగా మూల్గి ఒత్తిగిల్లి అటు తిరిగి పడుకున్నాడు.

అప్పటివరకు బాబుకి కుడివక్కగా నిలబడిఉన్న అతని తల్లిదండ్రులు కంగారు కంగారుగా బెడ్ అవతలివైపు వెళ్ళారు.

ఎడమమోచేతి వంపుల్లో ముఖం దాచుకొని పడుకున్నాడు మణి.

బాబు మగతగా ఉన్నాడని శేషశయన్‌కి అర్థమయింది.

క్లిక్ మనిపించి, మళ్ళీ టేప్‌రికార్డర్‌ని

అన్‌చేశాడు.

'బాబూ...! లే! ఏమిటా నిద్ర!? ఎంత సేపూ?...లే! లేచి ముఖం కడుక్కో! స్కూలుకి టైమవట్లా?"

వరుసగా నాలుగుసార్లు సుబ్బారావు గారికంఠం టేపులో బాబుని బతిమాలింది.

వెంటనే తల్లి కంఠం వినిపించ సాగింది.

బాబు కళ్లుతెరిచాడు.

* * *

**శే**షగిరి బొంబాయినుంచి వచ్చి సరాసరి భీమడోలులో ఆఫీసకి వెళ్ళాడు.

విషం స్టాక్ రిజిస్టర్ తీసి ఏ పాముకిషం ఎంతెంత తనవద్ద సిద్ధంగా ఉందో పరి శీలించాడు.

హాప్‌కిక్ ఇన్‌స్టిట్యూట్ వాళ్ళు ఏ రకం పాము విషంఉన్నా తమకి ఇవ్వమని అడి గారు.

అప్పటివరకూ వాళ్లు తాచుపాము విషం గ్రాముకి రెండువందలు ఇచ్చేవారు.

ఇకమీదట గ్రాముకి రెండొందల పాతిక ఇస్తామన్నారు.

క్రేట్ విషం కూడా కావాలి వాళ్ళకి. కానీ శేషగిరి దగ్గిర ఉన్న పాముల్లో క్రేట్‌లు చాలా తక్కువ.

'యూ నీడ్ స్నేక్ ఫార్మ్'లో నాలుగే క్రేట్ పాములున్నాయి.

క్రేట్ విషం గ్రాముకి మూడువందల రూపాయల ధర పలుకుతుంది మామూలుగా.

హాప్‌కిక్ ఇన్‌స్టిట్యూట్ వాళ్ళు మూడు వందల ఏభై ఇస్తామన్నారు.

ప్రస్తుతం శేషగిరి దగ్గర క్రేట్ విషం అరకిలో ఉంది.

కోబ్రావిషం ఇంకా ఎక్కువ ఉంది.

దాదాపు కిలోపైగా కోబ్రా విషం ఉన్నట్టు స్టాక్ రిజిస్టర్‌లో కనుపిస్తోంది.

మిగిలిన రకాల పాముల విషాలను మిశ్రమంచేసి ఏకంగా పంపించేసినా ఫరవాలేదన్నారు హాప్‌కిక్ ఇన్‌స్టిట్యూట్ వాళ్లు.

మిశ్రమ విషానికి గ్రాముకు రెండు వందలు ఇస్తామన్నారు.

వెంటనే స్వామిని పిలిపించాడు.

క్రేట్ విషాన్ని, కోబ్రా విషాన్ని, విషాలమిశ్రమాన్ని విడివిడిగా పేక్ చేయించాడు. మర్నాడు ఆ విషాల పార్సిల్‌ని పోస్ట్‌లో పంపమని చెప్పాడు.

తర్వాత స్వామిద్వారా గూడెంలో జరిగిన సంగతులు తెలుసుకుని వెంటనే గూడెం బయలుదేరి వచ్చేశాడు.

నాగవిహార్ గేటు తీసుకుని లోపలికి అడుగుపెట్టేసరికి నాగలక్ష్మి కనిపించింది గుమ్మంలోనే!

"నువ్వుకూడా వచ్చేశావా? నాన్న గార్ని అక్కడే వదిలేస్తే ఎలా?" పలక రిస్తూనే సమాచారం అడిగాడు శేషగిరి.

కాళ్ళకూరునించి గూడెం ఫోన్‌చేసి శివుడుచేసిన 'వెధవ'పని గురించి చెప్పగానే నాగరాజారావ్ వెంటనే ఆదిశేషను తీసుకుని టాక్సీలో నాగలక్ష్మిని గూడెం వచ్చేయ మని చెప్పాడు.

శివుడిని కాళ్ళకూరులో ఇంటికి కాపలా పెట్టి నాగలక్ష్మి గూడెం వచ్చేసింది. ఆ విషయాలన్నీ చెప్పింది శేషగిరికి.

శివుడిగురించి శేషగిరికి బాగా తెలుసు. ఇదివరకెప్పుడూ వాడు ఇలాంటి తెలివి తక్కువపనిచేయలేదు.

అందుకే ఆశ్చర్యపోయాడు శేషగిరి.

మరో అరగంటలో నాగరాజారావ్ కూడా ఇంటికొచ్చాడు. కారుని గేటు ముందే వదిలేసి లోపలికి వస్తూనే ఆదిశేష

ఉన్న గదిలోకి వెళ్లాడు నాగరాజారావ్.

నాగలక్ష్మి కూడా అతని వెనకాలే తండ్రి దగ్గిరకి వచ్చింది.

"పొలాన్నీ, ఇంటినీ బేరం పెట్టేశాను! ఇక మనం కాళ్ల కూరు వెళ్ళాల్సినపనిలేదు. రేపు సాయంత్రానికి అన్నివ్యవహారాలు సెటిలైపోతాయి. మిమ్మల్ని రేపోసారి భీమవరం తీసుకెడతాను. రిజిస్ట్రేషన్ గొడవలు ఉంటాయికదా!" నాగరాజారావ్ మావగారితో చెప్పాడు.

అరనిముషంతర్వాత అతికష్టంమీద నోటిని స్వాధీనంలోకి తెచ్చుకుని "అ...ళా...గే" అన్నాడు ఆదిశేషు, 'అ' అనే అక్షరాన్ని మింగేసి:

"శేషగిరి వచ్చాడు" నాగలక్ష్మి చెప్పింది నాగరాజారావ్‌కి.

గిరుక్కున వెనక్కితిరిగి ఆ గదిలోంచి బయటికి వచ్చేశాడు.

సుబ్బలక్ష్మి గదిలో ఉన్నాడు శేషగిరి.

లుంగీ కట్టుకునే వచ్చాడు నాగరాజారావ్ ఆ గదిలోకి.

బొంబాయి బిజినెస్ గురించి శేషగిరి చెప్పాడు నాగరాజారావ్‌కి.

భోజనాలు చేస్తుండగా సుబ్బలక్ష్మి ''మన సిద్ధాంతిగార్ని పిలిపించి ఓసారి జాతకం చూపించుకోరా" అంది కొడుకు నుద్దేశించి.

"అత్తయ్య చెప్పింది నిజమే! ఓసారి సిద్ధాంతిగారితో మాట్లాడండి' నాగలక్ష్మి కూడా చెప్పింది భర్త కి.

కింగ్ కోబ్రాని పట్టుకొని స్వామి, ఫణి భూషణ్ భీమడోలు వెళ్ళిపోయాక పాముల మంత్రగాడిచేత ఇసుకని మంత్రింపచేసి ఇంటిచుట్టూ చల్లించింది సుబ్బలక్ష్మి.

ఓ పాముని శివుడు చంపేశాడు.

రెండోపాముని స్వామి పట్టుకెళ్ళాడు.

అవి రెండూ ఆడా మగా అయి ఉంటాయనీ, బహుశా తమఇంటి ఆవరణలో అవి గుడ్లు పెట్టి ఉండవచ్చనీ సుబ్బలక్ష్మి భయం.

ఎప్పుడో హఠాత్తుగా పాముపిల్లలు నాగవిహార్‌లో దర్శనమిస్తాయని ఆవిడకి బాగా నమ్మకంగా ఉంది.

గుమ్మం దాటి బయటికి రావడానికి భయం!

ఏమూల ఏ పాముపిల్ల ఉందో అని సుబ్బలక్ష్మికి బెదురు.

ఆ అనుమానం నాగలక్ష్మికి కూడా పాకింది.

ఏ చిన్నపని చేయాల్సివచ్చినా పాములమ్మే వాళ్ళకి గతి.

సిద్ధాంతిగారిని సలహా అడిగి అవసరమైతే నవగ్రహపూజలు, అభిషేకాలు వగైరాలు చేయించటం మంచిదని సుబ్బలక్ష్మి ఉద్దేశం.

నాగారాజారావ్ 'సరే' అన్నాడు.

మర్నాడు శేషగిరి భీమడోలు వెళ్ళి పోయాడు.

నాగరాజారావ్ సిద్ధాంతిగార్ని ఇంటికి పిలిపించాడు.

ఆదిశేషు జాతకాన్ని, నాగరాజారావు జాతకాన్ని జాగ్రత్తగా పరిశీలించారు సిద్ధాంతిగారు.

కాస్సేపు ఏవేవో గుణించి చివరికి గట్టిగా నిట్టూర్చారు సిద్ధాంతి.

"మొత్తానికి ఇద్దరి గ్రహస్థితీ ఏమాత్రం బాగుండలేదు. వెంటనే మీరు శాంతి చేసుకోవచ్చు. కానీ మీ మావగారి విషయమే ఆలోచించాలి."

సిద్ధాంతిగారి మాటల్లోని అంతరార్థం ఎవరికీ అర్థంకాలేదు.

"వివరంగా చెప్పండి" నాగరాజారావ్

చిరాగ్గా అన్నాడు.

"మీ మామగారి భార్య అంటే మీ అత్తగారు చనిపోయారు గదా! ఇరవైరోజులైంది ఇవ్వాళ్టికి. భార్యచనిపోతే భర్తకి నెలవరకే సూతకంఉంటుంది. పదిరోజులు పోయాక, అంటే ఓ మాసికం పెట్టేసిన తరువాత ఆదిశేషుగారిపేర్న శాంతి జరిపించవచ్చు"

**ఓ క్షణం ఊపిరి తీసుకోవటానికి ఆగారు సిద్ధాంతిగారు.**

"మరి నేను ఆవిడ కర్మ చేశాను గదా! మాకు ఏడాదివరకూ సూతకం ఉంటుందనుకొంటాను. అయినాముందుగా నేను శాంతి చేయించుకోవచ్చునంటారేమిటి?"

నాగారాజారావ్ వివరం అడిగాడు.

"మీరు కర్మ చేశారుకానీ, అదికేవలం ధర్మకర్తృత్వమే! కొడుకులకీ, కోడళ్ళకీ ఏడాది వరకూ సూతకం ఉంటుంది. కూతుళ్ళకీ, అల్లుళ్ళకీ స్నానంతో అంతా పోతుంది. మీకు పిల్లలు, ముఖ్యంగా కొడుకులుఉన్న పక్షంలో మీ పెద్దఅబ్బాయి పేర మీరు కర్మ చేయవలసి వచ్చేది. ఇపుడు అలా జరగలేదుకదా! మీకు అసలు పిల్లలే లేరుకదా!"

సిద్ధాంతి గారు నాగరాజా రావుకి శాస్త్రాన్ని విశమరిచి చెప్పసాగారు.

నాగలక్ష్మి సిగ్గుపడుతూ తలదించుకుంది.

నాగారాజారావుతో ఆమెకు పెళ్లయి పదేళ్లుదాటాయి. పిల్లలు పుట్టలేదు. రెండు మూడేళ్లు ఆ విషయాన్ని ఎవరూ అంతగా పట్టించుకోలేదు.

అప్పుడప్పుడు సుబ్బలక్ష్మి ఈసడింపుగా ఏవైనా అన్నా భవిష్యత్తుమీద నమ్మకంతో ఆవిడా, నాగరాజారావ్ ఊరుకున్నారు.

ఆతర్వాత ఇద్దరూ రకరకాల పరీక్షలు చేయించుకున్నారు.

ఏ డాక్టరూ ఏ విషయమూ సరిగా చెప్పలేదు.

చిన్నా, పెద్ద ఆపరేషన్లు చేయించుకుంది నాగలక్ష్మి. అయినా ఫలితం కనిపించలేదు.

నాగారాజారావ్‌కి ఓఅనుమానం చాలా కాలంనుంచి పీడిస్తోంది.

తనకు పిల్లలు పుట్టకపోవడానికి కారణం బహుశా తనే అయిఉంటాడని!

అతనికి బాగా జ్ఞాపకం.

పెళ్ళికి ఆరునెలల ముందు శేషగిరిని కలుసుకోవటానికి ముదునూరు వెళ్ళాడతను.

అప్పట్లో శేషగిరి ముదునూర్లో ఉండేవాడు.

నాగారాజారావ్ ముదునూరు వెళ్ళేసరికి శేషగిరి పొలం వెళ్ళాడు.

సరాసరి పొలం వెళ్ళి శేషగిరిని కలుసుకొన్నాడు నాగరాజారావ్.

చీకటి పడిపోయింది. వేసవికాలం. పొలాలన్నీ ఎండిపోయిఉన్నాయి.

గడ్డి మేట్లోంచి రెండుమోపుల గడ్డి పీకించి బండిమీదకి ఎత్తించాడు శేషగిరి. శేషగిరి తండ్రికి నాలుగెకరాల పొలం ఉండేది. మరో పన్నెండు ఎకరాలు కౌలుకి తీసుకున్నారాయన. డిగ్రీ పూర్తి చేసినా తండ్రికి సాయపడుతూ వ్యవసాయాన్ని చూసుకోవాలనుకున్నాడు శేషగిరి.

గడ్డిమోపుల మీద కూర్చున్నాడు నాగరాజారావ్ దర్జాగా!

శేషగిరి బండితొట్టిలో కూర్చుని ఎడ్లని అదిలించాడు.

జీతగాడు వెనకాల వస్తున్నాడు.

బండిని గాడి వెంట కాసేపు తోలాడు శేషగిరి.

"ఒరే! ఇలా, ఈ దారమ్మట వెళ్తే ఇంటికెళ్ళడానికి కనీసం అరగంట పడుతుంది. గట్లమ్మట వెళ్ళిపోదాం!" అన్నాడు శేషగిరి.

త్వరగా ఇంటికి చేరతామనే ఉద్దేశంతో 'సరే' అన్నాడు నాగరాజారావ్.

బండిమీద ఎట్లా కూర్చోవాలో తెలియదు నాగరాజారావ్‌కి.

గట్లమీదుగా బండి పోతోంది. మడిమడికీ పెద్ద పెద్ద కుదుపులు వస్తున్నాయి.

ఓ గట్టు మీద నించి ఎడమచక్రం కిందకు ముందుగా దిగింది.

ఆ కుదుపువల్ల నాగరాజారావ్ కుడివైపు చక్రంమీద పడ్డాడు.

వెనువెంటనే చక్రం మీదుగా కిందకు జారిపోయాడు.

ఏం జరిగిందో అర్థం చేసుకునేలోగా అతను నేలమీద బోర్లపడ్డాడు.

అతని నడుం మీద నుంచి బండి కుడి చక్రం వెళ్ళింది.

కింద పడటంతోనే ఊపిరి బిగపట్టాడు నాగరాజారావ్.

అందుకే పెద్దగా బాధ అనిపించలేదు ఆ క్షణంలో. పైగా అప్పటికే ఎడమవైపు బండి బరువంతా ఆనుకొనిఉంది.

బండిమీద నించి నాగరాజారావ్ కింద పడటం గమనించిబండిని ఆపాడు శేషగిరి.

జాగ్రత్తగా నాగరాజారావ్‌ని పైకి లేపాడు.

నాలుగైదుసార్లు నడుం విదుచుకుని మళ్లీ బండి ఎక్కి తొట్టెలో కూర్చున్నాడు నాగరాజారావ్.

నడుంమీద వాత పెట్టినట్టుంది అతనికి.

ఆ తర్వాత డాక్టర్లు ... వైద్యం ... అంతా మామూలుగానే జరిగింది.

ప్రత్యేకంగా అప్పుడేమీ భయపడలేదు నాగరాజారావ్.

కానీ, ఆ తరవాత వేడి చేసినపుడు, బాగా అలిసిపోయినపుడు అతనికి నడుం నొప్పి రాసాగింది.

నొప్పి వచ్చిన ప్రతిసారీ ఏవో మందులు మింగుతాడు.

నొప్పి సర్దుకుంటుంది.

తను అలా బండి కింద పడినపుడే ఏదైనా జరక్కూడనిది జరగటంవల్లనే తనకి పిల్లలు పుట్టలేదేమో అనుకుంటుంటాడు నాగరాజారావ్.

కానీ ఆ విషయం ఏ డాక్టర్లూ నిర్ధారించలేదు.

నాగరాజారావ్‌కి, నాగలక్ష్మికి పిల్లలు పుట్టక పోవడానికి కారణం ఏమిటో తనకు సరిగ్గా తెలియకపోయినా అందుకు సంబంధించి సుబ్బలక్ష్మికి ఓ అనుమానం చాలా కాలం నుంచి పీడిస్తోంది.

ఆ అనుమానాన్ని ఆవిడ సిద్ధాంతి గారి ముందు పెట్టింది.

"మాకు నాగేంద్రుడు ఇలవేల్పు అని మీకు తెలుసుకదా! మా అబ్బాయి తండ్రి కాలేకపోవడానికి, దానికి ఏదైనా సంబంధం ఉందంటారా?"

సుబ్బలక్ష్మి సిద్ధాంతిగార్ని అడిగింది!

"నాకూ అలాగే అనిపిస్తోంది. అయినా ఆ వ్యవహారం గురించి తరవాత ఆలోచిద్దాం! ముందు అబ్బాయి పేర గ్రహశాంతి చేయిద్దాం!"

"అలాగే కానివ్వండి" – నాగలక్ష్మి అంది.

"ఇవాళ తదియ. రేపట్నించి మూడు రోజులపాటు నవగ్రహజపాలు చేయ

స్తాను. షష్టిరోజున మీరంతా ఉపవాసం ఉండండి. అబ్బాయి ఆరోజున పడగ,పూలు గుళ్ళో ఇవ్వాల్సి ఉంటుంది"

సుబ్బలక్ష్మి తలూపింది.

సిద్ధాంతిగారు జపాలకీ, దానాలకీ కావాల్సిన లిస్టు రాసిచ్చాడు.

"ఇక నేను వెళ్తాను! షష్టినాటికి పడగ, పూలు సిద్ధం చేయించండి! తులం వెండితో పడగచేయించండి" అని చెప్పేసి సిద్ధాంతి వెళ్ళిపోయారు.

సిద్ధాంతిగారి ఆధ్వర్యంలో నాగరాజారావ్ పురోహితుడు ఆమూడు రోజుల్లో నవగ్రహ జపాలు పూర్తి చేయించాడు.

షష్టి రోజు సాయంత్రం ఇంటి దగ్గిరే సుబ్రహ్మణ్యేశ్వరుడికి సహస్రనామ పూజ చేయించి నాగరాజారావ్నీ, నాగలక్ష్మినీ వెంటబెట్టుకుని ఆయన సుబ్బారాయుడి గుడికి వెళ్ళాడు.

సుబ్రహ్మణ్యేశ్వరుడికి క్షీరాభిషేకం చేయించి పడగనీ, పూలనీ కానుకగా సమర్పించి గుళ్ళోంచి బయట పడ్డారు.

గుడికి వెళ్ళిన గంటలో కార్లో ఇంటికి తిరిగి వచ్చారు నాగరాజారావ్, నాగలక్ష్మి.

అప్పటికే జరగవలసింది జరిగిపోయింది.

ఆదిశేషు చచ్చిపోయాడు!

ఆయన గదిలోంచి కదల్లేదు.

కదిలే ఓపికా లేదు ఆదిశేషుకి. పక్షవాతం కట్టిపడేసిందాయన్ని.

అయినా ఆదిశేషు చచ్చిపోయాడు.

నాగరాజారావ్ ఇంటికి రాగానే సుబ్బలక్ష్మి, పాములమ్మ గేటులోపల నిలబడి ఉండటం కనిపించిందతనికి. గేటుబయట ఇంకా చాలా మంది ఉన్నారు.

ముందు ఏం జరిగిందో నాగలక్ష్మికి, నాగరాజారావ్‌కు ఏమీ అర్థం కాలేదు.

కొడుకు కారు దిగగానే గేటు లోపలి నించే "మీ మామగారి పక్కలో పాముందిరా నాయనా!" అంటూ కంగారుగా, గగ్గోలుగా అరుస్తూ ఏడవసాగింది సుబ్బలక్ష్మి.

ఓ క్షణంపాటు నాగరాజారావ్‌కి ఏమీ తోచలేదు.

నాగలక్ష్మికి మతిపోయినంతపనైంది. 'మా నాన్న పక్కలో పాముఉండటమేమిటి?' అనుకుని ఆత్రుతగా లోపలికి వెళ్ళబోయింది ఆమె.

అంతలోనే 'పక్కలోనే పాముంది' అనే విషయం గుర్తుకొచ్చి ప్రాణభయంతో ఆగిపోయింది.

నాగరాజారావ్ చొరవగా, మొండి ధైర్యంతో లోపలికి వెళ్ళి ఆదిశేషు ఉన్న గది ముందు నుంచే లోపలికి తొంగి చూశాడు.

ఆదిశేషు నోట్లోంచి బయటికి వచ్చిన నురగలు కనిపించాయి.

ఆదిశేషు నిర్జీవంగా కనిపించాడు.

పక్షవాతంతో మెలితిరిగిన ఆయన కుడి చెయ్యి వెనక్కు తిరిగి తన శరీరాన్ని చూసుకుంటున్న పాము పడగలా కనిపించింది.

ఆయన ఎడమ చెయ్యి నాగరాజారావ్‌కి కనిపించలేదు-అటువైపు నడుం కింద ఉండటంతో!

మంచం మీద పడుకొన్న ఆదిశేషుని ఆపాదమస్తకం పరిశీలించాడు నాగరాజారావ్.

ఆయన కుడి భుజానికి ఆనుకొని చిన్న పెట్టె ఉంది.

స్కూలు పిల్లలు ఉపయోగించే కాంపాస్ బాక్స్‌కి అది మూడు రెట్లుంది.

ఆదిశేషు మోకాళ్ళ కింద నుంచి

ముక్కు పొడుం రంగు గుడ్డపేలికమీద తెల్లని పట్టు దారంతో ఒక దానితో ఒకటి కలుపుతూ నక్షత్రాలు ఎంబ్రాయిడరీ చేసినట్లు రెండు వేళ్ళ వెడల్పున సన్నని పాము సన్నసన్నగా కదుల్తూ కనిపించింది.

నాగరాజారావ్ గుండె జలదరించింది. భార్య అప్పటికే అతని వెనకాలకు వచ్చి నిలబడింది.

భర్త ఎడం భుజం మీద నించి తండ్రి మంచం మీదకు దృష్టి సారించింది నాగలక్ష్మి.

భార్య గడ్డం తన భుజానికి తగలడంతో ఉలిక్కిపడ్డాడు నాగరాజారావ్.

"ఇంక ఇప్పుడు మనమేమీ చేయలేం! మావయ్య చచ్చిపోయినట్లే"

కుడిచేత్తో భార్య భుజం మీద వెనుకనుంచే చెయ్యివేసి. ధైర్యం చెబుతున్నట్లు తడుతూ అన్నాడు నాగరాజారావ్.

నాగలక్ష్మి .ఘొల్లుమంట.

వెనక్కి తిరిగి అనునయిస్తూ భార్య



ఎడం భుజం మీద కుడి చెయ్యి వేసి ఆమెను బయటకు తీసుకువచ్చాడు నాగరాజారావ్.

సుబ్బలక్ష్మి కోడలిని పొదువుకొని ఊరడించసాగింది.

హఠాత్తుగా ఏదో స్ఫురించి నాగరాజారావ్ పడకగదిలోకి వెళ్ళి శేషగిరికి ఫోన్ చేశాడు.

లైన్ క్లియరుగానే ఉంది.

"మావగారు పోయారు... పాము కాటు వల్ల!"

ఇంకేమీ చెప్పలేదతను.

"వెంటనే వస్తున్నాను"

శేషగిరి జవాబు విని భారంగా ఫోన్ పెట్టేశాడు.

ఆదిశేషు చనిపోయాడన్న వార్త క్షణాల్లో ఊరంతా పాకిపోయింది.

మాజీ మంత్రి, అందులోనూ నాగరాజారావ్ మావగారు చనిపోయాడనేసరికి గూడెంలోని ప్రముఖులంతా ఆ ఇంటి మీద వాలిపోయారు-పరామర్శించడానికి!

నాగరాజారావ్ ఆ హడావుడిలో ఉండగా శివుడు వచ్చాడు.

శివుడి రాక నాగరాజారావ్‌కి నచ్చలేదు.

అతనిని చూసీచూడగానే ముఖం చిట్లించుకున్నాడు.

కాళ్ళకూరులో ఇల్లు, పొలం అమ్మేసిన మరుక్షణం నుంచీ శివుడిని బయటికి గెంటేసినట్లే లెక్క!

ఆ మాట స్పష్టంగానే చెప్పాడు నాగరాజారావ్.

"ఇక మీదట మాకూ, నీకూ ఏ సంబంధమూ లేదు. నువ్వు బుద్ధిమంతుడవనుకొన్నాంగానీ ఇలాంటి తుచ్ఛుడివనుకోలేదు. ఇదిగో ... ఈ వెయ్యి రూపాయలు తీసుకొని నీ ఇష్టం వచ్చిన చోటికి పో! ఇక మీదట నీ ముఖం ఎప్పుడూ నాకు చూపించకు"

ఆ రోజున తాను శివుడితో చెప్పిన మాటలు గుర్తుకువచ్చాయి నాగరాజారావ్‌కి.

'మళ్ళీ వాడు ఇక్కడికి రావడానికి ఎంత ధైర్యం'-ముఖం చిట్లించుకొంటూ తనలోతానే అనుకొన్నాడు నాగరాజారావ్.

బయట చేరినవాళ్ళ మాటల్ని బట్టి ఆదిశేషు చచ్చిపోయాడని అర్థం చేసుకున్నాడు శివుడు.

ఎవర్నీ పలకరించకుండానే సరాసరి లోపలికి వచ్చాడతను.

వరండా దాటి గుమ్మంలో అడుగు పెట్టి, లోపల అన్ని గదులు పరకాయించాడు.

వరండాని ఆనుకొని ఉన్న మొదటి గదిలోనే మంచం మీద ఆదిశేషు నిర్జీవంగా కనిపించాడు.

"అయ్యగారూ!"

బిగ్గరగా కేకవేసి శివుడు ఆ గదిలో జొరపడ్డాడు.

'లోపల మంచంమీద పాము ఉంది' అని అరుద్దామనుకున్నాడు నాగరాజారావ్.

అప్పటికే వాడు ఆదిశేషు మంచం దగ్గరికి చేరాడు.

శివుడి కళ్ళవెంట ధారాపాతంగా కన్నీళ్లు కారుతున్నాయి.

ఆమాత్రం అనుబంధం ఉంది వాడికి ఆదిశేషుతో!

నిర్జీవంగాఉన్న ఆదిశేషు చల్లని కుడి చెయ్యిపట్టుకుని భోరున ఏడ్చాడు శివుడు.

కుడిచేతి గుత్తితో కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ తల పైకెత్తిన శివుడికి-ఆదిశేషు

ఎడమచేతి అంచున పాకుతూ కదులుతున్న ముక్కుపొడుం రంగు శరీరం పొడవునా తెల్ల నక్షత్రాల డిజైనున్న పాము కనిపించింది.

అసంకల్పితంగా శివుడికి ఓ ఆలోచన వచ్చింది.

ఉన్నపాటున రెండుచేతుల్తో ఆదిశేషు శవంతోసహా మంచాన్ని పైకెత్తేశాడు.

శవం బరువు ఒరిపిడికి పాము కొంచెం పక్కకి జరిగింది.

మంచాన్ని పదేపదే ఊపాడు ... ఆదిశేషు శవం కిందపడకుండా!

దబ్బున కిందపడిందా పాము.

పడీ పడ్డంతో గిలగిలా, గిరగిరా తిరిగిపోతోంవది—ఉన్న చోటులోనే!

మంచాన్ని కిందకు దింపేసి, గది గుమ్మందగ్గిరకి వచ్చేసి, మంచం కింద నుంచి పాముని గమనించసాగాడు శివుడు.

'శివుడు లోపల ఏంచేస్తున్నాడో' అనే అనుమానంతోనాగరాజారావ్, నాగలక్ష్మి, సుబ్బలక్ష్మి, పాములమ్మ, ఊళ్ళోని ఒక రిద్దరు పెద్దలు వరండాగుమ్మం దగ్గర్నించి లోపలికి తొంగిచూస్తున్నారు.

కొంచెం స్థిమితపడ్డాక పాము మంచం కిందనుంచి గుమ్మంవైపు రాసాగింది నాజూగ్గా పాక్కుంటూ.

అప్పుడు దాన్ని పూర్తిగా గమనించాడు శివుడు.

"పిల్ల"

ఒగ్గరగానే, హేళనగా అన్నాడు శివుడు.

దాని అంచులు తెల్లదారంతో అల్లిన లేసు డిజైనులా కనిపించాయి.

అంతాకలిసి నాలుగు జానలు కూడా ఉండవది.

ముదురు ముక్కుపొడుం రంగులో జీడిపిక్కలా ఉంది దాని తల.

తోక మరీ సన్నగాకాకుండా కొంచెం మొద్దుగా ఉంది.

ఆదిశేషు శవండున్న గది గుమ్మంనించి వరండా గుమ్మంవరకూ వెనక్కి వచ్చేశాడు శివుడు.

అతని వెనకాల నాగరాజారావ్, మిగిలిన వాళ్లున్నారు.

ఆ పాము గదిలోంచి తల బయటపెట్టే సరికి "వెనక్కురండి... వెనక్కిరండి" అంటూ శివుడి వెనకాల ఉన్నవాళ్ళంతా వరండామెట్లు దిగిపోయారు.

నాగరాజారావ్, నాగలక్ష్మి మెట్లమీద నిలబడ్డారు.

పాము వరండా వైపు వచ్చేస్తోందను కున్నారు వాళ్ళంతా!

కానీ, అది ఆదిశేషు గదిపక్కన ఉన్న సుబ్బలక్ష్మి గది వైపు కొంచెందూరం పాకి తర్వాత ఆ హాలులోంచి వంటగది వైపు తిరిగింది.

ఈ పక్కనించి హాలులోంచి నాలుగు అంగల్లో శివుడు వంటగది గుమ్మందగ్గరికి చేరాడు.

వంటగది పక్కనే నాగరాజారావ్ పడకగది.

ఆదిశేషు చనిపోయిన బాధకంటె, ఆ పాము పీడ వదిలించుకోవాలనే ఆతృత అక్కడ అందరి ముఖంలోనూ స్పష్టంగా కనిపిస్తోంది.

వంటగదివెపుగాకాక పాము నాగరాజారావ్ పర్సనల్ గదివైపు పాకసాగింది.

ఆదిశేషు శవం ఉన్న గదికి అభిముఖంగా హాలును ఆనుకొని ఉందా గది.

శివుడి ఎదురుగా అడ్డంగా, గాలికి రెపరెపలాడే రిబ్బనులా కదిలిపోతోందాపాము.

రెండంగలు ముందుకువేసి, మెరుపులా

వంగి, అప్పటికే బిగించిన పిడికిలిని వెనక్కి తిప్పి ముడుసుతో పాము తలకి బెత్తెడు దూరంలో వంపుమీద పిడుగులా మొత్తాడు శివుడు.

ఆ దెబ్బకి నోరు తెరిచిందా పాము.

రెండోవైపు బరువులేని బేలన్స్ బల్లలా తోకనుంచి శరీరాన్ని పైకెత్తింది.

శివుడి మోచేయి దానికి అడ్డంపచ్చింది.

లతలా వాడి చేతిని పెనవేసుకుందది.

ముడుసుతో దాని తలదగ్గిర మరీనొక్కి పట్టిపాముని గిజగిజలాడిస్తున్నాడు శివుడు. వాడి మోచెయ్యి రబ్బరుబేండ్ బిగించినట్లు బిగుసుకుపోయింది.

శివుడి దండమీద కండ పొంగింది — గుడ్డు మింగిం తర్వాత ఆ పాము కంఠం దగ్గర కనబడే పొంగులా!

చేతి నరాలు పొంగి పాముపిల్లల్లా కనిపిస్తున్నాయి.

తెరుచుకున్న పాము పైనోరు శివుడి ముడుసుపైనున్న వేళ్ళని వెనకనుంచి తాకుతోంది.

నాగరాజారావ్, నాగలక్ష్మితో సహా అందరూ రెప్పలార్పటం మానేసి శివుడి కుడిచేతినీ, ఆ చేతి ముడుసుకింద నలుగుతున్న పాముపిల్లనీ చూస్తున్నారు.

వాడి కళ్ళలో కనిపిస్తున్నది క్రౌర్యమో, తెగింపో ఎవరికీ అర్థంగావట్లేదు.

పాములో చలనం ఆగిపోయింది.

వదులైన తాడులా పాము వాడి మోచేతి మీదనుంచి మెలికలు మెలికలుగా జారిపోయింది.

శివుడు నొక్కిపట్టిన చోట పాము శరీరం చిట్లిపోయింది.

మెల్లిగా మోచేతిని పాము కంఠంమీద నుంచి పైకితీశాడు-రెండోచేతిని నేలమీద ఆసరాగా చేసుకొని!

ముడుసులకి అంటిన పాము రక్త మాంసాలను లాగుకి తుడిచేసుకున్నాడు. వాడి ముడుసులమీది చర్మం గచ్చు ఒరిపిడికి నలిగి రక్తం చమరుస్తోంది.

అప్పుడే శేషగిరి, ఫణి వచ్చారక్కడికి.

నాగరాజారావ్‌ని తప్పించుకుని ఓ అడుగు ముందుకువెళ్ళాడు ఫణి.

హాలులో నిర్జీవంగా పడిఉన్న పాముని చూశాడు.

కసి తీర్చుకున్నట్టున్న చూపులతో పాముని చూస్తున్న శివుడి దృష్టిలోపడ్డాడు ఫణి.

"ఒరే...శివుడూ! దాన్ని చంపకుండా ఉండాల్సిందిరా! ఎలాగో ఒకలా ఈ పాముని పట్టుకొనిఉంటే బావుండేది"

నాగరాజారావ్‌కి, నాగలక్ష్మికి ఆ సమయంలో ఫణిమీద చాలా కోపం వచ్చింది.

ఫణి ఆ విషయం గమనించలేదు.

"ఇది ఏమిటనుకున్నావ్! విపేరా బేరస్! ఐర్లండ్‌లో తప్ప ఐరోపా అంతటా ఇలాంటి పాములు ఎక్కడ పడితే అక్కడ కనిపిస్తాయి. చైనాలో కూడా ఇవి ఎక్కువగానే ఉంటాయి కానీ మనదేశంలో ఉండవు. ఇలాంటి పాము ఇక్కడ కనిపించటం ఎంత విచిత్రం. అందుకే దీన్ని చంపకుండా ఉంటే బావుండునన్నాను నేను"

శేషగిరి ఆశ్చర్యపోయాడు.

నాగరాజారావ్‌కి నోటమాటే రాలేదు.

నాగలక్ష్మి అయోమయంలో పడిపోయింది.

ఎక్కడెక్కడి పాములో తామున్న చోట కనిపించడం ఏమిటి?

తల్లి చనిపోయిన తర్వాత, శేషగిరి పెట్టెలో తెచ్చిన పాము కాక మరో

పాముని శివుడు కొళ్ళకూరులో తమఇంటి మెట్లమీద పట్టుకున్నాడు.

అలాంటివి ఆఫ్రికాలో ఎక్కువగా ఉంటాయని ఫణి చెప్పాడు.

ఇపుడు మళ్ళీ ఐరోపాలోనూ, చైనా లోనూ ఉండే పాము తమ ఇంట్లోకి వచ్చింది.

ఇదెలా సాధ్యం?

తండ్రి మరణాన్ని తాత్కాలికంగా మరచిపోయి ఇవన్నీ ఆలోచించసాగింది నాగలక్ష్మి.

"ఇది విపేరా బేరస్ పిల్ల! ఇంకొంచెం పెరిగినదైతే పొరపాటున అది నిన్ను కాటువేసే ఉంటే ఏమైపోయేవాడివి నువ్వు? ఈ పిల్ల ఒకసారి కాటేసినపుడు బయటపడే విషంతో నీలాంటివాళ్లని సునాయాసంగా ఆరుగుర్ని చంపొచ్చు! బ్రిటన్‌లో ఈమధ్యే ఓ కోటీశ్వరుడి కొడుకు ఇలాంటిపాము కాటు వేయడం వల్లే చచ్చిపోయాడు తెలుసా?"

ఫణి పాముల పరిజ్ఞానాన్ని ఏకరువు పెట్టసాగాడు.

శివుడు నాగలక్ష్మిని ఓసారి చూసి తలవంచుకుని ఆదిశేషు శవం ఉన్న గదిలోకి వెళ్ళాడు.

తండ్రిని చంపిన పాము చచ్చిపోయిందని గుర్తుకొచ్చాక నాగలక్ష్మి కూడా తండ్రిశవం ఉన్న గదిలోకి పరుగెత్తి, శవంమీద పడి ఘొల్లున ఏడవసాగింది.

సుబ్బలక్ష్మి కోడలిని సముదాయించడానికి లోపలికి వెళ్లింది.

రాజకీయంగా ఆదిశేషు మరణం చిన్నపాటి సంచలన వార్త అయింది.

భార్య చనిపోయిన ఇరవైమూడు రోజులకే ఆదిశేషు చనిపోయాడు. ఇద్దరూ పాము కాటువల్లే మరణించారనే అంశాన్ని విశేషంగా పేర్కొంటూ మర్నాడు పేపర్లలో వార్తలు వచ్చాయి.

సర్వలాంఛనాలతో ఆదిశేషు అంత్యక్రియలు పూర్తిచేశాడు నాగరాజారావ్.

అదేరోజున నాగవిహార్‌లో పాములు విచ్చలవిడిగా తిరుగుతున్నాయని గూడెం ప్రజలు కథలు కథలుగా చెప్పుకోవటం ప్రారంభించారు.

ఆ కథలతోపాటే, నాగరాజారావ్ ఆస్తి కోసం ఏదో ప్లాను వేసి ముందు అత్తగార్ని, ఆ తర్వాత మావగార్ని చంపించి ఉంటాడని కూడా కొందరు గుసగుసలాడుకున్నారు.

ఆ గుసగుసలే పత్రికలవాళ్ళకి 'స్కూప్' అయ్యాయి.

'...అని తెలుస్తోంది' అంటూ కొన్ని పత్రికలు వార్తలు ప్రచురించాయి కూడా.

నాగరాజారావ్‌కి తల కొట్టేసినట్లయింది!

"ఇది దారుణం! నాకేపాపమూ తెలియదు"-గట్టిగా అరిచేశాడు నాగరాజారావ్. నాగవిహార్‌లో చేరిన బంధువులంతా విస్తుపోయారు!



మణి కళ్లు తెరిచి మొదటిసారిగా తల్లిని

చూశాడు.

తల్లిని గుర్తుపట్టాడు బాబు.

నీర్సంగా, బలవంతంగా 'ఆక లేస్తోందే అమ్మా' అన్నాడు మణి.

తల్లి ఏమీ మాట్లాడలేకపోయింది.

కొడుకుకు ఆకలి తీర్చలేని నిస్సహాయత ఆమెను ఆవరించింది.

మళ్ళీ మామూలుగా తనని "అమ్మా" అని పిలిచినందుకు ఆవిడ సంతోషంతో ఉక్కిరిబిక్కిరయింది.

"ఆకలేస్తోందా బాబూ! ఇదిగో ఇపుడే అన్నం తిందువుగానీ..."

అంతకుమించి ఆమె మరేమీ మాట్లాడలేకపోయింది.

సుబ్బారావు బాబు పక్కనే మంచం మీద కూర్చున్నాడు.

కొడుకు వీపు మీద చెయ్యి వేసి ధైర్యం చెబుతున్నట్లు చేత్తో రాస్తూ మూగగా, ఆనందంతో ఉక్కిరిబిక్కిరవుతున్నాడు.

తల్లీ, తండ్రీ ఎందుకలా విచిత్రంగా ప్రవర్తిస్తున్నారో మణికి అర్థంకాలేదు.

"స్కూలుకు టైమవుతోంది. లే...లే" అని తల్లి నిద్రలేపుతోంటే మెలకువ వచ్చిందనుకుంటున్నాడు మణి.

కాళ్ళకూరులో...అతను పామున్న పెట్టె తెరిచినట్లు, ఆ పాముని చూసి తాను స్పృహ తప్పినట్లు, ఇన్నాళ్ళుగా ఆసుపత్రిలో ఉన్నట్టు మణికి తెలియదు.

లేచి కూర్చోబోయాడు.

శరీరం అతని స్వాధీనంలో లేదు.

సుబ్బారావ్, అతని భార్య జాగ్రత్తగా మణిని లేవదీసి కూర్చోబెట్టారు.

కొడుకు తలని ఒళ్లో ఉంచుకొంది మణి తల్లి.

సుబ్బారావు వెనకాల మణి కాళ్లు ఉన్నాయి.

మణిని తీవ్రంగా గమనిస్తూ అతని తలవైపున మంచం వెనుక నిలబడి ఉన్న శేషశయన్ తృప్తిగా ఊపిరి తీసుకున్నాడు.

'మొత్తానికి స్పృహ వచ్చింది' అనుకున్నాడు.

అడుగులో అడుగు వేసుకుంటూ మణి వెనకగా బయటికి జారుకున్నాడు శేషశయన్.

ఆ గదిలోంచి బయటికి వచ్చాక నర్సు చేత వేడివేడి పాలు పంపించాడు- మణికోసం.

తరువాత నాగరాజారావ్‌కి ఫోన్ చేశాడు.

"మణి గురించి కంగారుపడాల్సిన పని లేదు. మరో పదిరోజులకల్లా అతనికి స్నేక్ ఫోబియాని క్యూర్‌చేసి డిశ్చార్జ్ చేసేస్తాను"

డాక్టర్ శేషశయన్ చెప్పిన విషయం విని నాగరాజారావ్ 'నేను చేయని తప్పుకి నాకు శిక్షపడలేదు' అన్నట్టు ధీమాగా నిట్టూర్చాడు.

వెంటనే ఆ సంగతి భార్యకు, తల్లికి చెప్పాడు.

"పోన్లే పాపం! ఆ కుర్రాడికి ఏమైనా అయితే మన పీకలకి చుట్టుకునేది నెపమంతా"

సుబ్బలక్ష్మి మనసు తేలికపడింది.

తమ గౌరవం కాపాడినందుకు డాక్టర్ శేషశయన్‌కు మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకుంది నాగలక్ష్మి.

నాగవిహార్‌లో అందరి మనస్సులూ వికలమయి ఉన్నాయి. ఆదిశేష చనిపోయి అప్పటికి నెల్లాళ్ళయింది.

అత్తగార్ని, మావగార్ని తానే ఏదో

చేసి హత్యచేశానని పదిమంది అనుకోవటం నాగరాజారావ్‌కి చాలా ఇబ్బందిగా ఉంది.

'పాముకాటువల్ల ఇద్దరూ చనిపోయారు. అందులో నా ప్రమేయం ఏముంది...' నాగరాజారావ్ తీవ్రంగా మథనపడసాగాడు.

అసంకల్పితంగా అతని ఆలోచన ఫణి మీదకు మళ్ళింది. అప్పటివరకు తనపై అనవసరంగా నిందపడిందని మాత్రమే బాధపడ్డాడు నాగరాజారావ్.

'ఫణికి పాములగురించి బాగా తెలుసు! ఏ పాముకి ఎంతెంత విషం ఉంటుందో, ఏ పాము అలవాట్లు ఎలా ఉంటాయో అతనికి కొట్టినపిండి! కొంప దీసి ఫణి నాటకం ఆడటంలేదుకదా!'

నాగరాజారావ్‌లో చాలా ఆలస్యంగా అనుమాన బీజంవేసింది.

వెంటనే కారు బయటికితీసి భీమడోలు ప్రయాణం అయ్యాడు.

ఎందుకు బయలుదేరాడో అతనికే తెలీదు.

అరగంటలో నాగరాజారావ్ శేషగిరి 'యునీడ్ స్నేక్ ఫార్మ్'లో ఉన్నాడు.

ఫణి అప్పుడే స్వామిని వెంటబెట్టుకుని ఆఫీస్‌రూంలోంచి బయటికి వచ్చాడు.

"ఓ...మీరా! ఏమిటిలా వచ్చారు? ఆశ్చర్యంగా ఉందే!" ఫణి పలకరింపుగా అన్నాడు.

నాగరాజారావ్ ఆ ఫార్మ్‌లో అడుగు పెట్టడం అది రెండోసారి. స్నేక్‌ఫార్మ్ ప్రారంభోత్సవం రోజున మొదటిసారి వచ్చాడు. తరువాత మరెప్పుడూ అక్కడికి రాలేదు.

ఎప్పటికప్పుడు ఫార్మ్‌లో జరుగుతున్న మార్పుల గురించి శేషగిరి అతనికి చెబుతూనే ఉన్నాడు. అందువల్ల నాగరాజారావ్‌కి ప్రత్యేకంగా అక్కడికి రావాల్సిన అవసరం లేకపోయింది. పైగా అతనికి ఆ ఫార్మ్‌తో సంబంధం ఏమాత్రంలేదు. తనకి ఉన్న వ్యాపారాలు, షుగర్‌ఫ్యాక్టరీ, వ్యవసాయం, ఇతర లావాదేవీలు చూసుకోవటానికే టైమ్ చాలదు.

ఫణి తననిచూసి భయపడ్డాడు అనుకున్నాడు నాగరాజారావ్.

ఫణి అతన్నికూడా తీసుకుని ఫార్మ్‌లోకి బయలుదేరాడు–స్వామితోసహా!

దోవలో కనిపించే పాములగురించి వివరాలు ఏకరువు పెట్టసాగాడు ఫణి.

"ఇదిగో! దీన్ని చూడండి. అచ్చు తాచుపాములా ఉంటుంది. కానీ దీన్ని ఈజిప్షియన్ కోబ్రా అంటారు. ఈజిప్ట్‌లో ఈ పాము గురించి మనదేశంలో నాగుపాముకు సంబంధించి ఎన్నిరకాల కథలూ, నమ్మకాలూ ప్రచారంలో ఉన్నాయో అంతకంటే ఎక్కువ కథలు, నమ్మకాలే ప్రచారంలో ఉన్నాయి. క్లియోపాత్రాని చంపింది ఈ జాతి పామే! పడగ విప్పలేదుకానీ తలనే పడగలా పైకెత్తుతుందిది"

స్వామి మాత్రం ఫణి మాటలు వినటం లేదు. ప్రతి పిట్ దగ్గర అందులో ఉన్న పాముకి సరిపోయే తిండి ఉందోలేదో చూస్తున్నాడు.

ఫణిని అనుసరించి వెళ్తున్నాడు నాగరాజారావ్.

"ఇక్కడినించి ఓ ఫర్లాంగువరకూ అన్నీ తాచుపాములే కనిపిస్తాయి. వీటిలో చాలావరకు నల్లజర్ర సుబ్బిగాడు పట్టి తెచ్చిఅమ్మినవే. ఈ ఫార్మ్‌కి ఎక్కువ ఆదాయం తెచ్చిపెట్టేవి ఇవే"

ఫణి చెప్పుకుపోతున్నాడు.

"ఇదిగో! ఈ పక్కనఉన్న ఎనిమిది పాములనీ మహాబలేశ్వర్ షీల్డ్‌టెల్స్

అంటారు. మన దేశం పశ్చిమప్రాంతంలో ఎక్కువగా ఇవి ఉంటాయి. కానీ మహా బలేశ్వరంలో ఎక్కడపడితే అక్కడ ఇవి ఉంటాయి. మన కుక్క తోకలా వీటి తోక ఎప్పుడూ 45 డిగ్రీలు వంగి ఉంటుంది.''

నాగరాజారావ్‌కి తెలియకుండానే అతనిలో ఆసక్తి పెరిగిపోయింది. శ్రద్ధగా ఫణి చెబుతున్న విషయాలు వినసాగాడు.

"ఈ శాండ్‌బోవా లని చూడండి! వీటి పొలుసులు కీచైన్ మాదిరిగా ఉంటాయి. ఇవి మీటరుకంటె పొడవు పెరగవు"

స్వామి కొన్ని పిట్‌ల దగ్గర సుద్దతో ఇంటూ గుర్తులు పెడుతున్నాడు.

అలా ఎందుకు చేస్తున్నాడో అడుగుదామనుకున్నాడు నాగరాజారావ్.

అంతలో ఫణి అందుకున్నాడు-

"అలా ఇంటూ గుర్తులు పెట్టిన పిట్‌లలోని పాములనించి రేపు విషం కక్కిం



చాలి"

నాగరాజారావ్‌కి ఒళ్లు జలదరించింది. అయినా కుతూహలం చంపుకోలేకపోయాడతను.

"ఇవాళ విషం కక్కించే పాములేమైనా ఉన్నాయా?"

స్వామి సమాధానం చెప్పాడు నాగరాజారావ్‌కి–

"ఆఁ...ఉన్నాయండీ! సాయంత్రం అయిదుగంటలకి ... మీరు వస్తానంటే చూపిస్తాను"

ఫణి ముందుకు సాగాడు.

ఓచోట హఠాత్తుగా ఆగిపోయాడు ఫణి.

అతను చూస్తున్నవైపే తనూ దృష్టి సారించాడు నాగరాజారావ్.

స్వామికూడా సంతృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు అటేచూసి!

దసీ పెల్టిస్ స్కార్బా, నజాస్రిగీ కొల్లీస్ ఉన్న పంజరంవైపే చూస్తున్నాడు ఫణి.

వాటిలో ఒకటి మగా, ఒకటి ఆడా!

చూడగానే ఏది ఏదో చెప్పటం కష్టం!

ఆ రెండింటినీ ఒకే పంజరంలో ఉంచి అప్పటికి రెండు నెలలు పైగా అయింది.

ఆ రెంటివల్ల పుట్టే పాములకి విషం ఎక్కువ ఉండే అవకాశం ఉందని ఫణి నమ్మకం.

అప్పటివరకూ ఫణి అలాంటి ప్రయోగాలు చాలా చేశాడు.

అలా పుట్టిన కొత్త పాముల విషాన్ని మిశ్రమ విషంలో కలిపేస్తున్నాడు శేషగిరి.

కొత్త పాములు వెలువరించే విషం పరిమాణంలో ఎక్కువ ఉంటుంది.

అందుకే ఫణిని ప్రోత్సహిస్తున్నాడు శేషగిరి.

కనుచూపుమేరలో ఆగిపోయారు ఆ ముగ్గురూ.

కొల్లీస్‌ని నోటితో ముద్దులు పెట్టుకుంటున్నట్లు స్కార్బా తలతో కొల్లీస్ శరీరంమీద గోముగా రాస్తోంది.

కొల్లీస్ సిగ్గుపడుతున్నట్లు మెలికలు తిరిగిపోతోంది.

మెల్లిమెల్లిగా రెండూ పక్కపక్కనే చేరాయి. స్కార్బా తన తలని కొల్లీస్ తలపై పెట్టి మిగిలిన శరీరాన్ని దాని శరీరంతో పెనవేస్తోంది.

రెండు పాయల జడలా కనిపిస్తున్నాయి ఆ రెండు పాములూ!

"స్కార్బా ఆడపాము. కొల్లీస్ మగది."

ఫణి చెప్పాడు.

అవునో, కాదో నాగరాజారావ్‌కి తెలియదు. అవుననే అనుకున్నాడతను.

అవి రెండూ ఒంపులు తిరిగిన మర్రి ఊడల్లా 'స్టిఫ్'గా పెనవేసుకుపోయాయి.

అంతలోనే ఆ రెండు పాములకంఠాల అడుగుభాగాలు అతుక్కుపోయినట్టు దగ్గరయ్యాయి.

స్కార్బాకింద పెదవి కొల్లీస్ కింద పెదవిని తాకుతోంది. రెండూ నాలుకలు చాస్తున్నాయి. అప్పుడప్పుడు ఆ చీలిన నాలుకలు కలుసుకుంటున్నాయి.

"ఈ సమయంలో వాటి అంగాలు కలుసుకుంటాయి. పాములకి అంగాలు తోకవైపు ఉంటాయి. నరాల వత్తిడివల్ల, రక్త ప్రసరణలో వచ్చే మార్పులవల్ల వాటి అంగాలు కలుసుకుంటాయి"

ఫణి చెప్పాడు గుసగుసలాడుతున్నట్లు.

అలాంటి దృశ్యాన్ని నాగరాజారావ్ అప్పటివరకు ఎప్పుడూ చూడలేదు.

కళ్ళు ఆర్పకుండా దెయ్యంపట్టిన వాడిలా నిలువుగుడ్లతో చూస్తున్నాడతను.

"ఇంకో గంటవరకు అవి అలాగే ఉంటాయి. అమెరికాలో బేటిల్ స్నేక్స్ ఉంటాయి. అవి మరీదారుణం. వాటి సంయోగం కొన్ని గంటలపాటు ఉంటుంది. ఓ బేటిల్‌స్నేక్ జంట 27 గంటలు సంయోగం జరిపినట్లు ఓ జూలో అధికారులు రికార్డు చేశారు"

"అయ్ బాబోయ్"

నాగరాజారావ్ అదిరిపోతూ అన్నాడు.

"ఇంకాసేపు ఆగితే ఇంకా భయంకరంగా ఉంటుంది దృశ్యం! ఇవి ఒకదాన్నొకటి పొడుచుకుంటాయి. రెండో దాన్ని కదలనీయకూడదని రెండు పాములూ ప్రయత్నిస్తాయి. మొత్తంమీద నా కృషి ఫలిస్తోంది" ఫణి సంతోషంగా చెప్పాడు.

"నడవండి పోదాం!"

ఫణే మళ్ళీ అన్నాడు.

ముగ్గురూ అక్కణ్ణుంచి కదిలారు.

"ఇంకా ఇక్కడ చాలారకాల పాములున్నాయి. రక్త పింజరలూ, రాక్సెల్స్, వైపర్స్, కోరల్ స్నేక్స్, రేట్ స్నేక్స్, బోయిగా స్నేక్స్, ఫ్లయింగ్ స్నేక్స్, డాగ్ ఫేస్డ్ స్నేక్స్, రాయల్ స్నేక్స్... ఇలా ఎన్నో ఉన్నాయి. బురదపాములూ వగైరాలు ఉన్నాయి. అవి కేవలం కింగ్ కోబ్రాలకు ఆహారం కోసం పెంచుతున్నాం"

"నాకు చాలా భయంగా ఉంది! వెనక్కు వెళ్ళిపోతాను"

నాగరాజారావ్ కంగారుగా చెప్పాడు.

"ఉండండి! పాములనించి విషం ఎలా తీస్తారో చూస్తానన్నారుగా"

స్వామి అన్నాడు.

"నడు. అక్కడికేపోదాం. మిగతా విషయాలు అక్కడే చూసుకోవచ్చు"

ఫణి చెప్పాడు స్వామితో.

ముగ్గురూ స్నేక్ ఫార్మ్‌లో ఉన్న స్వామి గదికి వెళ్ళారు!

పాముకు విషంతీసే కార్యక్రమం అక్కడ జరుగుతుంది ఎప్పుడూ!

ఆ రోజున విషంతీయాల్సిన పాములు బుట్టల్లో ఆ గదిలోనే సిద్ధంగా ఉన్నాయి.

ఏ పాము పేరు ఏమిటో స్వామికి తెలియదు.

పనిచేయటంవరకే అతని ధ్యాస.

తెల్లని గుడ్డని ఓ గాజు గ్లాసు మూతికి బిగుతుగా కట్టాడు స్వామి.

మోచేతివరకు తోలుతో చేసిన గ్లోవ్స్ ఉన్నాయతనికి.

ఓ బుట్టపై మూతతీశాడు.

"బుస్..." అంటూ ఓ పాము తల పైకెత్తింది.

దానికి పడగలేదు.

ఒడుపుగా దాని కంఠంకింద కుడిచేత్తో పట్టుకున్నాడు స్వామి.

అలాగే దాన్ని పైకిలేపాడు.

పురెక్కిన తాడులా ఆ పాము మెలికలు తిరుగుతోంది.

స్వామి చేతిలో ఉన్న పాము ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో దిక్కుతోచక తలని అటు ఇటు బెదురు బెదురుగా తిప్పుతోంది.

ఎడమచేత్తో గ్లాసుని పట్టుకుని, కుడిచేతిలోని పాము తలని పదే పదే గ్లాసుకు కట్టి ఉన్న గుడ్డకి తాకిస్తున్నాడు.

తప్పనిసరిగా ఆ తెల్లవస్త్రమ్మీద కాటు వేయాల్సిన పరిస్థితి దానిది.

పదేపదే పాము అలాగే చేసింది.

గుడ్డమీదనించి గ్లాసులోనికి బొట్లు

బొట్లుగా కారుతున్న విషం లేతపసుపు రంగులో ఉంది.

ఇంకా చెప్పాలంటే, పువ్వులమీది పుప్పొడి ద్రవంలా ఉంది విషం.

ఒకే జాతిపాములచేత ఒకే గుడ్డమీద కాటు వేయిస్తున్నాడు.

పాము జాతి మారినప్పుడల్లా, పేషంటుకి పేషంటుకి ఇంజక్షను సూదిమార్చినట్లు గుడ్డని మారుస్తున్నాడు స్వామి.

ఆ విషాన్ని ఎండబెట్టి స్ఫటికాల్లా మారుస్తాడు.

ఆ తర్వాతే ఆ విషాన్ని జాగ్రత్తగా భద్రపరుస్తారు.

మనిషి రక్తం కంటే పాముల విషమే ఖరీదెక్కువ.

డబ్బు ఖర్చు పెడితే రక్తం దొరుకుతుంది-ఏదో రేటుకి. పాము విషం దొరకదు. అందుకే దానికి అంత ఖరీదు.

ఉద్యోగమో, వృత్తో చేస్తున్నట్టుకాక ద్వేషంతోనో, కక్షతోనో స్వామి పాముల నుంచి విషం పిండుతున్నాడనుకున్నాడు నాగరాజారావ్.

విషం పిండేశాక ప్రతీ పామును అంత క్రితం ఉన్న బుట్టలోనే పెడుతున్నాడు.

"ఇక నేను వెళ్తాను"

నాగరాజారావ్ స్వామితో చెప్పాడు.

అతను సమాధానం చెప్పలేదు. ఓ పాము నుంచి విషం కక్కించే ప్రయత్నంలో నిమగ్నమై ఉన్నాడు.

"ఫణీ! నీతో కొంచెం మాట్లాడాలి! నాతో కూడా వస్తావా?"

ఫణిని అడిగాడు నాగరాజారావ్.

"ఓ యస్! గూడెంరానా! ఇక్కడే మాట్లాడదామా?"

నాగరాజారావ్ మీద ఉన్న గౌరవం కొద్దీ వెంటనే 'సరే' అన్నాడు ఫణి.

"శేషగిరి ఆఫీసుకు వెళ్దాం"

ముక్తసరిగా జవాబు చెప్పాడు నాగరాజారావ్.

శేషగిరి ఆఫీసులో లేడు-వాళ్ళిద్దరూ అక్కడికి వెళ్ళేసరికి!

ఇద్దరూ సరాసరి శేషగిరి ఆఫీసు గదిలోకి వెళ్ళి కూర్చున్నారు.

ఉపోద్ఘాతం లేకుండా సూటిగా అడిగాడు నాగరాజారావ్!

"ఫణీ! మేమంటే నీకు ఎందుకు అంత కక్ష! మా అత్తగారూ, మావగారూ నీకేం అన్యాయం చేశారని వాళ్ళని చంపించావ్?"

క్షణంపాటు ఫణి నోటి వెంట మాట రాలేదు.

"మీరు ఏ విషయం గురించి మాట్లాడుతున్నారో అర్థం కావట్లేదు! నాకు మీ మీద కక్ష ఉండటమేమిటి? మీ అత్తగార్ని, మావగార్ని నేను చంపించడమేమిటి?"

ఫణి మాటలు పూర్తవకుండానే నాగరాజారావ్ మళ్ళీ అందుకున్నాడు.

"నాకు తెలుసు... నువ్వు అందరికీ కనిపిస్తున్నంత అమాయకుడివి కాదని! అందరూ నిన్ను వెర్రిబాగులాడిగా, లౌక్యం తెలియని మనిషిలా జమకడతారనీ నాకు తెలుసు. కానీ ఆ అమాయకత్వాన్ని ఆసరా చేసుకొని నువ్వు మా అత్తగార్ని, మావగార్ని చంపావు"

ఆవేశంతో ఊగిపోయాడు నాగరాజారావ్.

"నేను పాములతో ప్రయోగం చేస్తున్న మాట నిజమే. నాకు ముందూ వెనకా ఎవరూ లేరు. పాములతో ప్రయోగాలు చేస్తున్నది ఓ కొత్త విషయం సాధించాలని

తప్పు డబ్బు కోసం కాదు. ప్రస్తుతం నాకు కావలసినంత డబ్బు శేషగిరి ఇస్తూనే ఉన్నాడు. పాముల్ని ప్రయోగించి నేను మీవాళ్ళని చంపానని ఎందుకనుకుంటున్నారో అర్థం కావటం లేదు నాకు!"

ఫణి ఓ నిమిషం ఆగాడు - తనను తాను సంబాళించుకోవడానికి.

నాగరాజారావ్ ఏమీ మాట్లాడలేదు. ఫణినే చూస్తూ కూర్చున్నాడు.

"పోనీ మీతోకానీ, మీవాళ్ళతో కానీ నాకు శత్రుత్వం ఉందేమో అనుకోవటానికి నాకూ, వాళ్ళకీ అసలు సంబంధం లేదు. ఇంకా శేషగిరికి ఉందా సంబంధం. నాకంటె ఎక్కువగా అతనికె మీ కుటుంబ వ్యవహారాలు, మీమీ అలవాట్లు వగైరాలు తెలుసు. అంతమాత్రాన శేషగిరిని మీరు కానీ, నేను కానీ అనుమానించాల్సిన పని లేదు. అతనలాంటివాడు కాదు. మీ అత్తగారూ, మావగారూ పాముకాటువల్లే చనిపోవటం కేవలం కాకతాళీయమని నా ఉద్దేశం! ఎవరెవరో ఏమేమో అనుకుంటున్నారని అనవసరంగా అందర్నీ అనుమానించి మీరు మనశ్శాంతిని పోగొట్టుకోకండి"

ఫణి అంత నిండుగా 'మెచ్యూర్డ్'గా మాట్లాడగలడని అంతవరకూ నాగరాజారావ్ ఎప్పుడూ అనుకోలేదు.

"మనదేశంలో కనీసం మూడు వందల రకాల పాములున్నాయి. వాటిలో కేవలం ఎనిమిది రకాలే ప్రమాదకరమైనవి. అలాగే, పాముల మీద ఆధారపడి జీవించే వాళ్లు, పాములతో సహజీవనం చేస్తున్న వాళ్ళూ మనదేశంలో అయిదారు వేల మందికి మించి ఉండరు. అంతమాత్రాన వారంతా పాముల్లా దుర్మార్గులుకారు. నేనైనా అంతే, శేషగిరైనా అంతే, మరొకడైనా అంతే!"

పసిపాపలా నిష్కల్మషంగా చెప్పాడు ఫణి.

నిజమేననిపించింది నాగరాజారావ్‌కి.

'పైగా స్వామికి తెలియకుండా పాముల్ని ఫణి ఎలా బయటికి తీసుకురాగలడు? అదీకాక, శేషగిరి కొన్న పాములైనా కావవి. వేరే దేశాలలో ఉండే పాములవి. ఏ గాలివాటుకో ఇలా కొట్టుకొచ్చి ఉంటాయవి. తాత్కాలికోద్రేకంతో అనవసరంగా ఫణిని అనుమానించాను' అనుకొన్నాడు నాగరాజారావ్.

మర్నాడు ఆదివారం.

శేషగిరిని ఎంత పొద్దుపోయినా కలిసి వెళ్దామని నాగరాజారావ్ ఆఫీసులోనే ఉండిపోయాడు.



## 10

సుబ్బారాయుడి పేటలో ఉన్న చుట్టాలింటికి చుట్టపు చూపుగా పార్వతిని వెంట పెట్టుకెళ్లింది సుబ్బలక్ష్మి.

ఇంట్లో నాగలక్ష్మి ఒక్కత్తే ఉంది.

శివుడు ఏదో పని మీద బయటికి వెళ్ళాడు.

ఆదిశేషుని చంపిన పాముని చంపాక మళ్ళీ శివుడికి ఆ ఇంట్లో స్థానం దొరికింది.

"పోన్లేరా పాపం! మనింట్లోనే ఉండనీ" అంది సుబ్బలక్ష్మి కొడుకుతో!

"ఆడు \ అలాంటాడు కాదండీ! అమ్మాయిగారు పరధ్యానంగా ఉండి అలా అనుకొని ఉంటారండి"

పార్వతి కూడా శివుడికి సర్టిఫికేట్ ఇచ్చింది.

నాగలక్ష్మి కూడా తాను అనవసరంగా పొరపాటు పడ్డాననుకుంది.

'నిజంగానే శివుడు నన్ను పదేపదే పిలిచిఉండవచ్చు. నా ఆలోచనల్లో నేనుండగా నాకేమయిందోననే ఆతృత కొద్దీ నన్ను తట్టి పిలిచిఉంటాడు'

నాగరాజారావ్ కూడా నాగలక్ష్మి మాదిరిగానే సిదానంగా ఆలోచించి 'ఆ క్షణంలో వాడిమీద దురభిప్రాయం ఏర్పరచుకొని నాకు ఫోన్‌చేసి ఉంటుంది' అనుకున్నాడు.

అందుకే చివరికి "సరేలేరా! జరిగిందేదో జరిగిపోయింది. నీమీద ఇప్పటి వరకూ మాకు ఎలాంటి అనుమానమూ లేదు. ఎందుకయినా మంచిది కాస్త ఒళ్లు దగ్గిరపెట్టుకొని పడిఉండు" అంటూ హెచ్చరించి శివుడిని తమ ఇంట్లోనే ఉండమన్నాడు నాగరాజారావ్.

శివుడు ఏమీ మాట్లాడలేదు. అక్కడి నుంచి వీధివరండాలోకి వెళ్లిపోయాడు.

నాగలక్ష్మి ఒంటరిగా పడకగదిలో మంచంమీద తలగడకి ఆనుకుని ఉంది.

పెరటివేపుఉన్న మామిడి చెట్టుకొమ్మ సందుల్లోంచి ఆకాశంలోని తెల్లనిమేఘాలు కనిపిస్తున్నాయి. మేఘాల అంచులు అంతు పట్టని పొడుగాటి పాముల్ని జ్ఞాపకం చేస్తున్నాయి.

"గ్రహస్థితి బావుండలేదని సిద్ధాంతిగారు చెబితే నవగ్రహజపాలు, సుబ్రహ్మణ్యేశ్వరుడికి క్షీరాభిషేకం, సహస్రనామ పూజ చేయించుకున్నాం. అదేరోజు సాయంత్రం తండ్రి పాముకాటువల్లే చచ్చిపోయాడు. తండ్రి మంచంమీద చిన్న పెట్టెవుంది. ఆ పెట్టె ఎక్కడిదిని?'

నాగలక్ష్మికి ఆరోజున ఆదిశేషు మంచంమీద ఉన్న పెట్టె గుర్తుకు రాగానే నిటారుగా కూర్చుంది.

ఆ పెట్టెగురించి ఆరోజున ఎవరూ పట్టించుకోలేదు. ఆదిశేషు చనిపోవటం, శివుడు ఆపాముని చంపటం, ఆ తర్వాత అంత్యక్రియలు... ఆ హడావుడిలో పెట్టె గురించి ఎవరూ తీవ్రంగా ఆలోచించలేదు.

ఆ తర్వాత ఓరోజున భర్తతో ఆ విషయం ప్రస్తావించింది.

అప్పుడే మొదటిసారిగా నాగరాజారావ్‌కి ఫణిమీద అనుమానం తలెత్తింది.

'ఫణి దగ్గరికి వెళ్తానన్నారాయన! అక్కడేం ఘర్షణ పడుతున్నారో' అనుకొంది నాగలక్ష్మి.

ఇంట్లో ఎవరూ లేకపోవటంతో ఆమె మనసు బెదురుబెదురుగా వుంది.

హఠాత్తుగా వాతావరణం మారిపోయింది. గాలి విసురుగా వీస్తోంది.

ఒళ్లు జలదరించింది నాగలక్ష్మికి. చివాలున లేచి కిటికీ తలుపుల్ని మూసేసింది.

ఆమె చూపు అనుకోకుండా మంచం కింద కేంద్రీకృతమయింది.

'ఈ మంచంకిందే రెండోనాగు పాము కనిపించింది?'

తల్లి అంత్యక్రియలయిన తరువాత ఇంటికిరాగానే భర్తకి పాము కనిపించిన విషయం జ్ఞాపకం వచ్చింది.

కిటికీ తలుపులసందులోంచి మంచం కిందకి సన్నగా పడుతున్న మసక

వెలుతురు పొడవయిన పాము కుబుసంలా కనిపించింది.

'ఇంచుమించుగా శివుడు నా వయస్సు వాడే! వాడి చూపుల్లోకానీ, చేష్టల్లోకానీ ఎలాంటి తేడా కనిపించలేదు. కానీ ఆ రోజున... అలా ఎందుకు చేసినట్టు?'

ద్వైధీభావంలో కొట్టుమిట్టాడసాగింది నాగలక్ష్మి.

పాముని చంపటానికి తాను చీర చింపి ఇవ్వటం, తరువాత వాడు తనని అదోలా చూడటం జ్ఞాపకం వచ్చాయి ఆమెకు.

బయట చినుకులు ప్రారంభమయ్యాయి. ఇంటి కిటికీ తలుపులన్నీ మూసేసి మళ్ళీ పడకగదిలోకి వచ్చి యథాలాపంగా పడుకొంది.

వీధి తలుపు తీసేఉంది.

మంచంమీదనుంచి ఆమెకు ఆ తలుపు కనిపిస్తోంది.

పడకగది కిటికీలోంచి పడుతున్న మబ్బు వెలుతురుకు ఏదో అడ్డంవచ్చినట్టు అనిపించింది.

కిటికీ అవతల మెత్తగా అడుగుల చప్పుడు వినిపించింది.

"ఎవరూ?"

గభాలున మంచం దిగి కిటికీ తలుపులు తీసిచూసింది.

ఎవరూ కనిపించలేదు.

తలుపులు మూసేసి మళ్ళీ మంచం మీద వాలింది.

అప్పుడే పూర్తిగా తడిసిపోయి శివుడు లోపలికివచ్చాడు.

వర్షానికి తడిసిపోయినందువల్ల గేటు తీసినపుడు చప్పుడు కాలేదు.

శివుడి చేతిలో టైలర్ దగ్గర్నుంచి తెచ్చిన నాగలక్ష్మి కొత్త జాకెట్ల పేకెట్ వుంది.

కాగితం కవర్లో ఉండటంవల్ల జాకెట్లు కూడా తడిసిపోయాయి. కవరు వర్షానికి తడిసి చీకిపోయింది.

తడికాళ్ళతో లోపలికి వచ్చిన శివుడు ఆ పేకెట్‌ను ఇవ్వడానికి నాగలక్ష్మిని పిలిచాడు.

పడకగది గుమ్మం ముందు నిలబడి ఉన్నాడు వాడు.

ఉలిక్కిపడి ధనాలున లేచి నిలబడింది ఆమె.

కంగారు కంగారుగా పైట సర్దుకుంటూ "ఏమిటేమిటి?" అంది.

"ఇవిగోనండీ మీ జాకెట్లు! బజార్లో టైలరు ఇచ్చాడు"

నాలుగడుగులు ఎదరకివేసి లోపలినించే ఆ కవరును అందుకోబోయింది నాగలక్ష్మి.

తడిసి చీకిపోయిన ఆ కవరును ఆమె అందుకోవటంలో ఓ క్షణం ఆలస్యం అయింది.

ఆ వ్యవధిలో కవరు వంగింది. కవరు చిరిగిపోయి జాకెట్లు కిందపడ్డాయి. 'అరెరే' అంటూ శివుడు కిందకు వంగి వాటిని పైకి తీయబోయాడు.

అదే సమయంలో ఆమె కూడా కిందకు వంగింది—కొత్త జాకెట్లు కిందపడితే వాటికి దుమ్ము అంటుకుంటుందేమోనని!

ఆ హడావుడిలో ఆమె చెయ్యి శివుడికి తగిలింది.

అతని నుదురు ఆమె తలని ఢీకొట్టుకుంది.

శివుడు జాకెట్లని అక్కడే వదిలేసి హాలులో ఓ మూలకి వచ్చేశాడు.

ఆ మూలగా ఉన్న మంచం మీదగల తువ్వాలుని తీసుకొని తల తుడుచుకోసాగాడు.



జాకెట్టు పైకి తీసి చేత్తో పట్టుకుని తదేకంగా శివుడినే చూడసాగింది నాగ లక్ష్మి.

'కావాలనే ఇలా చేశాడా? కాకతాళీ యమా?' అని తనలోతానే వితర్కించుకో సాగింది.

దృఢంగా, కండలు తిరిగి ఉన్న శివుడి శరీరం పైకి, కిందికి ఊగుతోంది- వాడు తల తుడుచుకొంటూంటే.

అప్పటికే వాడు చొక్కా విప్పేశాడు. కేవలం నిక్కరుమీద ఉన్నాడు.

అనుకోకుండా ఆమెలో ఓ అభి ప్రాయం తళుక్కుమంది.

'పెళ్ళయి ఇన్నాళ్లయింది. కానీ పిల్లలు పుట్టలేదు. డాక్టర్లు, నాలో ఏమీ లోపం లేదని అన్నారు...'

మనసుతో పోటీపడి వేగంగా, తీవ్రంగా ఆలోచించేస్తోందామె.

శివుడికి పెళ్ళికాలేదు. ఇంచుమించు నా వయసువాడే! నా మీద వాడికి దురుద్దేశం



ఉందో లేదో తెలియదు...'

శివుడిని ఆపాదమస్తకం పరికించి చూస్తోందామె. నాగలక్ష్మి ముఖంలో రంగులు మారాయి.

అతడు తనపని తాను చేసుకుపోతున్నాడు. తడిసిన లాగూ విప్పేసి వేరే లాగూ వేసుకొన్నాడు. చెదిరిన జుట్టును దువ్వుకోసాగాడు అటు తిరిగి.

వెనకనించి ఆమె చూపులు అతనికి గుచ్చుకుంటున్నాయి.

ఆమె ముఖం అంత దూరం నుంచి అద్దంలో కనిపిస్తోంది శివుడికి.

నాగలక్ష్మి జాకెట్టు వెనక్కి మంచం మీదకు విసిరేసి ఏదో నిర్ణయించుకున్న దానిలా శివుడివైపు అడుగులు వేసింది.

శివుడు తలదువ్వుకోవటం పూర్తి చేసి వెనక్కి తిరిగాడు.

అప్పటికి ఆమె అతనికి రెండు అడుగుల దూరంలోకి వచ్చేసింది.

ఏం జరుగుతోందో అర్థం చేసుకునే లోగానే ఆమె శివుడిని వాటేసుకుంది.

విషయం అర్థమయ్యేసరికి ఆమె అతన్ని చుట్టుకుపోయింది.

శివుడు కూడా మరేమీ ఆలోచించ లేదు.

ఆమెను అలాగే చేతుల్తో చుట్టేశాడు.

నాగలక్ష్మి అదే భంగిమలో శివుడితో సహా వెనక్కి వెనక్కి నడిచి పడక గది లోకి వెళ్ళింది.

శివుడు వెనకనుంచే తలుపులు దగ్గరగా వేశాడు.

గదంతా పల్చని చీకటి.

మూసి ఉన్న కిటికీ తలుపుల్లోంచి సన్నని వెలుతురు మాత్రం పడుతోంది. ఆ వెలుతురు కిటికీ తలుపుల మీదనుంచి వేలాడుతున్న పాము కుబుసంలా ఉంది.

ఇద్దరూ మంచం మీద వాలారు.

వాడి కింది పెదవిని చుంబిస్తూ కసుక్కున పెదవి కొరికింది నాగలక్ష్మి - మితిమీరిన తమకంతో!

అప్పుడే వీధి గుమ్మంలోంచి ఎవరో లోపలికి వచ్చినట్లనిపించింది శివుడికి.

నాగలక్ష్మిని వదిలేసి మంచం దిగబోయాడు.

"ఏం... లేచిపోతావేం?"

మత్తుగా మూలుగుతూ అడిగింది.

"ఎవరో వచ్చినట్లున్నారు"

ఆమె చేతిని విడిపించుకుంటూ అన్నాడు శివుడు.

"ఎవరూ రాలేదు! వస్తే పిలవకుండా ఉంటారా!"—శివుడి చెయ్యిపట్టి లాగింది నాగలక్ష్మి.

అతడు మారుమాట్లాడలేదు.

నాలుగు నిమిషాలు గడిచాయి.

దగ్గరగా ఉన్న తలుపులు కొంచెం కొంచెం కదులుతున్నట్లు అనిపించింది నాగలక్ష్మికి.

ఆమె గుండెల మీద శివుడు ఉన్నాడు.

'గాలికి కాబోలు' అనుకుంది.

ఆమె లేవలేదు. శివుడిని లేవనియ్యలేదు.

వాళ్ళ నిట్టూర్పులు జంట పాము బుసల్లా ఉన్నాయి.

ఆ చీకట్లో వాళ్ళ శరీరాలు కొండచిలువలు పెనవేసుకున్నట్లు కనిపిస్తున్నాయి.

వర్షానికి తడిసిన జాకెట్టు చల్లగా తగలటంతో బాహ్య ప్రపంచానికి వచ్చేసింది నాగలక్ష్మి.

శివుడిని పక్కకి గెంటేసి మంచం దిగింది. "ఈ విషయం ఎవరికైనా తెలియనిచ్చావో నీ ప్రాణం తీస్తాను!"

బెదిరిస్తూ చీర కట్టుకోసాగింది.

రెండోవైపునుంచి శివుడు మంచం దిగాడు.

ఉండి ఉండి గాలి వీస్తున్నట్టు "బుస్...బుస్..." అంటూ శబ్దం వినిపిస్తోంది శివుడికి.

గబగబ లాగు తొడుక్కున్నాడు శివుడు.

విసురుగా వచ్చి తలుపులు బార్లా తీశాడు.

ఆమె లైటు వేసింది.

సరిగ్గా అక్కడే స్విచ్ కింద గోడ వారగా రెండు మూరలున్న నల్లని పాము గమ్యం తెలియకుండానే పాకుతోంది.

దాని తల నాగలక్ష్మి పాదానికి బెత్తెడు దూరంలో ఉంది.

"పాము...పాము..."

కంగారుగా, భయంగా అరిచింది నాగలక్ష్మి.

వెంటనే వెనక్కి గదిలోంచి బయటికి రాబోయింది.

ఆమె వెనక్కి తిరగటంలో ఎడమ కాలు పాముకు తగిలింది.

నాగలక్ష్మి కదలటం, పాము పడగ పైకెత్తటం ఒకేసారి జరిగాయి.

ఆమె ఎడమకాలు పాముకు తగలటం, అది నాగలక్ష్మిని కాటు వేయటం కూడా ఒకే క్షణంలో తటస్థించాయి.

"బాబోయ్! పాము...పాము!"

పాముకి తన కాలు తగిలిందని మాత్రమే అనుకుంది నాగలక్ష్మి.

శివుడు ఒక్క అంగలో ఆ గోడ దగ్గరికి వెళ్ళాడు.

అదే సమయంలో రిక్షాలోంచి దిగి సుబ్బలక్ష్మి, పార్వతి ఇంట్లో అడుగు పెట్టారు.

నాగలక్ష్మి, శివుడు ఒకే గదిలో ఉండటం మాత్రమే చూశారు వాళ్ళిద్దరూ.

నాగలక్ష్మి బయటకు వచ్చి సుబ్బలక్ష్మిని వాటేసుకుంది భయంగా!

శివుడు చేయకూడని పనేదో చేశాడనుకుంది సుబ్బలక్ష్మి!

శివుడి ఎదురుగా పాము!

రాజసంగా పడగ విప్పి శివుడిని కాటు వేయడానికి ఎదురుచూస్తోంది.

"ఆ గదిలో పాము ఉంది...."

నాగలక్ష్మి తేరుకుంటూ సుబ్బలక్ష్మితో చెప్పింది.

అంతలో ఎడమ కాలు చీలమండమీద చురచురమంటున్నట్లు అనిపించింది నాగలక్ష్మికి. గాభరాగా ఎడమ కాలును వెనక్కి మడిచి చీలమండని ఎడమచేత్తో తడిమింది.

చీలమండమీద చమర్చిన రక్తం చేతికి తగిలింది.

అప్పటికే ఆమెకు కాలు బరువెక్కినట్లనిపించింది.

"అయ్‌బాబోయ్!పా...పాము. నన్ను కరిచింది...."

సుబ్బలక్ష్మి కంగారుగా "ఎక్కడ... ఎక్కడ" అంటూ నాగలక్ష్మి దగ్గరకు వచ్చింది.

శివుడికి కాళ్ళూ చేతులు ఆడటంలేదు.

నాగలక్ష్మిని అది కాటేసింది.

దాన్ని బతకనివ్వకూడదనుకున్నాడు శివుడు.

మెరుపులా వెనక్కి జరిగి మంచంమీద తలగడ తీసి దాని మీద వేసి పట్టి నొక్కి ఉంచాడు.

అతని అడుగులతో పాటే అదీ మూరెడు ఎదరకి సాగింది పడగతోసహా!

అందువల్ల తలగడ దాని తలకి బెత్తెడు

కిందగా పడింది.

మెత్తని తలగడ కింద పాము జాడ తెలుస్తోంది శివుడికి.

వెంటనే తలను వెనక్కి తిప్పింది పాము.

శివుడి కుడికాలి వేళ్లు దానినోటికి అందాయి.

ఫట్ ఫట్ మంటూ కోపంగా కాట్లు వేసిందది.

శరీరాన్ని మరింత ముందుకు తీసుకు రావటానికి పడగని నేలమీదకు ఆనించి పెనుగులాడసాగిందా పాము.

కాట్లుపడిన కాలు మడమతో పాము తల మీద తపీ తపీమని కొట్టాడు శివుడు.

తలగడమీద ఎడమకాలే ఉంది.

తలగడ మెత్తదనానికి శివుడికి పట్టు చిక్కలేదు. శివుడి మడమ దెబ్బలకి పాము గిలగిలలాడింది.

దాని తల చితికిపోయింది.

దాని శరీరం మరింత బయటికి వచ్చింది. కేవలం తోక మాత్రం తలగడ కింద వుంది.

ఈసారి ఎడమకాలి మడమతో పాము తల మీద మళ్ళీ మళ్ళీ కొట్టాడు.

అదే ఊపులో దాని నడుంమీద కూడా కుళ్లబొడిచాడు కాళ్ళతో.

అప్పటికి అతని కుడిపాదం బరువెక్కినట్టయింది.

పాము కదల్లేదు. అది ఎప్పుడో చచ్చిపోయింది. దాని పొట్ట బద్దలయింది. తల చితికిపోయింది.

గబగబా బయటికి వచ్చి ఓ తువ్వాలును తన కుడికాలు పాదానికి పైన గట్టిగా శక్తికొద్దీ బిగించాడు.

నాగలక్ష్మి ఎడమ మోకాలుకు కొంచెం కిందుగా తాడు బిగించింది పార్వతి.

సుబ్బలక్ష్మి డాక్టరుకు ఫోన్‌చేసింది. ఆయన గవర్నమెంట్ డాక్టర్ దగ్గరకు వెళ్ళి అక్కడినుంచి యాంటీస్నేక్ వీనమ్ తీసుకొని హడావుడిగా వచ్చాడు.

అప్పటికి పావుగంట గడిచింది.

నాగలక్ష్మి నోట్లోంచి నురగలు వస్తున్నాయి.

ఊపిరి పీల్చుకోవటానికి చాలా కష్టపడుతోంది.

డాక్టర్ వచ్చీరాగానే నాగలక్ష్మి కాలుకి ఉన్న తాడు కట్టును ఊడదీసి మళ్ళీ కట్టాడు.

శివుడు నేల మీద చతికిలపడి కుడికాలి బొటనవేలునూ, దాని పక్క వేలునూ మార్చి మార్చి నోట్లోపెట్టుకుని పాము కాట్ల మీదనుంచి చమరుస్తున్న రక్తాన్ని నోటితో పీలుస్తూ బయటికి ఉమ్మేస్తున్నాడు.

డాక్టర్ — నాగలక్ష్మిని పడుకోబెట్టి ఆమె పిర్రమీద యాంటీస్నేక్‌వీనమ్ ఇంజక్షన్ ఇచ్చాడు.

శివుడికి నోరు మండసాగింది-రక్తంతో తడిసి.

'అమ్మగారు గట్టిగా కొరికేశారు; పెదవి మీద గాయంలోంచి విషం లోపలి కెళ్ళిపోతోంది' అనుకున్నాడు శివుడు.

అతనికి చెమట్లు పట్టేస్తున్నాయి.

నాగలక్ష్మి శరీరం చమటతో పూర్తిగా తడిసిపోయింది.

ఆమె ఎడంకాలు పిలమండమీద కాటుని సబ్బునీళ్ళతో కడిగి ఏదోమందు పూశాడు డాక్టరు.

సుబ్బలక్ష్మి, పార్వతి 'ఎలావుంది? బతుకుతుందా?' అన్నట్లు డాక్టరువైపు చూశారు.

"చెప్పటం కష్టం. మందు వేసేసరికే

ఆలస్యం అయింది"

డాక్టర్ లోగొంతుకతో చెప్పాడు.

ఆ మాటలు అస్పష్టంగా విన్పించాయి నాగలక్ష్మికి!

శివుడిని ఎవరూ పట్టించుకోలేదు.

వాడి కుడికాలు స్పర్శజ్ఞానం కోల్పోయింది. బాధ భరించలేకపోతున్నాడు. నేలమీద పడి దొర్లుతూ మెలికలు తిరిగిపోతున్నాడు.

డాక్టర్ యాంటీస్నేక్ వీనమ్‌ను ఒక్క యాంపిలే తెచ్చాడు.

నిజానికి పేషంటుని గవర్నమెంటు ఆసుపత్రికి తీసుకెళ్ళాల్సి ఉంటుంది. నాగరాజారావ్ పలుకుబడి తెలిసిన గవర్నమెంటు డాక్టరు ఆవిషయాన్ని పట్టించుకోలేదు.

శివుడికి చికిత్సచేసి బతికించాలనుకున్న డాక్టరు బ్లేడుతో వాడి కుడికాలు వేళ్ళమీద గాట్లుపెట్టి రక్తాన్ని బయటికిపిండసాగాడు.

నాగలక్ష్మి పరిస్థితిలో మార్పులేదు. ఆమెకు ఎప్పుడో స్పృహతప్పింది.

బొట్లుబొట్లుగా శివుడి పాదం మీదుగా మడమ కిందనుంచి రక్తం కారుతోంది. ఆ కాలుని డాక్టరు ఎడమచేత్తో పైకెత్తి పట్టుకొని కుడిచేతి వేళ్ళతో రక్తం పిండుతున్నాడు.

పార్వతి డాక్టరుకి సాయం చేయసాగింది.

శివుడికి కూడా స్పృహ తప్పింది.

నాగలక్ష్మిముఖం పాలిపోయి నలుపు రంగుకు తిరిగింది. శరీరమంతా విషం పాకేసింది. ఆమె గుండెలు ఎగిసెగిసి పడుతున్నాయి.

శివుడి పరిస్థితి అలాగేవుంది.

"ఇక లాభంలేదు"

డాక్టరు శివుడిని వదిలేశాడు.

అప్పుడే నాగలక్ష్మి మెడ వాల్చేసింది.

మరు నిమిషంలో శివుడి ప్రాణాలు కూడా పోయాయి.



# 11

శేషగిరి ఏడింటికి వచ్చాడు.

"అబ్బ! నేనెంత అదృష్టవంతుణ్ణి! పిలవకుండానే వచ్చావే!"

నాగరాజారావుని పలకరిస్తూ అన్నాడు శేషగిరి.

"నీకు తెలుసా! మా అత్తగార్ని, మావగార్ని నేనే చంపించానుట."

నాగరాజారావ్ సూటిగా వాగ్యుద్ధానికి దిగాడు.

"ఎవరన్నారు?"

శేషగిరి బిత్తరపోతూ అన్నాడు.

"ఊళ్ళో అంతా అలా చెప్పుకుంటున్నారు. పేపర్లలో కూడా అలా అని రాశారు!"

"ఛ! నేను చూడలేదే! అయినా నీకేం ఖర్మ! అంతపని చేయడానికి!"

"అదే నేనదీనీ! ఆస్తికోసం నువ్వు ఇంత నీచానికి దిగజారతావనుకోలేదు!"

"ఇది మరీబావుంది! నాగలక్ష్మి తల్లి నాకు పినతల్లి! చూస్తూ చూస్తూ అంత ఘాతుకానికి నేనెందుకు ఒడిగడ్తాను"

"కాకపోతే నాగపల్లీ,ఆదిశేషు-ఇద్దరూ పాములపల్లే ఎందుకు చచ్చిపోయారు?

ఇందులో నువ్వేదో గూడుపుఠాణీ చేశావ్! జాగ్రత్త, నేను తలుచుకుంటే నిన్ను ఏమన్నా చేయగల్ను! ఆమాత్రం పలుకుబడుంది నాకు!"

"మిస్టర్ నాగరాజారావ్! అనవసరంగా నామీద అభాండం వెయ్యకు! ఎవడో ముక్కూ మొహం తెలియని వెధవ ఏదో అన్నాడని, అన్యాయంగా నన్ను అవమానించకు! అసలు నాకూ, నీకూ సంబంధమేమిటి? ఒకప్పటి ఫ్రెండ్‌వి! నాకు ఆర్థికంగా సాయంచేశావ్! కాదనను! నీడబ్బు పైసల్తో సహా లెక్కగట్టి ఎప్పటికప్పుడు నీకు ఇచ్చేస్తున్నాను! అంతమాత్రాన అలుసుగా తీసుకొని నోటికి వచ్చినట్లు మాట్లాడకు! నమ్మకముంటే రుజువు చెయ్యి నేనాపని చేశానని! ఇకమీదట ఇలా పిచ్చి పిచ్చిగా వాగకు! వెళ్ళు! వెళ్ళిక్కణ్ణించి"

శేషగిరి ఆదివరకెప్పుడూ అలాఅరవలేదు. నాగరాజారావ్ ఆశ్చర్యపోయాడు. కానీ, కోపంగాలేచి "నీ అంతు చూస్తాను" అంటూ బయటికి వచ్చేయబోయాడు.

అప్పుడే టెలిఫోనుమోగింది.

శేషగిరి అందుకున్నాడు ఫోను!

"ఆ! ఎప్పుడు? డాక్టరును పిలిపించలేదా?"

నాగరాజారావ్ ఓక్షణం గుమ్మంలోనే ఆగిపోయాడు.

"ఆ! ఇక్కడే ఉన్నాడు! వస్తున్నాం! ఇద్దరం ఇప్పుడే వస్తున్నాం"

ఫోన్‌పెట్టేస్తూ "నాగలక్ష్మిని పాము కరిచిందట! శివుడేనిహూడా! మీ అమ్మగారు ఫోనుచేశారు" అన్నాడు శేషగిరి. నాగరాజారావ్‌కి మతిపోయినంత పనైంది.

గబగబా బయటికివచ్చాడు. వెనకాలే శేషగిరి వెళ్ళాడు.

ఇద్దరూ కారులో కూర్చున్నారు. నాగరాజారావ్ డ్రైవ్ చేయసాగాడు.

ఆఘమేఘాలమీద కారు పరుగెడుతోంది.

* * *

హైదరాబాద్‌లో శేషశయన్ మణికి సైకోథెరపీ ప్రారంభించాడు.

మణికి స్పృహవచ్చిన తరువాత తాను దగ్గరుండి అన్ని విషయాలు చూడసాగాడు.

ఓ రోజున పాముల్లాఉన్న ఆటవస్తువులను మణికి ఇచ్చాడు ఆడుకోవటానికి!

మొదట్లో కంగారుపడ్డా, తరువాత అవి బొమ్మలని అర్థం చేసుకున్నాడు ఆ కుర్రాడు.

అలా రెండురోజులు గడిచాయి.

తర్వాత ఓరోజున 'జూ'కి తీసుకు వెళ్ళాడు.

సుబ్బారావు, అతనిభార్యా కొడుకుతో కూడా వెళ్ళారు. ముఖ్యంగా స్నేక్‌పార్కు దగ్గిర ఎక్కువ కాలక్షేపం చేయించాడు శేషశయన్.

పిట్స్‌లలోంచి బయటికి వస్తున్న పాములను చూసి "పాము...పాము" అంటూ బెంబేలెత్తిపోయాడు మణి.

"దూరంగాఉన్న పాములు మనల్నేం చేస్తాయి! మనలా ఎంతమంది ఆ పాముల్ని చూస్తున్నారోచూడు" అంటూ మణికి నచ్చచెప్పాడు శేషశయన్.

క్రమక్రమంగా దూరంగా పాముల్ని చూడటం అలవాటు చేసుకున్నాడు మణి.

రోజూ రాత్రిపూట మణిని హిప్నటైజ్ చేసేవాడు శేషశయన్.

సజెషన్స్‌లో అసలు అంతకు ముందు మణి పామును ఎప్పుడూచూసిఉండనట్టూ, వాటిని మనమేమీ చేయకపోతే అవి మనల్నేమీ చేయకుండా వాటిదోవన అవి వెళ్ళిపోతాయన్నట్టూ చెప్పేవాడు.

అప్పుడప్పుడు పాములవాళ్ళని రప్పించి బుట్టలో ఉండే పాముల్ని ఆడిపించేవాడు మణి ఎదురుగా!

ఒక రోజున కోరలు పీకేసిన పాముని తనే స్వయంగా పట్టుకుని మెళ్ళో వేసుకున్నాడు శేషశయన్. దాని నోరు కూడా కుట్టేసి ఉంది. కానీ నాలుకలు బయటికి చాస్తోంది.

అలా నాలుకలు చాచటం చూసే మణికి స్నేక్ ఫోబియా వచ్చింది.

'కానీ డాక్టర్‌గారిని అదేం చేయలేదే?'

మణి చిన్న బుర్రలోకి ఆ ఆలోచన వచ్చింది. అందుకోసమే తాపత్రయపడ్డాడు శేషశయన్.

మొత్తంమీద మణికి పాములంటే భయంపోయింది. శేషశయన్ చేతిలో పామునిపట్టుకొని ఉండగా ఓసారి మణి కూడా దాన్ని తాకి చూశాడు.

"అమ్మ కట్టుకునే జరీచీర అంచులా ఉంది" అన్నాడు పాముని తాకి చూసి మణి!

దాని మీద పొలుసులు అలా అని పించాయి మణికి!

"మరో రెండు రోజుల్లో బాబుని మీరు ఇంటికి తీసుకుపోవచ్చు"

మణి వినకుండా రహస్యంగా చెప్పాడు శేషశయన్-సుబ్బారావుతో.

తృప్తిగా ఊపిరి పీల్చుకున్నారు-సుబ్బారావు, అతని భార్యా!

"సార్! తాడేపల్లిగూడెంనించి ఫోన్"

నర్స్ చెప్పటంతో శేషశయన్ హడా వుడిగా తన ఆఫీస్ రూమ్‌లోకి వెళ్ళాడు.

వెనకాలే సుబ్బారావు, అతని భార్య, మణికూడా వెళ్ళారు.

"నమస్తే! మణి ఈజ్ ఆల్ రైట్! విదిన్ టూ డేస్ హి ఈజ్ గోయింగ్ టుబి డిశ్చార్జ్‌డ్."

ఆ మాటలు విన్నారు సుబ్బారావు దంపతులు శేషశయన్ గదిలోకి అడుగు పెడుతూ!

"ఆఁ! అలాగా! అయామ్ వెరీసారీ! ఓ ఎస్. చెబుతాను... అహ... అలాగా బంధువులని చెబితే దూరపు బంధువులను కున్నాను. ఆదిశేషగారి తమ్ముడి కొడుకా సుబ్బారావుగారు..."అలాగే... వెంటనే పంపించే ఏర్పాటు చేస్తాను. నా కారులో పంపిస్తాను. సరేనా! ఓకే ఓకే"

ఫోను పెట్టేసి తల పైకెత్తేసరికి సుబ్బారావు, మణి,అతని తల్లి శేషయశన్ టేబుల్ దగ్గరకు వచ్చారు!

"ఒక దుర్వార్త! నాగలక్ష్మిగారు చని పోయారుట! పాము కాటేసిందట!"

సుబ్బారావు ఏమీ మాట్లాడలేక పోయాడు-ఆ మాట విని.

నెల్లాళ్ళ క్రితమే ఆదిశేషు చనిపోతే, మణిని ఆసుపత్రిలో ఉంచేసి వాళ్ళిద్దరూ గూడెం వెళ్ళి వచ్చారు.

"మళ్ళీ నెల తిరక్కుండా నాగలక్ష్మి"

సుబ్బారావు అప్రయత్నంగా అన్నాడు.

"నా కారులో వెళ్ళండి మీరు! బాబుని తీసుకెళ్ళండి! సాధ్యమైనంతవరకూ పాముల కథలు ఇతనికి చెప్పవద్దు! పాముల్లా కనిపించేవి కూడా మణికి చూపించవద్దు. నాలుగైదు నెలల్లో బాబు మామూలుగా తయారవుతాడు!"

మణి గురించి డాక్టర్ శేషశయన్ జాగ్రత్తలు చెప్పి తన కారులో వాళ్ళని గూడెం పంపించారు.

* * *

ఇంటికి రాగానే నాగలక్ష్మి శవాన్ని, అక్కడికి కొంచెం దూరంలో ఉన్న శివుడి శవాన్ని చూశారు నాగరాజారావ్,

శేషగిరి

నాగలక్ష్మి బొట్టు చెదిరిపోయి ఉంది. శివుడి ముఖం మీద అక్కడక్కడ కుంకం బొట్లు కనిపించాయి నాగరాజారావుకి. ఆమె కాటుక వాడి బుగ్గల మీద సన్నని చారికలుగా పడింది. వాడి జుట్టు చెదిరిపోయింది. నాగలక్ష్మిని దగ్గరకి తీసుకున్నపుడు ఆమె తన జుట్టు చెరిపేయటం గుర్తుకు వచ్చింది నాగరాజారావ్‌కి.

పడకగదిలో చచ్చి పడున్న పాము ఉంది.

తన దగ్గర్నుంచే నాగరాజారావ్ ఫేమిలీ డాక్టర్ మందు యాంటీస్నేక్ వీనమ్ తీసుకెళ్ళినందువల్ల, ఆ విషయం పోలీసులకు రిపోర్టు చేశాడు గవర్నమెంటుడాక్టర్. అందువల్ల తప్పనిసరి స్థితిలో శివుడినీ, నాగలక్ష్మినీ పోస్టుమార్టమ్‌కు పంపాల్సి వచ్చింది నాగరాజారావ్‌కి.

అతిమామూలుగా పోలీసులు ఆ వ్యవ



హారాన్ని తెమిల్చేశారు.

మర్నాడు రెండు శవాలను నాగరాజారావ్‌కి అప్పగించారు పోలీసులు.

'ఇదీ నా మంచికే!'

నాగరాజారావ్ అనుకున్నాడు తనలో తను!

ఆదిశేషు చనిపోయినపుడు తనపై వచ్చిన అపవాదు జ్ఞాపకం వచ్చిందతనికి!

నాగరాజారావ్‌కి ఏడుపు రావటంలేదు!

కానీ మనసు భయంకరంగా, మూగగా రోదిస్తోంది.

భార్య చనిపోయింది!

నాగలక్ష్మి అతనికి భార్యకంటె ఎక్కువ.

'ఏమిటిది! ఇలా ఒకే కుటుంబంలో మనుషులు ఒకేరకంగా అతితక్కువ వ్యవధిలో చనిపోవటం ఏమిటి? ఎవరు దీనికి కారణం?'

అప్రయత్నంగా నాగరాజారావ్‌కి పాము తమ ఇలవేల్పు అని జ్ఞాపకం వచ్చింది.

అతడు దేవుణ్ణి నమ్ముతాడు.

'స్వామికి ఎవరో ఏదో అపచారం చేసిఉంటారు'-అనుకున్నాడు నాగరాజారావ్.

'లేకపోతే ఇలా తల్లి, తండ్రి, కూతురు పామువల్లే చచ్చిపోవటమేమిటి?'

మళ్ళీ తనలో తానే తర్కించుకో సాగాడు.

సుబ్బారావు, అతని భార్యా, మణి వచ్చారు.

నాగలక్ష్మి అంత్యక్రియలు పూర్తయ్యాయి.

శివుడి శవానికి శేషగిరి అంత్యక్రియలు చేశాడు.

లేకపోతే మునిసిపాలిటీవాళ్లు ఆ పని చేయాల్సివచ్చేది.

సుబ్బలక్ష్మి, పార్వతి లబోదిబో మన్నారు-అలా జరగకూడదని!

"ఇన్నాళ్లూ శివుడు ఆదిశేషుగారింట్లో పెరిగాడు! వాణ్ణి దిక్కులేని వాణ్ని చెయ్యకండి!"

పార్వతి బతిమాలింది నాగరాజారావ్‌ని!

భార్య అంత్యక్రియలు నాగరాజారావు చెయ్యాలి కనక శివుడి శవానికి వేరే ఎవరయినా ఆ పని చేయాలన్నాడు పురోహితుడు.

శేషగిరి తనే ఆ పని చేస్తానన్నాడు.

పని పూర్తయ్యాక శేషగిరి భీమడోలు వెళ్ళిపోయాడు.

* * *

నాగలక్ష్మి చనిపోయి నెల్లాళ్లయింది.

నాగరాజారావ్ ఇంట్లోంచి బయటకి కదలటంలేదు.

శేషగిరిని, ఫణిని అనుమానించటం అనవసరమనిపించిందతనికి.

ఆదిశేషు తన చిన్నప్పుడు పాముని చంపాడనీ, ఆయనకి రెండురోజులపాటు కళ్లు కనిపించలేదనీ-నాగలక్ష్మి ఎప్పుడో చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి నాగరాజారావ్‌కి.

'దాని ఫలితమే ఇది'

నిర్ధారణగా అనుకున్నాడు నాగరాజారావ్.

వెంటనే సిద్ధాంతిగారికి కబురు పంపాడు.

సిద్ధాంతిగారు రాగానే సుబ్బలక్ష్మి కూడా నాగరాజారావ్ గదిలోకి వచ్చింది.

పార్వతి ఓ పక్కగా నిలబడిఉంది.

"మీరు చెపుతున్నదాన్ని బట్టి మీ కుటుంబానికి నాగదోషం ఉందనిపిస్తోంది"

చాలా సేపు ఆలోచించి అన్నారు సిద్ధాంతిగారు.

"నాగరాజారావ్‌గారూ! మీరు నాగ ప్రతిష్ట చేయించండి! మీకు పిల్లలు పుట్టక పోవడానికి; మీ అత్తగారు, మావగారు, మీ భార్యగారు పాముకాటులవల్ల చనిపోవ డానికి కారణం-నాగదోషమే! ఇంతకు మించి మార్గాంతరంలేదు!"

నాగరాజారావ్‌తో చెప్పారు సిద్ధాంతి గారు.

"నేనూ అలాగే అనుకున్నాను! లేక పోతే ఇంతదారుణం ఎట్లా జరుగుతుంది" సుబ్బలక్ష్మి అంది.

"మీ ఇష్టం! ఏం చేయించినా సరే! మా కుటుంబానికి దోషం తప్పేలా చూడండి"

నిస్సహాయంగా, మెల్లిగా అన్నాడు నాగరాజారావ్.

పదిరోజుల తరువాత కాళ్ళకూరులో వెంకటేశ్వరస్వామి గుడి పక్కనే సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయ నిర్మాణం ప్రారంభమయింది.

సిద్ధాంతిగారే వాస్తుశాస్త్ర నిపుణుల్నీ, పండితుల్నీ పిలిపించి ఆలయం కొలతలు పగయిరాలు నిర్ణయించారు.

ఖర్చు పెట్టడం నాగరాజారావ్ వంతు.

మిగతాపనంతా సిద్ధాంతిగారు దగ్గ రుండి చూసుకోసాగారు.

ఇంకెవరికోసమో తయారుచేసిన నాగ విగ్రహాన్ని రెట్టింపుధర ఇచ్చి హైదరాబాద్ నుంచి తెప్పించారు సిద్ధాంతిగారు.

పదిహేనురోజులు రాత్రింబగళ్లు పని చేయించి సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆల యాన్ని పూర్తి చేయించారు సిద్ధాంతిగారు.

మిగతా పనులన్నీ మానుకొని కాళ్ళకూరు లోనే తిష్టవేశాడు నాగరాజారావ్.

"లెక్క ప్రకారం ఉత్తరాయణంలోనే విగ్రహ ప్రతిష్ట జరగాలి! కానీ ప్రస్తుత పరిస్థితుల్లో అప్పటివరకూ ఆగటం అనవ సరం"

సిద్ధాంతిగారి మాటలకి మౌనంగా బుర్రూపాడు నాగరాజారావ్.

శైవాగమ పండితులను పిలిపించాడు.

రాగితో సుబ్రహ్మణ్య యంత్రాన్ని తయారు చేయించారు.

మూడు రోజులపాటు విగ్రహ ప్రతిష్ట కార్యక్రమం జరిగింది.

సుబ్రహ్మణ్యహోమాలు,క్షీరతర్పణం, సుబ్రహ్మణ్య జపాలతో పాటు యధా ప్రకారం నవగ్రహ జపాలు కూడా చేయిం చారు సిద్ధాంతిగారు.

డబ్బుకి వెనుకాడలేదు నాగరాజారావ్.

నాగ విగ్రహానికి జలాధివాసం, ధాన్యాధివాసం జరిగాయి.

దిగ్గజాలలాంటి వేదపండితులని రప్పిం చాడు నాగరాజారావ్.

శాస్త్రోక్తంగావిగ్రహప్రతిష్ట జరిగింది.

కళాన్యాసం జరిగింది. షోడశ కళ లన్నీ విగ్రహానికి సంక్రమింపజేశారు పండితశ్రేష్టులు.

ధ్వజారోహణ కార్యక్రమం పూర్తి అయింది.

"దీంతోఆలయప్రతిష్ట పూర్తయినట్లే" అన్నారు సిద్ధాంతిగారు.

భార్య లేకపోయినా 'ధర్మపత్నీ సమే తస్య'అని సంకల్పం చెప్పి తంతు పూర్తి చేయించారు సిద్ధాంతిగారు.

తన పక్కన బోసిగాఉన్న పీటను చూసి దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు నాగరాజారావ్.

తనకి పిల్లలు పుట్టలేదు. కనుక భవి ష్యత్తులో పెళ్ళి చేసుకుంటే నాగదోషం

లేకుండా ఉండడానికి వల్లీదేవి సహిత సుబ్రహ్మణ్యేశ్వర స్వామికి "శ్రీ పుష్ప యోగం" జరిపించారు సిద్ధాంతిగారు.

"సుబ్బారాయుడికీ, వల్లీమాతకీ గర్భా దానం జరిపిస్తే మీకుపట్టిన పుత్రదోషం పూర్తిగా తొలగిపోతుంది" అన్నారు సిద్ధాంతిగారు నాగరాజారావ్‌తో-శ్రీపుష్ప యోగం అంటేగర్భాదానమేఅని వివరిస్తూ.

వివరాలు పట్టించుకోదలుచుకోలేదు తను.

విగ్రహప్రతిష్ట పూర్తయ్యాక స్నానం చేయించి బ్రాహ్మల చేత ఆశీర్వాదం ఇప్పించారు.

'ఇక మా అబ్బాయికి ఏమీభయంలేదు' అనుకుంది సుబ్బలక్ష్మి.

ఆలయ ప్రతిష్ట చెప్పుకోదగ్గ వార్త అయింది - ఆ చుట్టుపక్కల.

అది-మాజీమంత్రి అల్లుడు కట్టించిన గుడి కావటం, ఆదిశేషు, అతని భార్య, కూతురు పాము కాటువల్ల చనిపోవటం, ఆ తరవాత నాగరాజారావ్ ఆలయ నిర్మాణం పూర్తిచేసి నాగేంద్రుణ్ని ప్రతిష్టించడం వార్తలకెక్కింది.

నాగరాజారావ్ మనసు తేలికపడింది.

'నాగవల్లి సుబ్రహ్మణ్యేశ్వర స్వామి' ఆలయం వెంకటేశ్వరస్వామి ఆలయం పక్కనే ఉండటంతో దానికి కూడా ప్రాముఖ్యం పెరిగింది.

ఆ గుడికి ప్రత్యేకంగా ఓ పూజారిని నియమించి గుడిపేర లక్ష రూపాయలు బేంక్‌లో డిపాజిట్ చేశాడు నాగరాజారావ్.

చుట్టపుచూపుగా వచ్చిన ఫణి, శేషగిరి వెళ్ళిపోయారు.

నాగరాజారావ్ గూడెం వచ్చేశాడు తల్లితోసహా!

* * *

శేషగిరి చనువుకొద్దీ ఫణితో నాగ రాజారావు తనని అనుమానించిన సంగతి చెప్పాడు.

"ముందు ఆయనగారికి నా మీద అను మానం వచ్చింది! పాముల గురించి క్షుణ్ణంగా నాకు తెలుసు కనుక నేనే నాగ వల్లిగార్ని, ఆదిశేషుగార్ని పాములచేత చంపిచానన్నారాయన! నేను లెఫ్ట్ అండ్ రైట్ ఇచ్చాను. తరువాత మీ మీద పడ్డట్టున్నారాయన"

ఫణి చెప్పాడు.

"ఆ! నేను స్నేక్ ఫార్మ్ నడుపు తున్నాను కనుక, నా దగ్గరున్న పాముల్ని వాళ్ళ మీద తెలివిగా ప్రయోగించి వాళ్ళని చంపించానట! ఒకరి తర్వాత ఒకళ్ళు చని పోవటంతో నాగరాజారావ్‌కి మతి పోయింది"

ఈసడిస్తూ అన్నాడు శేషగిరి.

పార్సిల్ చేసి ఉంచిన విషం పాకెట్లని తీసుకువద్దామని ఇద్దరూ ఫార్మ్‌కివెళ్ళారు.

గేటుదగ్గిరే స్వామి ఎదురయ్యాడు.

"సిద్ధంగా ఉన్నాయా?"

శేషగిరి అడిగాడు.

"మీ ఆఫీస్ రూమ్‌లో ఉన్నాయ్"

ముక్తసరిగా సమాధానం చెప్పాడు స్వామి.

"ఎక్కడికి పోతున్నావ్?"

స్వామిని అడిగాడు ఫణి.

"ఇవ్వాళ శనివారం! రేపు నాకు సెలవు! మా ఇంటికి వెళుతున్నాను."

స్వామి మాటల్లో అసహనం ధ్వనించింది.

అటు సూర్యుడు ఇటు పొడిచినా సరే స్వామి ఆదివారంనాడు ఫార్మ్‌లో ఉండడు. ఆ ఒక్క రోజూ ఎక్కడో

గడుపుతాడు.'ఇల్లెక్కడ' అని ఎన్నిసార్లు అడిగినా శేషగిరికి చెప్పలేదు స్వామి.

ఫణి కూడా చాలాసార్లు అడిగాడు– "సరదాగా మీ ఇంటికివస్తాను.... నిన్ను ఇక్కడ పని చేస్తున్న ఉద్యోగిగా కాక, నా తమ్ముడిలా చూసుకొంటున్నాను! నా ప్రయోగాలకి నువ్వు సాయం చేస్తున్నావు. ఆ కృతజ్ఞతతోనైనా మీఇంటికి రానియ్యి" అని.

స్వామి ఒప్పుకోలేదు.

"నా జీవితం నాది! వారానికి ఒక్క ఆదివారాన్ని, ఆ ఒక్క రోజునీ నా కోసం కేటాయించుకున్నాను. నన్ను క్షమించండి" అనేవాడు స్వామి.

అంత సిక్కచ్చిగా చెప్పాక ఫణి ఏమీ అనలేకపోయాడు.

స్వామి వెళ్ళిపోయాడు.

ఫణి, శేషగిరి ఆఫీస్ రూమ్‌లోకి వెళ్ళి అక్కడ టేబిల్ మీద సిద్ధంగా ఉన్న పార్సిళ్ళను తీసుకొని స్నేక్ ఫార్మ్‌లోంచి బయటకు వచ్చారు.

* * *

ముఖ్యమైన వ్యవహారం ఉంటే ఇంటికే వస్తున్నారు నాగరాజారావ్ గుమస్తాలు.

అతనికి సిగ్గుగా ఉంది బయటకి రావడానికి.

ఓ రోజున ఏమీ తోచక పడకగదిలోని బీరువాని సర్దాడు నాగరాజారావ్.

నాగలక్ష్మి పాత డైరీలన్నీ ఓ అరలో ఒకదానిపై ఒకటి కనిపించాయి.

నాగలక్ష్మికి డైరీ రాసే అలవాటు ఉంది. తనూ రాస్తాడు. అప్పటివరకూ ఒకళ్ళ డైరీలు ఒకళ్ళు చూసుకోలేదు. అలా ఒకళ్ళ డైరీలు ఒకరు చదవకూడదని తనే ఆమెకి చెప్పి ఒప్పించాడు. నిజానికి అతనే ఆమెకు డైరీలు రాయటం అలవాటు చేశాడు.

కుతూహలంకొద్దీ నాగలక్ష్మి డైరీ చదవటం ప్రారంభించాడు నాగరాజారావ్.

అన్నిటి కంటే పైనున్న డైరీ అందుకున్నాడు మొదట!

గబాగబా పేజీలు తిరగేశాడు.

నాగలక్ష్మి చనిపోవడానికి ముందు రోజు వరకే డైరీ రాసి ఉంది.

చివరి పేజీలో...

'శివుడిని చూస్తోంటే జాలివేస్తోంది. నాన్న వాడిని ఎంతగా నమ్మాడు? ఇది వరకు ఎంత హుషారుగా ఉండేవాడు శివుడు ? నావల్లే వాడు జీవచ్ఛవంలా ఉంటున్నాడు!'

ఆత్రుతగా వెనకాల పేజీలు తిరగేశాడు. ఓ పేజీలో...

'నాకు ఎందుకు పిల్లలు పుట్టలేదు ? అది నా తప్పా? మా ఆయన తప్పా? శారీరకంగా ఆయన్లో నాకేం లోటు కన్పించటం లేదు ! ఆయన చెప్పినట్లు ఆయన బండి మీద నుంచి పడిపోయినపుడు...?'

ఇంకో పేజీలో....

'ఎందుకో శివుడిలో నా పట్ల మార్పు కనిపిస్తోంది! వాడు నన్ను కామిస్తున్నాడా? ఇదివరకెప్పుడూ అలా కనిపించలేదు... నాగులచవితి రోజున పాముని చంపినప్పటి నుంచీ వాడి చూపులో మార్పు వచ్చింది'

తర్వాత మరో పేజీలో...

'అమ్మ చచ్చిపోయింది! నాగేంద్రుడు మా కుటుంబం మీద పగబట్టాడు. అదే నిజమైతే నాన్న, నేను, మా ఆయన కూడా పాము కాటువల్లే చచ్చిపోతామా? రాత్రిళ్లు నిద్ర పట్టటం లేదు భయంతో'

గబగబా మరికొన్ని పేజీలు తిప్పాడు నాగరాజారావ్.

'రహస్యంగా శివుడితో సుఖిస్తే తప్పేమిటి? అలాగైనా పిల్లలు పుడతారేమో నాకు! వాడికి నా మీద కన్నుపడినట్లుంది! శివుడు కూడా నా వయస్సువాడే! కాని నేను చొరవచేస్తే చులకనైపోతానేమో...'

విసురుగా ఆ డైరీని నేలకేసి కొట్టాడు నాగరాజారావ్.

భీమడోలు నుంచి రాగానే నాగలక్ష్మి శవాన్నీ, శివుడి శవాన్నీ తను గమనించాడు.

శివుడి ముఖం మీద కుంకుమ బొట్లు అక్కడక్కడ అంటుకోవటం, బుగ్గల మీద కాటుక చారికలు కనిపించటం గుర్తుకు వచ్చింది నాగరాజారావ్‌కి.

చనిపోయిన భార్య మీద పట్టరాని కోపం వచ్చిందతనికి. వెంటనే తనని తాను అసహ్యించుకున్నాడు నాగరాజారావ్.

'పిల్లల కోసం ఎంత పని చేసింది నాగలక్ష్మి! దేవుడు దానిని తగినట్లే శిక్షించాడు'

గొణుక్కున్నాడు అతను.

'ఇక నాకేం భయంలేదు! లక్ష రూపాయలు ఖర్చుపెట్టి నాగప్రతిష్ట చేయించాను! స్వామి నన్ను చల్లగా చూస్తాడు'

అనుకున్నాడు నాగరాజారావ్.

మర్నాడు అతను మామూలుగా బయటికి వెళ్ళాడు—చాలా కాలం తరవాత!

ఆ రోజు మధ్యాహ్నం నాగరాజారావ్ పేర ఇంటికి ఓ పార్సిల్ వచ్చింది.

పార్వతి బయటికి వచ్చింది.

"వేలుముద్ర వేసిస్తాను"

అంది పార్వతి పోస్ట్‌మేన్‌తో!

"అమ్మగార్ని పిలు బయటికి! ఆవిడకే ఇస్తాను పార్సిలు. ఆ తర్వాత అయ్యగార్ని దగ్గర్నించి ఆథరైజేషన్ లెటరు తీసుకుంటాలే" అన్నాడు పోస్ట్‌మేన్.

సుబ్బలక్ష్మిని పిలుచుకు వచ్చింది పార్వతి.

సంతకం పెట్టి పార్సిలును తీసుకుంది సుబ్బలక్ష్మి.

అలాంటి పార్సిలును ఆవిడ ఎప్పుడూ చూడలేదు. ట్రాన్సిస్టరు రేడియో అంత పెట్టె అది.

పైన గుడ్డకట్టి ఉంది. మధ్య మధ్యలో చిల్లులు ఉన్నాయి. కవరు వేసిన గుడ్డ కూడా చిల్లులు చిల్లులుగా ఉంది.

పార్సిలు పక్కలలో సీళ్లు ఉన్నాయి లక్కతో!

బ్లేడుతో కవరును స్వయంగానే చింపేసింది సుబ్బలక్ష్మి.

పెట్టె పైమూతకు ఉన్న కొక్కాలు అడుగు మూతకు తగిలించి ఉన్నాయి.

కొక్కేలు ఊడదీసి మూత పైకి తీసింది సుబ్బలక్ష్మి!

ధనాలున పెట్టె కింద పడేసి నాలుగయిదు అడుగులు వెనక్కి వేసింది కంగారుగా!

"ప... పాము... పాము"

పార్వతికి అర్థం కాలేదు.

"ఈ పెట్టెలో పాము ఉంది... దూరంగా జరుగు..."

అప్పటికే సుబ్బలక్ష్మి వీధి గుమ్మం వరకు వచ్చేసింది.

పార్వతి కంగారుగా సుబ్బలక్ష్మి పక్కకు చేరింది.

పెట్టెని కింద పడేయటంతో ఓ కొక్కెం వూడిపోయింది. పాము బయటికి రావటానికి ప్రయత్నిస్తోంది.

ఉండుండి పైమూత కొంచెం కొంచెం

తెరుచుకుంటోంది.

పార్వతి ధైర్యం చేసి ముందుకు వెళ్ళి కుడికాలుని పెట్టెమీద పెట్టి నొక్కిపట్టింది.

ఎడమకాలుని ఆసరాగా చేసుకొని ఆ పెట్టెని కుడికాలుతో ముందుకు గెంటు కుంటూ వీధి గుమ్మంలోంచి పగండాలోకి వచ్చింది.

లోపల పాము కొట్టుకుంటున్న చప్పుడు వాళ్ళకి వినిపిస్తోంది.

గదికీ గదికీ మధ్య గడపలూ, గుమ్మాలూ లేకపోవటం వల్ల పార్వతి పని తేలికయింది.

తిరగలి రాయిని తోసుకు వచ్చింది సుబ్బలక్ష్మి.

పార్వతి ఆ రాయిని పెట్టెమీద పెట్టింది.

ఆవెంటనే నిర్భయంగా ఊపిరి తీసు కొని కొడుక్కి ఫోన్ చేసింది.

అప్పుడే ఫణి వచ్చాడు— నాగరాజా రావ్ ఇంటికి.

నాగరాజారావ్ ఆఫీసుకి వెళ్ళిపోయా డని చెప్పింది సుబ్బలక్ష్మి.

తరువాత పోస్టులో ఏదో పార్సిల్ రావడం, తాను సంతకంచేసి పార్శిల్ తీసు కోవటం, పెట్టెలో పాముండటం, దాన్ని వీధివరండాలోకి గెంటెయ్యటం ... వగైరాలు అన్నీ పూసగుచ్చినట్లు వివరంగా చెప్పిందావిడ ఫణితో.

హాలులో ఓ మూలగా పడివున్న పార్సిలుకవరుని చూశాడు ఫణి.

దాన్ని అందుకొని పరిశీలించాడు.

గుడ్డమీద కాగితం అంటించిఉంది. ఆ కాగితంమీద నాగరాజారావ్ అడ్రసు రాసిఉంది.

ఆ చేతి రాత ఎక్కడో చూసినట్లు అని పించింది ఫణికి.

మనస్సులో ఎవరో మెరిశారు!

ఎవరో తరుముతున్నట్లు... "నేను వెళ్లొస్తాను! అర్జంటుగా పని తగిలింది... నాకు లెక్చరర్‌గా హైదరాబాద్‌లో ఉద్యోగంవచ్చింది! ఈ విషయం చెబుదా మనే వచ్చాను" అంటూ హడావుడిగా వెళ్లి పోయాడు ఫణి.

సుబ్బలక్ష్మి ఆశ్చర్యపోయింది.

"ఎందుకు వచ్చినట్లు? ఎందుకు వెళ్ళి నట్లు?" పార్వతితో అన్యాపదేశంగా అందావిడ.

ఫణి తనతోకూడా పార్సిలు కవరును తీసుకువెళ్ళాడని పార్వతి మాత్రమే గమ నించింది.



## 12

ఫోన్ మోగటంతో శేషగిరి ఫోన్ అందు కున్నాడు. ఆ ఫోన్ రాబర్ట్ దగ్గర్నుంచి వచ్చింది.

రాబర్ట్ నెలకీ, రెండు నెలలకీ హైదరా బాద్ వస్తూంటాడు. పాముల్ని స్మగుల్ చేసి తీసుకురావటం అతని వృత్తి.

ఇప్పుడు దక్షిణ మెక్సికోలో ఉండే రెండుజతల పాముల్ని తీసుకువచ్చాడు.

ఆ మాట వినగానే శేషగిరి ముఖం విప్పారింది. అక్కడి పాములకు విషం ఎక్కువని అతనికి తెలుసు.

"సరే అయితే! రేపు సాయంత్రానికి నేను హైదరాబాద్ వస్తున్నాను"

రాబర్ట్‌తో చెప్పాడు శేషగిరి.

అంతలో అతనికి కాళ్ళకూరులో దొరికిన డెండ్రో యాస్పిస్ పోలిలెపిస్ పాము జ్ఞాపకం వచ్చింది.

"ఈమధ్య నాకు ఓ ఆఫ్రికన్ స్నేక్ దొరికింది! వాటి ఖరీదు ఎలాఉంది మార్కెట్లో"

ఫోన్‌లో అవతల రాబర్ట్ ఓ క్షణం మాట్లాడలేదు. తన ప్రశ్నకి రాబర్ట్ ఆశ్చర్యపోయాడని శేషగిరికి తెలియదు.

"దొరకటమేమిటి? నేనే దాన్ని మీకు అమ్మానుకదా? ఆ ఆఫ్రికన్ పాముని, కింగ్‌కోబ్రా జంటని, మరో రైన్‌బౌబోవా కన్‌స్ట్రిక్టర్‌ని సప్లయిచేశాను. రైన్‌బౌబోవా కొండచిలువ జాతిది"

ఈసారి ఆశ్చర్యపోవటం శేషగిరి వంతైంది. వాటిని తాను రాబర్ట్ దగ్గర కొన్నట్టు అతనికి ఎంత ఆలోచించినా గుర్తురాలేదు.

"లేదు రాబర్ట్! ఈమధ్య మనం కల



వనే లేదు. ఆరునెలల క్రితం కాబోలు హైదరాబాద్‌లో మనం కలిశాం. అప్పుడు కూడా నీదగ్గర ఏమీ లేవని చెబితే నేను ఊరుకున్నాను"

వెంటనే రాబర్ట్ సమాధానం చెప్పాడు.

"బాగా జ్ఞాపకం తెచ్చుకోండి! నేను వాటిని మీకు డైరెక్ట్‌గా సప్లై చేయలేదు. నాలుగు నెలల క్రితం... మీ మనిషి ఒకడు వచ్చాడు నాదగ్గరకి. అప్పుడు నేను వచ్చినట్టు ఫోన్ చేస్తే మీరు లేరు ఆఫీసులో. ఆ వ్యక్తే ఫోన్ రిసీవ్ చేసు కున్నాడు. మర్నాడు అతను మీ లెటర్ హెడ్ మీద మీరు తనని పరిచయం చేస్తున్నట్టుగా ఉన్న ఉత్తరం పట్టుకు వచ్చాడు. మొత్తం ఫోర్ స్పైసెస్. ఏడు వేల రూపాయలు బిల్లు అయింది. నేను డబ్బు అందుకున్నట్టు స్లిప్ మీద సంతకం పెట్టి ఇచ్చాడు"

శేషగిరికి ఆ మాట విని రక్త ప్రసరణ ఆగిపోయింది. కొంపతీసి ఫణికాదుగదా అనుకున్నాడతను. "మీరు చెబుతున్నది నిజమా? నేను అతనిని ఇంట్రడ్యూస్ చేస్తూ రాసిచ్చిన ఉత్తరం మీదగ్గర ఉందా?

"ఆ! ఉండే ఉంటుంది ఎక్కడో! వెతికితే దొరుకుతుంది. ఏం? అతను మీరు పంపిన వ్యక్తి కాదా?"

"ఏమోమరి! గుర్తు రావట్లేదు! ఇంతకీ ఎలా ఉంటాడతను?"

"అతనా.... పేంటు వేసుకున్నాడు. సిల్కు లాల్చీ తొడుక్కున్నాడు. కుడి చేతి మీద కోబ్రా పచ్చబొట్టువుంది. అతను చుట్ట కాలుస్తాడు. ఆరోజున చుట్ట అంటించుకొంటుంటే అగ్గిపుల్ల అతని చొక్కా మీద పడింది. లాల్చీ కుడిచేతిమీద కొంచెం చిల్లు పడింది. అప్పుడే చూశాను–

అతను చొక్కా చేతిని పైకిలాక్కుని నెరుసు పడిన చోట చేత్తో రబ్ చేస్తోంటే"

శేషగిరి ముఖం వెలవెలపోసాగింది.

"అతని మెళ్ళో తాయెత్తు ఉంది. ఎడమ చేతి మధ్యవేలుకి ఓ ఉంగరం– ఆ ఉంగరంమీద పాముబొమ్మ! మాటి మాటికీ అతను ఆ ఉంగరాన్ని ముద్దు పెట్టుకున్నాడు.... చాలా విచిత్రం అని పించింది అతని ప్రవర్తన"

రాబర్ట్ చెప్పిన ఆ వ్యక్తి వర్ణన విని తనని తాను నమ్మలేకపోయాడు శేషగిరి.

"సరే సరే, నేను రేపు సాయంత్రానికి అక్కడికి వస్తున్నాను! వీలయితే ఆ ఉత్తరం వెదికి జాగ్రత్త చేయండి" శేషగిరి ఫోన్ పెట్టేసి మతి స్థిమితం పోయిన వాడిలా పిచ్చిగా జుట్టు పీక్కుని కుర్చీలో వెనక్కి వాలిపోయాడు.

"కోరలు పీకిన పాములా అలా డీలా పడిపోయావేమిటి?" ఫణి గదిలోకి వస్తూ శేషగిరిని వేళాకోళం చేశాడు. పావుగంట క్రితమే అతను గూడెంనుంచి భీమడోలు వచ్చాడు. సరాసరి శేషగిరి ఆఫీసుకే వచ్చే శాడు ఫణి.

"రాబర్ట్ ఫోన్‌చేశాడు! మనకి కాళ్ళ కూరులో దొరికిన డెండ్రో యాస్పిస్ పోలీలెపిస్‌నీ, గూడెంలో నాగరాజారావు ఇంటిదగ్గర దొరికిన కింగ్ కోబ్రానీ అతను మన కంపెనీకి అమ్మానంటున్నాడు. నేను వెళ్ళి అతని దగ్గర్నుంచి వాటిని కొనలేదు"

కళ్ళు తెరవకుండానే ఫణి రాక గమ నించి అన్నాడు శేషగిరి.

"ఇదిగో! ఈ రైటింగ్ చూడు! దీన్ని గుర్తుపట్టగలవా? నాగరాజారావు మనల్ని అనుమానించటంలో తప్పేమీ లేదనే అని పిస్తోంది! అతని ఊహ కరెక్టే అయింది"

ముఖంమీద పాము బుసకొట్టినట్టు భయంతో వణుకుతూ కళ్ళు తెరిచాడు

శేషగిరి. ఫణి ఇచ్చిన పార్సిల్ కవరు గుడ్డమీద అంటించి ఉన్న కాగితం అడ్రసును పరిశీలించసాగాడు.

నాగరాజారావు ఇంటి అడ్రసు మాత్రమే ఉంది ఆ కాగితంమీద.

"మైగుడ్‌నెస్... ఈ చేతిరాత..."

అంతలో ఫోన్ మోగటంతో శేషగిరి ఎడమ వైపు తిరిగి ఫోన్ అందుకున్నాడు.

నాగరాజారావు దగ్గర్నుంచి వచ్చిందా ఫోను.

తన పేరుమీద ఎవరో ఓ పెట్టెని పార్సిల్‌లో పంపారనీ, అందులో పాము ఉందనీ చెప్పాడు నాగరాజారావు.

"మైడియర్ బ్రదరిన్లా! ఇంకా నీకు నామీద అనుమానంగానే ఉందా? నీకు నేను పాముల్ని పంపటం వల్ల నాకేమీ కలిసిరాదు. పైపెచ్చు అవి నా దగ్గరే ఉంటే నెలనెలా నాకు సొమ్ము చేసి పెడతాయి"

అసహనంగా ఫోన్ పెట్టేశాడు శేషగిరి. తానే ఆ పెట్టెను పంపానని నాగరాజారావు భ్రమలో పడుతున్నాడనుకున్నాడు శేషగిరి.

"నాకు ఉద్యోగం వచ్చిందని పర్సనల్‌గా నాగరాజారావుతో చెబుదామని గూడెంలో వాళ్ళింటికెళ్ళాను. సుబ్బలక్ష్మి గారు చెప్పారు...నాగరాజారావు పేర ఏదో పార్సిలు వచ్చిందనీ, అందులో పాము ఉందనీ! అనాలోచితంగా పెట్టెమీద కవరును చూశాను! ఈ హేండ్ రైటింగ్ చూడగానే నాకు మతిపోయింది...."

ఫణి చెప్పాడు.

హఠాత్తుగా వాచీ చూశాడు శేషగిరి.

"అరే! ఆరయింది! త్వరగానడు... ఫార్మ్‌కి వెళ్దాం"

దెబ్బతిని తప్పించుకోబోతున్న పాములా గబగబా ఆఫీసునుంచి బయటికి వచ్చాడు శేషగిరి. ఫణి అతన్ని అనుసరించాడు.

దోవలో ఇద్దరూ మాట్లాడుకోలేదు. రిక్షావాడిని తొందరపెట్టసాగాడు శేషగిరి త్వరత్వరగా పోనివ్వమని!

స్నేక్‌ఫార్మ్ గేటు ముందు ఇద్దరూ రిక్షా దిగారు. రిక్షావాడికి డబ్బులిచ్చేసి గేటు తీయబోయి చటుక్కున పక్కకి తప్పుకున్నాడు శేషగిరి-ఫణిని కూడా పక్కకులాగుతూ!

ఫార్మ్‌లోంచి బయటివేపు అడుగులు వేసుకొంటూ తలవంచుకొని వస్తున్న వ్యక్తిని చూపించి ... 'వాడిని వెళ్ళనీ' అన్నట్టు సైగచేశాడు.

గబగబా వాళ్ళిద్దరూ అక్కడినుంచి దూరంగా వెళ్ళిపోయారు.

కాస్సేపటికి పేంటూ, లాల్చీ తొడుక్కున్న వ్యక్తి స్నేక్‌ఫార్మ్ గేటు తీసుకుని బయటకు వచ్చాడు.

రోడ్డెక్కి భీమడోలు వంతెనవేపు నడక సాగించాడతను.

వంతెనకు ఎడమవేపున ఉన్న రైల్వే గేట్‌లోంచి ఊళ్ళోకి వెళ్ళేదోవ పట్టాడు. అలా, అలా భీమడోలు జంక్షను వరకూ వెళ్ళాడు.

అక్కడ నల్లజర్ల రోడ్డుక్రాస్ అవుతుంది. కుడివేపు వెళితే నల్లజర్ల, ఎడమ వేపు వెళితే ఏలూరురోడ్డు తగులుతుంది.

తిన్నగావెళితే చిన్నతిరుపతి వస్తుంది.

ఆ జంక్షనులో రోడ్డుకు అవతల, తిరుపతిరోడ్డుకి ఎడమవేపున ఉన్న బడ్డీ హోటల్లో టీ తాగాడు.

తరువాత జరదాకిళ్ళీ నములుతూ తిరుపతిరోడ్డు పట్టాడు.

పొలిమేరలుదాటాక రోడ్డుకి దూరంగా

బీడుపొలంలోఉన్న పాడుబడిన మేడలోకి వెళ్ళాడు.

ఆ మేడ పూర్తిగా శిథిలమైపోయిఉంది.

బాగా వెనకాల ఒక్కగది మాత్రం అంతంతమాత్రంగా ఉంది.

రెండు పెద్దపెద్ద తడికలని పైకప్పుగా ఆ మొండిగోడలపై వేసిఉన్నాయి. మరో తడిక ఆగదికి తలుపుగా అమర్చి ఉంది.

అటూఇటూ చూసి అతను ఆ గదిలో అడుగుపెట్టాడు-నిశ్శబ్దంగా తడిక తలుపుని ఇవతలకులాగి!

అతన్నే అనుసరించివస్తున్న ఫణి, శేషగిరి రోడ్డుమీదే ఆగిపోయారు.

అప్పటికి బాగా చీకటిపడింది.

తెగించి ఇద్దరూ ముందుకు అడుగు వేశారు.

మేడ దగ్గిర పడినకొద్దీ వాళ్ళకి అడుగులు తడబడసాగాయి. కాళ్ళకింద ఎర్ర రాళ్లు గరగరలాడుతున్నాయి.

జనసంచారంలేదు. అడపాదడపా ఒకటీ అరా బస్సులూ, లారీలూ తిరుగుతున్నాయి.

ఆగి, ఆగి జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ, మొండిగోడల్ని తడుముకుంటూ ముందుకు కదులుతున్నారు శేషగిరి, ఫణి.

తడికలోంచిసన్నని వెలుతురు మెరుస్తూ బయటికి వస్తోంది.

అటే వెళ్ళారు వాళ్లు.

తడిక చిల్లులోంచి లోపలికి తొంగి చూశాడు శేషగిరి.

లోపల హరికేన్ లాంతరు వెలుగులో ఓ పుస్తకంలో ఏదో రాసుకుంటున్నాడు పేంటూ, లాల్చీ వేసుకున్న వ్యక్తి.

ఒక్కసారిగా ఆ తడికనుపట్టి బయటకి లాగాడు శేషగిరి.

జరజరమంటూ తడిక చప్పుడు చేసింది ఆ నిశ్శబ్దంలో...భయంకరంగా!

చివాలున లేచి నిలబడి "ఎవరు? ఎవరది?" అన్నాడతను కంగారుగా!

శేషగిరిని, ఫణిని గుర్తుపట్టేశాడతను.

"మి...మీరా?"

అంతకు మించి అతను మరేమీ మాట్లాడలేకపోయాడు.

"బ్రా! మేమే ... రాస్కెల్! నిన్ను...నిన్ను ఇక్కడికిక్కడే చంపేసినా పాపం లేదు"

క్షణం కూడా ఆలస్యం చేయకుండా శేషగిరి అతన్ని బలంగా వాటేసుకొని వాడి చంకల కింద నుంచి చేతులు పోనిచ్చి అరిచేతులతో వాడి మెడని వెనక్కి వంచసాగాడు.

అతను వీలు చేసుకొని చేతుల్తో శేషగిరి కంఠాన్ని నులిమెయ్యబోయాడు.

ఫణి లోపలికి పరుగెత్తి వాడి చేతులు రెండూ వెనక్కి మెలిపెట్టి, గుత్తులు రెండూ జేబురుమాల్తో కట్టేశాడు.

అతను తీవ్రంగా పెనుగులాడసాగాడు తప్పించుకోవాలని!

ఆ గదిలో మొత్తం పది పాము పంజరాలు ఉన్నాయి. రాబర్ట్ చెప్పిన కొండచిలువతో సహా రకరకాల పాములు ఆ పంజరాల్లో రకరకాల ఆకారాల్లో, రంగుల్లో కనిపిస్తున్నాయి.

అతను రాసుకొంటున్న నోట్ బుక్‌ని ఫణి అందుకున్నాడు.

హరికేన్ లాంతరు వెలుగులో పుస్తకంలోని పేజీలను అక్కడక్కడ చదివాడు ఫణి.

అతనికి ఆదిశేషు కుటుంబంమీద ఎంత కసి, ద్వేషం ఉందో అర్థమవుతోందతనికి.

చివరగా ...ఓ పేజీలో...ఆ పేజీలో రాస్తున్నపుడే శేషగిరి ఆ లాల్చీ వ్యక్తిని పట్టుకున్నాడు.

"ఈపాటికి నాగరాజారావ్ నేను పంపిన పార్సిల్లోని పామువల్ల చచ్చి ఉంటాడు. రేపటికి కాని ఏ విషయమూ తెలియదు. ఇంతటితో నా పగ చల్లారినట్లే! సుబ్బలక్ష్మి జోలికి వెళ్ళటం అనవ..."

అని ఉంది. చివరి అక్షరం తలకట్టు పాము తోకలా బాగా సాగిపోయింది.

అక్షరాలు పొందికగానే ఉన్నాయి కాని గుండ్రంగా లేవు. ఆ రాతకీ, నాగరాజారావ్‌కి వచ్చిన పాము పార్సిలుమీద ఉన్న అడ్రసు రాతకి ఖచ్చితంగా పోలికలు సరిపోయాయి.

"రాబర్ట్ ఫోన్ చేసి పేంటూ, లాల్చీ వేసుకున్న వ్యక్తి తన దగ్గరకి నా తరఫు నుంచి వచ్చాడని చెప్పినపుడే నీమీద నాకు అనుమానం వచ్చింది. ఫణి తెచ్చిన అడ్రసు చూశాక దాన్ని నువ్వే పంపావని అర్థమైంది" అన్నాడు శేషగిరి.

"నేను గూడెంలో పార్సిలు కవరును చూసినపుడే ఇది నీ పనే అనిపించింది నాకు! ఇంతవరకూ నీ గురించి కొంచెం కూడా అనుమానం రాలేదు" ఫణి అన్నాడు.

ఆ వ్యక్తి స్వామి!



**13**

స్వామిని తీసుకొని ఆఫీసుకి వచ్చేసరికి రాత్రి తొమ్మిదయింది.

అప్పటికప్పుడు నాగరాజారావ్‌కి ఫోన్ చేసి వెంటనే అతన్ని భీమడోలు రమ్మని చెప్పాడు శేషగిరి.

ముందు చిర్రుబుర్రులాడినా, తరవాత బయల్దేరి వస్తున్నానని చెప్పాడు నాగరాజారావ్.

అరగంట తరవాత నాగరాజారావ్ శేషగిరి ఆఫీసుకు వచ్చాడు. తనకి గూడెం అడ్రసుకు వచ్చిన పాముల పెట్టెను కూడా తీసుకు వచ్చాడు... జాగ్రత్తగా!

ఆఫీసు బయట నలుగురు కానిస్టేబుల్స్ ఉన్నారు. అప్పటికి పోలీస్ ఇన్‌స్పెక్టర్‌ని కూడా రప్పించాడు శేషగిరి.

శేషగిరి ఆఫీస్ గదిలో అతనితో పాటు ఫణి, ఇన్‌స్పెక్టర్, నాగరాజారావ్ కూర్చుని వున్నారు.

స్వామి ఓ మూలగా నిలబడేఉన్నాడు. అతనిచేతులు ఇంకా వెనక్కి విరిచికట్టేసే ఉన్నాయి.

స్వామి కళ్ళు విషం చిమ్ముతున్నాయి.

మనిషి రూపంలో ఉన్న పాములా గుర్రుగా ఉన్నాడు స్వామి.

ఆక్రోశంతో, సిగ్గుతో అతని శరీరం సన్నగా వణుకుతోంది.

"మంచినీళ్ళు కావాల

పొడి గొంతుకతో జనాంతికంగా చెప్పాడు స్వామి.

ఇన్‌స్పెక్టర్ స్వయంగా నీళ్ళు తాగించాడు స్వామిచేత.

నీళ్ళుతాగి స్వామి అన్నాడు-

"నన్ను మీరు అడగబోయేది ఏమిటో తెలుసు. నేను ఆదిశేషు కొడుకుని"

అందరూ చివాలున తలెత్తి స్వామి

వైపు చూశారు ఆశ్చర్యంగా!

"అవును! మాజీమంత్రి, కీర్తిశేషలు ఆదిశేషు కొడుకుని నేను.

అవును! మాఅమ్మని ఆవెధవ ఉంచు కున్నాడు. నేను పుట్టటానికి సంవత్సరం ముందు వాడు మాఅమ్మని పాడుచేశాడు. నేను పుట్టినతరవాత సంవత్సరానికి మా అమ్మని తన ప్రాపకంలో ఉంచుకున్నాడు.

మా అమ్మ పేరు నాగమ్మ. మేము సీస లలో ఉండేవాళ్ళం. మా నాన్న కూలిపని చేసేవాడు. నేను పుట్టటానికి సంవత్సరం ముందు పంచాయితీ ఎన్నికలు జరిగాయి. సీసల సర్పంచ్ ఆదిశేషుకు దగ్గరచుట్టాలు. అప్పటికి ఆదిశేషుకి రాజకీయాల గురించి అంతగాతెలియదు. సీసల్లోనే మా అమ్మని మొదటిసారి పాడుచేశాడు ఆదిశేషు. సర్పంచ్‌గా నెగ్గినందుకు ఆదిశేషుకు విందు చేశాడు సీసల సర్పంచి. మా అమ్మ ఆ ఇంటికి ఆరోజున పనికివెళ్ళింది. ఆదిశేషు బాగా తాగేసిఉన్నప్పుడు మా అమ్మ వాడి కళ్ళలోపడింది. డబ్బున్నవాళ్ళకి, వాళ్ళ కుక్కలకీకూడా ఎదురుతిరగలేని పరిస్థితి మాది.

మా అమ్మ చెడిపోయిందని ఊళ్ళో తలెత్తుకోలేక మానాన్న ఆత్మహత్య చేసు కున్నాడు. 'ఇప్పుడు నేనేం చేయాలి' అని అడిగింది మాఅమ్మ ఆదిశేషుని.

'మరీమంచిది! నువ్వు ఎలా తిరిగినా అడిగేవాళ్ళులేరు' అన్నాడు ఆదిశేషు.

సీసలలో ఉండటం ఇష్టంలేక మా అమ్మ భీమవరం వచ్చేసింది. అలవాటైన కూలిపని ఉండనే ఉంది.

నేను పుట్టాను. ఆరేళ్ళు పెరిగాను.

ఓరోజున నన్ను వెంటబెట్టుకొని అమ్మ కాళ్ళకూరు వెళ్ళింది. ఆరోజునే నాగలక్ష్మి పుట్టింది. అమ్మని చూసి బయటకు తరిమేసి నంత పని చేశాడు ఆదిశేషు.

అప్పటికి ఆదిశేషు రాజకీయాల్లో తిరగటం ప్రారంభించాడు.

కనీసం నా జీవితానికైనా ఓ దారి చూపించమని అడిగింది అమ్మ—ఆదిశేషుని. అమ్మనూ, నన్నూ ఊరికి దూరంగా ఉన్న పొలం తీసుకు వెళ్ళాడు ఆదిశేషు.

పొలంలో ఓ దిబ్బమీద రెండు గదుల పెంకుటిల్లు ఉంది. అది ఆదిశేషు రాచ కార్యాల కోసం కట్టించుకున్నది.

ఓ గదిలో టేబులు, నాలుగు కుర్చీలు ఉన్నాయి. రెండోగదిలో పట్టెమంచం... దానిమీద పరుపు!

నాలుగురోజులు మేం అక్కడే ఉన్నాం.

రోజూ కారేజీలో అన్నం వచ్చేది రెండు పూటలా! అయిదోరోజున అమ్మనీ, నన్నూ సినిమాకి భీమవరం పంపాడు ఆదిశేషు.

ఆరాత్రి ఇద్దరం మళ్ళీ కాళ్ళకూరు వచ్చేశాం ఆ ఇంటికి! అప్పటికే ఆదిశేషు టేబులు ఉన్నగదిలో కూర్చుని ఉన్నాడు.

కాస్సేపు ఏవేవో కబుర్లు చెప్పాడు ఆదిశేషు అమ్మతో.

తరవాత 'మీరు ఆగదిలో పడుకోండి! నేను మళ్ళీ వస్తాను... ఓసారి ఇంటికి వెళ్ళి' అని చెప్పేసి ఆదిశేషు వెళ్ళి పోయాడు.

ఎందుకోకాని అమ్మ దుప్పటిపరిచి ఇవతలిగదిలో నన్ను పడుకోబెట్టింది.

నాకు నిద్రపట్టింది.

అంతలోనే ఉలిక్కిపడి నిద్రలేచాను.

అమ్మ అరుస్తోంది... 'తలుపుతియ్యి! తలుపుతియ్యి' అని!

గబగబా నేను గదిబయటకు వెళ్ళాను. రెండోగది తలుపులకు ఇవతల

గొళ్ళెంపెట్టి ఉంది. బయట ఆదిశేష, మరొకడు నిలబడి ఉన్నారు.

రానురాను అమ్మ భయంకరంగా అరుస్తోంది తలుపులు తియ్యమని.

అంతలో...

'పాము ... పాము...' అంది అమ్మ లోపల్నించే! ఆదిశేష వికృతంగా నవ్వుతున్నాడు.

దబాదబా తలుపులు బాదుతోంది అమ్మ.

'నీకూ, నాకూ ఇవాళ్టితో పీడవిరగడవుతుంది...'

అని ఆదిశేష రంకెలు వేస్తున్నాడు. ఆదిశేషని, అతని పక్కనే వున్న మరొకడిని బతిమాలాను తలుపు తియ్యమని!

నన్ను విదిలించికొట్టాడు ఆదిశేష.

వాడి మీదపడి కరిచాను.

రెండు చేతుల్తోనూ ఎత్తి నన్ను దూరంగా విసిరికొట్టాడు.

నాకు స్పృహ తప్పింది.

స్పృహ తప్పేముందుకూడా అమ్మ 'పాము...పాము...నన్ను కరిచేసింది... తలుపుతియ్యి' అని అరవటం వినిపించింది.

మళ్ళీ నాకు స్పృహ వచ్చేసరికి అమ్మని వాళ్ళిద్దరూ మోసుకుని ఇంటి వెనక్కి తీసుకువెళ్తున్నారు.

"అవును. నువ్వు చెప్పింది నిజమే. ఇది పాము కరచి చచ్చిపోయిందంటే ఎవరూ నమ్మరు...పైగా మనపొలంలో. నువ్వు చెప్పినట్లు పేడఎరువుకోసం తీసిన గోతిలో దీన్ని కప్పెట్టేద్దాం" అంటున్నాడు ఆదిశేష - అమ్మని కాళ్ళవైపు పట్టుకుని మోస్తున్న అతనితో.

అమ్మ ముఖం నల్లగా తయారయింది. నోటి నుంచి వచ్చిన నురగలు ఎండి చారికలు కట్టాయి.

నేను పరుగెత్తుకొని అటువైపు వెళ్ళాను. ఇంటివెనుక ఓ గొయ్యితీసి ఉంది. గోతిలో చచ్చిపడిన పాము ఉంది. అమ్మని కూడా ఆ గోతిలోవేసి పూడ్చిపెట్టేశారు.

అమ్మని చంపటానికి సాయం చేసిన ఆ రెండో వ్యక్తి శివుడి తండ్రి.

పాముకాటువల్ల అమ్మ చచ్చిపోయిందని అర్థమయింది నాకు.

ఎందుకోమరి-అక్కడ ఉంటే నన్ను కూడా చంపేస్తారనిపించింది నాకు.

పారిపోయి వచ్చేశాను.

నాగురించి వాళ్ళు పట్టించుకోలేదు. సినిమాకు వెళ్ళినపుడు నేను ఏడిస్తే అమ్మ నాకు ఓ రూపాయి ఇచ్చింది. ఆరూపాయి అప్పుడు నా జేబులోనే ఉంది.

నేను భీమవరం వచ్చేశాను. జాగ్రత్తగా మా ఇంటికి వెళ్ళాను.

నాకు తెలిసి బంధువులెవరూ లేరు నాకు. అప్పటినుంచి గాలికి పెరిగాను. అనుకోకుండా పాములవాళ్ళతో స్నేహం కలిసింది.

పాముల్ని వడుపుగా పట్టటం, చంపడం నేర్చుకున్నాను.

ఎలాంటి పాములకి ఎలా విషం తీయాలో తెలుసుకున్నాను.

ఆదిశేష క్రమక్రమంగా పెద్ద నాయకుడైపోయాడు. వాడు మంత్రి కావటం, వాడి అవినీతి, బంధుప్రీతి, లంచాలు, ఆస్తులు,హత్యలు,మానభంగాలు ఇవన్నీ నేను గమనిస్తూనే ఉన్నాను.

నాగేంద్రుడు ఆదిశేష కుటుంబానికి ఇలవేల్పు అని తెలుసు నాకు.

పాములు పగపడతాయని మన నమ్మకం. అది అబద్ధం...పాములేకాదు, ఏ జంతువూ పగపట్టలేదు-మనిషి తప్ప!


నేను పగపట్టాను!
నేను శేషగిరి ఫార్మ్‌లో చేరాను. ఆ తర్వాత నా గురించి మీ కందరికి బాగానే తెలుసు.
ఈవేళ్టి వరకు నామీద మీకెవరికీ అనుమానం రాలేదు. అంత మంచివాడుగా నడుచుకున్నాను.
మీరంతా అనుకుంటున్నట్టు ఆఫ్రికా పాము వల్ల నాగవల్లి చచ్చిపోలేదు. ఆవిణ్ని



కాటువేసినది మామూలు తాచుపామే.

ఆరోజు ఆదివారం కావటం నాకు బాగా కలిసి వచ్చింది. నాగవల్లిని పాము కాటు వేసిన తరవాత పార్వతి అటు పక్క నించి ఇంట్లోకి వెళ్ళి మిగతావాళ్ళతో ఆ విషయం చెప్పింది. ఈలోగా నేను ఆ పాముని పట్టుకుని ఆ ఇంటినించి చల్లగా జారుకున్నాను.

నాగవల్లి చనిపోయిన మర్నాడు కాళ్ళకూరు ఇంటి పెరట్లో ఆఫ్రికా పామును వదలటానికి కారణం-ఎవరికైనా

అనుమానం వస్తే అది శేషగిరిమీదకు కొట్టుకుపోతుందని ఆలోచించటమే!

నాగవల్లి చనిపోయిన రెండుగంటల్లో గూడెం వచ్చేశాను.

శివుడు నాగవిహార్‌లో ఉన్నాడని నాకు తెలుసు. అందుకే కోబ్రాజంటలో ఒకదాన్ని ఆ ఇంటి మెట్లమీద వదిలాను.

నేను ఊహించినట్టే శివుడు ఆ పాముని చంపేశాడు. ఆ రోజున ఆ ఇంట్లో నేను ఎవర్నీ చంపదల్చుకోలేదు. కేవలం భయ పెడదామని మాత్రం అనుకున్నాను.

ఆదిశేషు అంత్యక్రియలయ్యాక నాగ రాజారావ్ గూడెం వచ్చినరోజున పడక గదిలోంచి రెండో కోబ్రానీ నేనే వదిలాను. ఆ రోజూ ఆదివారమే.

ఆ రెండో కోబ్రాని నేనే పట్టుకున్నాను. అంతకు ముందు కాళ్ళకూరులో శేషగిరి తెచ్చిన పామునీ నేనే పట్టుకున్నాను. అందువల్లే నామీద ఎవరికీ అనుమానం రాలేదు.

నాకు ఖర్చులేమీలేవు. నాకు శేషగిరి నెలకు నాలుగువందలు ఇస్తున్నాడు. వారంలో ఆరు రోజులు నా తిండి ఖర్చు కూడా ఆయనే భరిస్తున్నాడు.

శేషగిరి ఇచ్చే జీతం డబ్బులను ఆదా చేసి రాబర్టు దగ్గిర ఏడువేలు పెట్టి నాగుపాముల్నీ, కొండచిలువనీ, ఆఫ్రికా పామునీ కొన్నాను.

మన నాగు పాములుకంటే విదేశాల్లోని పాములు సైజులో పెద్దవి. అందుకే వాటిని ప్రయోగించాను.

ఆదిశేషుని గూడెం తీసుకొచ్చేశాక గ్రహశాంతి చేయించి, నాగరాజారావు, సుబ్బలక్ష్మి సుబ్రహ్మణ్యేశ్వరస్వామి గుడికి వెళ్ళినపుడు నేనే ఓ పాములపెట్టెని ఆదిశేషు మంచంమీద పెట్టి మూత తెరిచి బయటికి వచ్చేశాను. అప్పుడు సుబ్బలక్ష్మి, పార్వతి వేరే గదులలో ఉన్నారు.

నేనెవర్నో ఆదిశేషుకి ఎలా గూ తెలీదు. పైగా వాడు నన్ను గుర్తుపట్టే స్థితిలోనూ లేడు. ఆదిశేషు చచ్చిపో యింది కూడా ఆదివారమే.

నాగరాజారావ్‌కి శేషగిరిమీద, ఫణి మీద నేను ఊహించినట్టే అనుమానం వచ్చింది. స్నేక్ ఫార్మ్‌కి వచ్చి ఫణితో గొడవపడ్డాడు నాగరాజారావ్.

తర్వాత నాతోకూడా వచ్చి పాముల నుంచి విషం తీయటం చూశాడు. అక్కణ్ణించి ఆఫీసుకు వెళ్ళి శేషగిరి కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

ఆ రోజు శనివారం. శేషగిరితో పనుందనిచెప్పి గూడెం బయలుదేరి వెళ్ళేను.

సుబ్బలక్ష్మి, పార్వతి ఇంట్లోలేరు. సన్నగా వర్షం పడుతోంది. నాగలక్ష్మి పడకగదిలో ఉంది. ఆ తరవాత శివు డొచ్చాడు.

నిజానికి ఆరోజున శివుణ్ని చంపాలని నేను అనుకోలేదు. కానీ ఎప్పటికైనా వాణ్ని చంపటం తప్పదు. మా అమ్మ చావుకి శివుడి తండ్రి కారకుడవటమే వాడు చేసిన పాపం.

అమ్మని చంపటంలో సాయపడిన శివుడి తండ్రిని ఆదిశేషే చంపించాడు-తన రహస్యం బయటపడకుండా! అందుకే ఆదిశేషు శివుణ్ని చేరదీశాడు.

శివుణ్ని మామూలుగా చంపుదామను కోలేదు. వారసత్వంగా శివుడికి పాముల్ని పట్టడం, చంపడం బాగా వంటపట్టాయి.

శివుడి తండ్రి ఆదిశేషు దగ్గర పని చేస్తున్నా వాడి అసలు వృత్తి పాముల్ని పట్టటమే.

శివుణ్ని ఒక్క పాముతోకాక మూడు నాలుగు పాములతో కరిపించి చంపుదామనుకున్నాను. కానీ ఆ రోజున అవకాశం కలిసిరావటంతో చడీచప్పుడు చేయకుండా నాగలక్ష్మి, శివుడు ఒకే గదిలో ఉన్నపుడు వీధి గుమ్మంలోంచి వెళ్లి తీసిఉన్న తలుపు సందులోంచి పడగ్గదిలోకి పాముని వదిలాను.

ఎలాంటి పరిస్థితిలోనూ వాళ్లు ఆ పాముకాటునించి తప్పించుకోలేరు. ఆ గదిలో పాముందని వాళ్ళకు తెలియదు. కనుక వాళ్లు మంచం దిగిన వెంటనే పాము కాటేయటం ఖాయం. చివరికి అదే జరిగింది. ఆ ఇద్దరూ ఆ పాము కాటువల్లే చచ్చిపోయారు.

ఇంక నాగరాజారావ్ ఒక్కడు మిగిలాడు. నా ప్లాను ఎదురు తిరిగింది కానీ లేకపోతే ఈ పాటికి నాగరాజారావ్ కూడా పాముకాటువల్ల చచ్చి ఉండేవాడు.

నాగలక్ష్మి చచ్చిపోయాక నాగరాజారావ్ ఇల్లు కదలటంలేదని తెలిసింది. అందుకే వీడి పేరుమీద పాముని గూడెం పార్శిల్ చేశాను. కానీ వీడు ఇవ్వాళే మళ్ళీ మొదటిసారిగా బయటికి వెళ్ళటం వల్ల నేను పట్టుబడిపోయాను.కాని మీరను కొంటున్నట్లు నేను చేసిన పని తప్పని అనుకోవటంలేదు నేను.

మాలాంటివాళ్ళు ఏ ఆడదాని మీద చెయ్యేసినా మానభంగం అని పెద్దపేరు పెడతారు మీ గొప్పోళ్ళు. అదే గొప్పోళ్లు ఖూనీలు చేసినా కప్పడిపోతుంది.

మా అమ్మని ఆదిశేషు మానభంగం చేశాడు. పాముతో హత్య చేశాడు. ఆ విషయాన్ని పట్టించుకున్నవాళ్లు లేకపోయారు. ఎవరికీ తెలియకుండా చేసిన హత్య అది.

న్యాయం అన్నాక అందరికీ ఒకే న్యాయం ఉండాలి.

తప్పు ఎవరూ చేసినా తప్పే!

ఎలాంటి పరిస్థితిలోనూ నాకు న్యాయం జరగదని నాకు తెలుసు. అందుకే నేను ఏది న్యాయం అనుకున్నానో అది చేశాను.

మా అమ్మని చంపిన పాములే నన్ను పెంచాయి.

మా అమ్మ చనిపోవటానికి కారణమైన పాముల వల్లే ఆదిశేషు కుటుంబం నాశనమయింది...

ఆ పాములవల్లే ఆదిశేషుకు సాయపడినవాడి వంశమూ నాశనమయింది. ముందు, పాముకాటువల్లే మా అమ్మ చచ్చిపోయిందని ప్రజల్ని నమ్మిద్దామనుకున్నాడు ఆదిశేషు. కానీ అమ్మ తన ప్రాపకంలోనే ఉంటోంది కనుక ఆ అనుమానం తన మీదకే వచ్చే అవకాశం ఉందని ఆవిడను గుట్టుచప్పుడు కాకుండా మాయం చేశాడు!"

స్వామి చెప్పటం ఆపేశాడు.

ఆ గదిలోని వాళ్ళందరూ బెదురు బెదురుగా చూడసాగారు స్వామివైపు!

స్వామి నడుం విరిగిన పాములా అలాగే గోడకు జార్లబడిపోయాడు నిస్త్రాణగా!

శేషగిరి బుర్ర మొద్దుబారిపోయింది.

ఫణి నిశ్చలంగా ఉండిపోయాడు.

నాగరాజారావ్ నిశ్చింతగా వూపిరి పీల్చుకున్నాడు.

★

# వింత సంప్రదాయాలు

కర్ణాటక రాష్ట్రంలోని హాసన్ జిల్లాలో కడబాహళ్ళి అనే ఒక చిన్న గ్రామం ఉంది. ఇక్కడ ప్రతి సంక్రాంతికి నక్కల పూజ జరుగుతుంది. సంక్రాంతికి మూడురోజులు ముందుగా నక్కలవేటకు బయలుదేరారు. వేట అంటే నక్కను చంపి తీసుకురావటం కాదు. దాన్ని సజీవంగా, సాధ్యమైనంతవరకు గాయం తగలకుండా పట్టుకురావటం. ఈ వేటలో నక్క ఒకవేళ అనుకోకుండా మరణించినట్లయితే అది దుశ్శకునంగా భావిస్తారు. అందుచేత నక్కలవేటలో మంచినైపుణ్యం కలవారినే ఈ పనికి నియమిస్తారు. ఇటువంటి నక్కల వేటగాళ్ళకు ప్రత్యేక గౌరవం ఉంటుంది.

సంక్రాంతికి మూడురోజుల ముందు నియమింపబడిన నక్కవేటగాళ్ళు వేకువ ఝామునసే లేచి పవిత్ర స్నానంచేసి కడబాహళ్ళిలోని కామేటి రంగనాథ దేవాలయం దగ్గరకు వలలతో చేర్తారు. ఈ దేవాలయం సమీపంలో 'నక్కలవేట కోసమే నిర్మింపబడిన అతి ప్రాచీనమైన ఒకకట్ట ఉంది. ఈ కట్టమీద వారు తెచ్చిన వలలను ఉంచి భక్తితో పూజలు చేస్తారు. ఆ సమయంలో తప్పెట్ల శబ్దాలు మిన్నుముడతాయి. తర్వాత వలలను తీసుకొని రంగనాధుని ఆలయంలోనికి వచ్చి మళ్ళీ వలలను, రంగనాధుని పూజిస్తారు. అలా వలలతో ఆలయానికి ప్రదక్షిణం చేస్తూ ఒక్కొక్కరే అడవివైపు పరుగెత్తటం ప్రారంభిస్తారు. ఆ వేటగాళ్ళ వెంట కొందరు గ్రామస్తులు కూడ పరుగెత్తుతారు. వీరిని తప్పెట్ల శబ్దాలు వెన్నంటుతూనే ఉంటాయి.

వేటగాళ్ళు అడవిలోకి ప్రవేశించిన తర్వాత ఎక్కడంటే అక్కడ వలపన్నటానికి వీలులేదు. ఒక్కోదిక్కున ఒక్కో ప్రదేశంలో మాత్రమే వలపన్నాలనే నియమం ఉంది. ఆ ప్రదేశాల్లో వలను పన్నిన తర్వాత నక్కలు దాగి ఉండే కంపకాలు, గుట్టల దగ్గరకు పరుగెత్తుతూ తప్పెట్లతోను, కేకలతోను ఆర్భాటాలు చేస్తారు. భయపడి బయటకు వచ్చిన

నక్కలను వలలవైపు తరిమి అవి అందులో చిక్కుకునేట్లు చేస్తారు. వలలో చిక్కుకున్న నక్కలను జాగ్రత్తగా పట్టుకొని నోరు, కాళ్ళు తాడుతో కట్టి వేస్తారు. తర్వాత సంతోషంతో తప్పెట్ల వాయిద్యాలతో దేవాలయంలోకి తీసుకు వచ్చి, వాటిని పూజించి అక్కడున్న ఒక బోనులో ఉంచుతారు. ఈ తంతు మూడురోజులు జరుగుతుంది. ఈ మూడు రోజుల్లోను వీలైనన్ని ఎక్కువ నక్కలను పట్టుకోవటానికి ప్రయత్నిస్తారు. ఎన్ని ఎక్కువ నక్కలు దొరికితే అంతశుభం అని వారి నమ్మకం. వేట సమయంలో నక్క చచ్చినట్లయితే ఒక గుంట తవ్వి భక్తిపూర్వకంగాదానికిఅంత్యసంస్కారం చేసి మరీ ఊళ్లోకి వస్తారు.

సంక్రాంతిరోజు సాయంత్రానికి కడబాహళ్ళిలోపెద్దతిరుణాలజరుగుతుంది. ఈ నక్కల పూజా మహోత్సవాన్ని తిలకించటానికి దూరదూరాలనుంచి కూడా వేలాది మంది జనం వస్తారు. హోటళ్ళు, నానారకాల అంగళ్ళు అక్కడ



ప్రత్యక్షమవుతాయి

రాత్రి పదిగంటలకు దేవాలయం ఎదుట నక్కల చెవులకు పోగులుకుట్టే కార్యక్రమం జరుగుతుంది. నియమింపబడిన ఒక కంసాలి వచ్చి నక్కల చెవులకు రాగిపోగులుగాని, మరేదైనా లోహపు పోగులు కాని కుడతాడు. పూర్వం బంగారపు పోగులు కుట్టేవారట. నక్కల చెవులకు పోగులు కుట్టిన తర్వాత రంగనాధుని రథోత్సవం ప్రారంభమవుతుంది. రథం ముందు నక్కలను పట్టుకొని ముందుకు సాగుతారు. ఆ రాత్రంతా వివిధ వాద్యగోష్టులు, జానపద నృత్యాలు, కోలాటాలు, కీలుగుర్రాల ఆటలు కనులవిందుగా జరుగుతాయి.

తెల్లవారుతూ వెలుగు ప్రసరించేకొద్దీ ఉత్సవంముగిసి, నక్కలను పట్టుకున్నవారు ఊరుకు సుమారు మైలుదూరాన ఉన్న ఒక చిన్న మంటపం వైపు పరుగెత్తుతారు. వీరివెంట తప్పెట్లు వాయించేవారు, చూడటానికి వచ్చినవారు కూడ చలిని లెక్కించక పరుగెత్తుతారు. మంటపం దగ్గరకు వచ్చిన తర్వాత ఆ నక్కలకు పూలదండలువేసి, పూజలు చేసి వాటి బంధనాలు ఊడదీస్తారు. అవి పరుగెడుతూంటే వాటి వెంట తామూ వీలైనంత దూరం పరుగెత్తి సంతోషంగా వెనక్కు తిరిగి వస్తారు.

కడబాహళ్ళిలో మాత్రమే జరిగే ఈ నక్కల పూజా సంప్రదాయం ఎక్కడి నుంచి సంక్రమించిందో, ఎవరు ఎప్పుడు ప్రారంభించారో నిర్దిష్టంగా తెలియకపోయినా ఆచారంమాత్రం కొనసాగుతూనే ఉంది.

* * *

దయ్యాలు, భూతాలు ఉన్నాయో లేదో తెలియకపోయినా భయపడేవాళ్లను మాత్రం అవి మరింతగా భయపెడతాయి. ధైర్యంగలవాళ్ళ జోలికి రానేరావు.

హిమాచల్‌ప్రదేశ్‌లోని 'కుమాయూన్' తెగకు చెందిన ప్రజలు ధైర్యసాహసాలకు పెట్టింది పేరు. 'అల్మోరా' జిల్లాలోని 'సౌల్' నది ఒడ్డున దయ్యాలు సంచరిస్తుండేవని ఒక నమ్మకం. ఆ దయ్యాలకి నాయకుడిని 'హసన్' అని పిలిచేవారక్కడివారు.

ఒకసారి ఓ గ్రామస్థుడు ఆ తోవన వెళుతుండగా దయ్యాలు పాటలుపాడుతూ డాన్స్ చేస్తున్న అలికిడి వినబడింది. అవి అతన్ని చంపాలని గుంపుగా వెంబడించాయట. కాని అతనువాటిని ధైర్యంగా ఎదుర్కొని దయ్యాల నాయకుడి గడ్డం పట్టుకుని గట్టిగా ఒక కుదుపు కుదిపాడట. దయ్యాలను పారదోలే ఉపాయం చెప్పమని అతన్ని నిర్బంధించగా ఆ దయ్యాల నాయకుడు భయపడి అతనికి ఆ ఉపాయం చెప్పాడట. అప్పటినుండి అక్కడి ప్రజలు దయ్యాలను పారదోలటంలో ప్రసిద్ధికెక్కారని ఒక కథ.

కుమాయూన్ ప్రజలు తమకు ఏదైనా విపత్తు సంభవించినప్పుడు గ్రామపెద్ద దగ్గరికి వెళతారు. ముఖ్యంగా దీర్ఘవ్యాధులు సంభవించినప్పుడు, మానసిక రోగాలు వచ్చినప్పుడు అవి దయ్యాల వలనే సంభవిస్తాయని వారు నమ్ముతారు. గ్రామపెద్ద రోగి వివరాలు తెలుసుకుని, దాని నివారణకు ఒక క్రతువు జరిపిస్తాడు. ఆ క్రతువు జరిపిన రోజు రోగి బంధువు



లందరూ ఉపవాసం చేస్తారు. తర్వాత భూత వైద్యుడు వస్తాడు. అతనికి కొంత ధాన్యం, ఒక రాగి నాణెం సమర్పిస్తారు. భూతవైద్యుడు పూజాపునస్కారాలు చేసి రోగికి ఆవహించిన దేవత ఎవరో చెబుతాడు. అతనిని గ్రామస్థులు 'డుంగ్రి' అంటారు. డుంగ్రి గ్రామానికి పోతురాజువంటివాడు. డుంగ్రి ఉద్రేకంతో పాటలు పాడుతూ డాన్స్ చేస్తాడు. అతనికి సాంబ్రాణి, అగరు పుల్లలతో ధూపం వేస్తారు. తాగటానికి పొగాకు రసం ఇస్తారు. ఆ రసం సేవించి మరికొంత సేపు డాన్స్ చేస్తాడు. కొంతసేపటికి నృత్యం ఆపుతాడు. చుట్టూ కూర్చుని ఈ తతంగం అంతా చూస్తున్న గ్రామస్థులు, బంధువులు చప్పట్లు కొడతారు. రోగి ఏ వ్యాధితో బాధపడుతున్నాడో, దానికి నివారణ ఏమిటో డుంగ్రి చెపుతాడు. దాని ప్రకారం రోగి బంధువులు చేస్తారు.

కుమాయూన్ తెగ ప్రజలలో కొన్ని నమ్మకాలు ఉన్నాయి. నృత్యం చేయటం వలన దుష్టశక్తులు పారిపోతాయని వారు నమ్ముతారు. కొన్ని సందర్భాలలో నృత్య కార్యక్రమం నెలల తరబడి సాగుతుంది. కుమాయూన్ కొండలలో ప్రతిచోట దేవాలయాలున్నాయి. కాని వాటిలో దేవతా విగ్రహాలుండవు. అవన్నీ దయ్యాలు, భూతాలు నివసించే గృహాలని వారు నమ్ముతారు. ప్రతి పౌర్ణమి రోజు వారు దయ్యాలకి పాలు, మిఠాయిలు నైవేద్యం పెడతారు.

నాగరికత పెరిగినకొలదీ కుమాయూన్ ప్రజలలో ఈ మూఢనమ్మకాలు తగ్గిపోయాయి. కాని మారుమూల గ్రామాలలో ఇప్పటికీ దయ్యాలను, భూతాలను కొలిచే ఆచారం ఉన్నది. ★



# ప్రథమ చికిత్స

శ్రీలతకు క్రమశిక్షణంటే ప్రాణం. చిన్నప్పుడు తను కాన్వెంట్లో క్రమశిక్షణ ఎలా పాటించేదో, ఎన్ని ప్రైజులు అందుకుందో భర్తకు రోజుకొకసారయినా చెప్పందే నిద్రపోదు. పిల్లలిద్దర్ని ఇంటికి కాస్తదూరంలోనున్న కాన్వెంట్లోనే చేర్పించింది-చక్కటి క్రమశిక్షణ అలవడుతుందని. రోజూ స్కూల్లో చెప్పినపాఠాల్ని క్రమశిక్షణ తప్పకుండా ఇంటిదగ్గర మళ్ళీ మళ్ళీ చదివిస్తుంది శ్రీలత.

ఆరోజు ప్రథమ చికిత్సగురించి పాఠం చెబుతోంది శ్రీలత పిల్లలకు.

"బాబూ శ్రీధర్! ప్రథమచికిత్స అంటే మనకి ఏదైనా ఆపద కలిగినప్పుడు డాక్టరు దగ్గరకు వెళ్లేలోపల హాని కల్గకుండా మనంతట మనం చేతనయిన చికిత్స చేసుకోవటం అని అర్థం. ఉదాహరణకు ఒక మనిషికి నిప్పంటుకొందనుకొందాం. అప్పుడు వెంటనే అతనిమీద నీళ్ళు పోయకూడదు. బొబ్బలెక్కువవుతాయి. గాయం మీద 'నవనీతం' గానీ, బజార్లో దొరికే బర్నాల్ ఆయింట్ మెంట్ గానీ రాయాలి"

"'నవనీతం' అంటే ఏమిటి మమ్మీ?" ప్రశ్నించాడు బాబు.

"గుడ్! డౌట్స్ వెంటనే అలా అడగాలి" కొడుకువైపోసారి మెచ్చుకోలుగా చూసి, "నవనీతం అంటే సున్నపు తేట కొబ్బరినూనెల మిశ్రమం అన్నమాట" అంది శ్రీలత.

"మరి కరెంట్ షాక్ తగిలితే ఏంచేయాలి మమ్మీ?" మళ్ళీ ప్రశ్నించాడు శ్రీధర్.

"కరెంటు తగిలిన మనిషికి వళ్ళంతా బాంకెట్ కప్పి ఉంచాలి డాక్టర్ వచ్చే




దాకా. అలాగే చెరువులో పడిన మనిషికి ఏం చేయాలంటే..." అంటూ ఓపిగ్గా వివరించింది శ్రీలత బాబుకి.

# కపటు

మర్నాడు బాబు పరుగెత్తుకొంటూ వచ్చాడు స్కూల్ నుండి.

"ఏరాబాబూ! చెల్లిని వదిలిపెట్టి ఎందుకొచ్చావ్?" అడిగింది కోపంగా శ్రీలత.

"మరేమమ్మీ... మరే..." వగరుస్తూ ఆయాసంతో ఏదో చెప్పబోతున్న బాబును చూసి కంగారుగా "ఏమయిందిరా చెల్లికి?" ఆతృత కనిపించింది శ్రీలత కళ్ళలో!

"అదే మమ్మీ..స్కూల్ వదిలాక చెల్లీ, నేనూ వస్తూంటే దారిలో చెరువు లేదూ?" ఆగాడు బాబు!

"ఒరేయ్‌బాబూ!సంగతేమిటో త్వరగా చెప్పరా నన్ను కంగారుపెట్టక" అసహనంగా అడిగింది శ్రీలత.

"చెల్లి చెరువులో పడిపోయిందిమమ్మీ!"

"ఆఁ! చెరువులో పడిపోయిందా?" బయటకు పరుగెత్తబోయింది భయంగా శ్రీలత.

"చెల్లికేం కాలేదు మమ్మీ! నేను కూడా చెరువులోదిగి, చెల్లిని బయటకు తీశాను. నువ్వు చెప్పినట్లుగా పొట్టనొక్కి నీళ్ల బయటకు తీద్దామనుకుంటే అరుస్తూ చెల్లి పారిపోయింది"

"పరిగెత్తి పారిపోయిందా?" విస్తుపోయి అడిగింది శ్రీలత.

"అవునుమరి. ఆ చెరువులో నీళ్లు లేవుగా? నీళ్లులేని చెరువులో పడ్డవాళ్ళకి ప్రథమ చికిత్స ఎలా చెయ్యాలో అర్థంటుగా చెప్పుమమ్మీ" ఆయాసంతో ఒగరుస్తూ అడిగాడు బాబు.

—కోనె హరిబాబు

# బ్రహ్మరాత



సాంబయ్య-మనిషి కొంచెంమెతకయినా ఉద్దండురాలైన పెళ్లాం దొరికింది. భార్య అనసూయ గీటు గీస్తే,దాన్నెప్పుడూదాటి పోడు. అనసూయ లేకపోతే అతని వ్యాపారం అంత వృద్ధిలోకి వచ్చుండేది కాదు. అనసూయ ఖర్చులు మితంగా పెడుతూ, పదేళ్ళలో లక్షరూపాయలు పొదుపు చేసింది. దాని మీద వచ్చిన వడ్డీతోసహా లక్షన్నర పెట్టి సుందరమైన భవనం నిర్మించింది.

తను కూడా గొప్ప ఇళ్ళ వాళ్ళలో జమయిపోవాలని తాపత్రయం పట్టుకుని అనసూయ కొంత కాలంనుంచి పెద్దిళ్ళ ఇల్లాళ్ళతో పరిచయాలు పెంచుకుంది.

ఈ గృహప్రవేశం వారిని అందరినీ ఆహ్వానించడానికి అవకాశం ఇచ్చింది. డాక్టరు పెరుమాళ్ళు వాళ్ళ ఫామిలీ డాక్టరు. ఆయన భార్యా సమేతంగా వస్తే ఫొటోలు వగైరా తీయించి, ఉత్తరోత్తరా నలుగురితో గొప్పగా చెప్పుకోడానికి వీలుంటుంది.

అనసూయ లిస్టువేసింది. ఆహ్వానాలు అయిదు వందల మందికి పంపాలి. అందరూ వస్తే, అంతకంటే కావలసిందే ముంది? షడ్రషోపేతంగా విందుచేయొచ్చు కాని వందమందయినా రాకపోతే, చేయించిన వంటకాలు వృధా అయిపోతాయే... ఎలా?

ఒక స్నేహితురాల్ని సంప్రదించింది ఈ విషయంలో.

"ఏం లేదక్కయ్యగారూ! ఇంగ్లీషు వాళ్ళ పద్ధతి అనుసరించండి. మీకు ఖరారుగా తెలిసిపోతుంది ఎంత మందొచ్చేదీని".

"అంటే ఏంచేయాలి?

"ఆహ్వానం అడుగున R.S.V.P. అని అచ్చు కొట్టించండి."

"దాని అర్థం?"

"ఆహ్వానాన్ని అంగీకరించినట్టుతెలియజేయమని వేడుకోలు. రాదలచుకున్న వాళ్ళు ఉత్తరం ద్వారానో,ఫోన్‌ద్వారానో ఆ సంగతి మనకు తెలియపరుస్తారు. రాదలచుకోనివాళ్ళు మౌనంగా ఉండిపోతారు. గృహప్రవేశానికి ముందు రోజు కల్లా మీకు పక్కాజాబితా తయారయిపోతుంది. దాన్నిబట్టి విందుకేం చేయించాలో, ఎంతమందికి చేయించాలోనిర్ణయించొచ్చు."

అనసూయకు సలహా నచ్చింది. ఆరు రంగులలో R.S.V.P.తో ఆహ్వానం



ముద్రింపించి, అయిదు వందలమందికి పంపింది. యాభై మంది ఇన్విటేషన్ అందగానే తమ అంగీకారం తెలియపర్చారు. తర్వాత నెమ్మది నెమ్మదిగా ఫోనులొస్తున్నాయి.

గృహప్రవేశం దగ్గరకి వస్తోంది. డాక్టరు పెరుమాళ్ళుగారు ఏ సంగతీ తెలియజేయలేదు. అలాంటి ఘరానావ్యక్తి వస్తేనే విందు నిండుగా ఉంటుంది. అలా ఎదురు చూస్తుంటే గృహప్రవేశం రేపనగా, డాక్టర్‌గారి దగ్గరనుంచి ఉత్తరం రానే వచ్చింది.

సాంబయ్య దంపతులు బ్రహ్మానంద భరితులయ్యారు ఆ కవరు చూడగానే.

అనసూయ కవరు ఆత్రుతగా చింపి చూసింది. అందులో రెండే లైనులు రాసున్నాయి. ఎన్ని సార్లు చదివినా ఆమెకు బోధపడలేదు. భర్తకిచ్చింది చదివి అర్థం చెప్పమని. కాసేపు బుర్రగోక్కుని పెదవి విరిచాడు సాంబయ్య.

"డాక్టరుగారికి ఫోన్ చేసి కనుక్కోమంటావా అనసూయా?"

"చాలు చాల్లెండి. ఏం మర్యాదగా ఉంటుంది?

"ఇక్కడేం రాసుందో తెలుసుకోవడం ఎలా మరి?"

"డాక్టర్ల రాతలు మందుల షాపు వాళ్ళకు తేలికగా అర్థమవుతాయి. ఈ ఉత్తరం పెద్దమందులషాపుకి దేనికయినా తీసుకెళ్ళి చూపించండి, వాళ్ళుచెబుతారు"

"భలే ఆలోచన చెప్పావు" మురిసిపోయాడు సాంబయ్య.తక్షణం ఆ కాగితం పట్టుకుని మందుల దుకాణానికి బయలుదేరాడు.

అరగంట దాటాక వీక్కమొహంతో తిరిగొచ్చాడు సాంబయ్య.

"ఏంచెప్పాడు మందులషాపువాడు?" ఆత్రుతగా అడిగింది అనసూయ.

సమాధానంగా పాంటు జేబులోంచి చిన్న మందుసీసా తీసి ఆమె చేతికిచ్చాడు.

"ఏమిటిది?"

"ఉత్తరంతీసుకెళ్ళి మందుల షాపులో చూపించాను. గబగబా లోపలకెళ్ళిబీరువా లోంచి ఈ బాటిల్ తెచ్చిచ్చి పంచొమ్మిదిన్నర ఇమ్మన్నాడు. ఇచ్చి పట్టుకొచ్చాను."

"ఇదేం ఖర్మండి?"

"అర్థం కాకపోతే చస్తాడా వాడు మట్టుకు! అమ్ముడు కాని మందేదో చూసి మనకు అంటకట్టేశాడు" వ్యాపారం చూసుకోడానికి విసురుగా వెళ్ళిపోయాడు సాంబయ్య.

— ప్రతాపరావు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

